సాంస్కృతిక పురోగతికూడ జరిగింది ప్రజలు ప్రశాంతంగా జీవించారు నిష్ఠి కదంప్ప, నిష్ఠి వీరప్పల మంత్రిత్వం సఫలమైంది రాజు వీరవైష్ణవుడు, మంత్రులు వీరశైవులు ఈ మతసామరస్యం గణనీయమైంది

పామనాయకుని దేవేరి తిమ్మమ్మ 1772లో మరణించింది పామనాయకుడు 1771లో జబ్బుతో మంచంపట్టాడు జబ్బు దినదినానికి హెచ్చిందేకాని, తగ్గలేదు అతడు 1773లో (విజయ సంవత్సరం, ఆశ్వయుజ బహుళ తదియనాడు) పరమపదం చేరాడు ఆ సమయంలో అతని తక్కిన భార్యలు జల్లిపాటి లచ్చమ్మ, గలుగు వెంకమ్మ, వాలిహాళ్ళ పెద్దమ్మ, రామక్క, మంగమ్మ దగ్గర ఉన్నారు పామనాయకుని రాజ్యకాలం 1752–1773 ఇతడు 1739 సిద్ధార్థి సంవత్సర పుష్యశుద్ధ సప్తమినాడు రమణప్ప నాయకునికి లక్ష్మాంబకు జన్మించాడు 34 సంవత్సరాలే జీవించాడు సురపుర రాజ్యం చరిత్ర ప్రస్తుతం ముమ్మడి రాఘవ పామనాయకుని వరకే అవసరం గనుక సంగ్రహంగా తెలిపాను

సురపురం రాజ వంశావళి జక్కప్పతేగాయి వరకు ఇదివరకు తెలిసిందే సురపురం రాజ్యస్థాపకుల మొదలు తక్కినవారి వంశక్రమం ఇది [167]

1 గడ్డి పిడ్డనాయకుడు
(సురపురరాజ్య స్థాపకుడు)
రాజ్యపాలన కాలం 1636–1666

2 హనరంగి (పచ్చంగి) పామనాయకుడు
(ఔరంగజేబు మంచి సన్మానం, బిరుదులు పొందిన వీరుడు)
1666-1687

3 పీతాంబర బహరి పిడ్డనాయకుడు
1687–1726

4 ఇమ్మడి పామనాయకుడు
1727-1741

5 ముమ్మడి పిడ్డనాయకుడు
1742–1746

6 మొండిగై (మొండిచేయి) వెంకటప్పనాయకుడు
1747–1752

---

167 కపటరాల్ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాస

7 ముమ్మడి రాఘవ పామునాయకుడు
(భార్గవ పురాణకర్త)
1762–1778

8 ఇమ్మడి వెంకటప్ప నాయకుడు
(కిరీటి వెంకటాచార్యులు ఇతని ఆస్థాని)
1778–1802

9 ముమ్మడి పెద్దనాయకుడు
1802–1818

10 ముమ్మడి వెంకటప్ప నాయకుడు
1818–1827

11 కృష్ణప్పనాయకుడు
1827-1849

12 నాల్గడి వెంకటప్పనాయకుడు
1842-1868

ఇతడు బ్రిటిష్ వారికి ఎదురుతిరగడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వం ఇతనికి మరణశిక్ష విధించింది తర్వాత సురపురం నిజాం రాజ్యంలో చిన్న సంస్థానమయింది ఈ వీరవ్యాధవంశం వారు ఇప్పటికీ ఉన్నారు స్వాతంత్ర్యానంతరం అన్ని సంస్థానాలలాగ ఇదీ రద్దయింది ఈ రాజవంశంవారయిన రాజా వెంకటప్పనాయకుడు లోక్‌సభ సభ్యులుగా వున్నారు

## వీర శూర వ్యాధ జాతి

సురపురరాజ వంశీయులు వ్యాధజాతివారు ఈ జాతి పరాక్రమానికి, నీతినియమాలకు గీటురాయయిన జాతి, వ్యాధ శబ్దం వ్యాధ-బ్యాధ-బేద అయింది తమిళంలో వేడ - వేడర శ్రీలంకలో ప్రాచీన జాతి వెద్ద, ఈ పదమూ వ్యాధ శబ్ద భవమే తెలుగులో బోయ అయింది క్రమంగా వ్యాధ – బ్యాధ – బ్యాద అయినట్లే, వాహ–వాఅ-వా అ – బోయగా మారింది వ్యాధుల పరాక్రమాన్ని, సాహసాన్ని, శరీరసౌష్ఠవాన్ని, నిష్కాపట్యాన్ని గురించి గాథాసప్తశతిలో వర్ణనలు కొల్లలు రెండువేల సంవత్సరాలనుండి ఈజాతివారు సేనానాయకులుగా దుర్గపాలకులుగా, తలారులుగా (నగరపాలకులుగా) కీర్తిపొందారు భారతదేశాన్ని పాలించిన ప్రతి రాజవంశమూ ఈ వ్యాధులను ఆదరించింది చాళుక్య, రాష్ట్రకూట, విజయనగర, మొగల్, కుతుబ్‌షాహి, బహమనీ రాజుల సైన్యాలలో ప్రబలంగా వున్న దళాలు వ్యాధులవి విజయనగర చక్రవర్తులు, ముఖ్యంగా కృష్ణదేవరాయలు వీరిని సేనానాయకులుగా, రాజప్రతినిధు

లుగా, నగరరక్షకులుగా, తనకు అంగరక్షకులుగా నియమించాడు. రాయల అంగరక్షకుల దొన్తై నాయకుడు గౌతగు పాలుడు. బోయతే పల్లరక్షకుని పాలెగారు. వీరి మాతృభాష తెలుగు (ఈ విచిత్రమైన తెలుగు గురించి ప్రత్యేకంగా పరిశోధన జరగాలి)

ఈ వ్యాధుల మూలస్థానం దక్షిణాపథంలో నేటి కర్నాటకలోని గుల్బర్గ, బిజాపూర్, బెళగాంవ్, రాయచూర్, బళ్ళారి, చిత్రదుర్గం జిల్లాలు, ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలు, తమిళనాడులోని ఉత్తర ఆర్కాడు, చెంగల్పట్టు జిల్లాలు. వీరి రణోత్సాహం అసాధారణం. ఈ బోయ పాళెగాళ్లు ముఖ్యంగా సురపురం వాళ్లు, తాలిమల్లి పాళెగాళ్ల తమకు ఎదురుతిరిగడం వల్ల భీతిచెందినవారు ఈ వీరివారిని సైన్యంలో చేర్చుకోరాదని ఉత్తర్వు చేసింది [168] వ్యాధుల పరాక్రమం గురించి, పద్మంగి పామనాయకుని గురించి సుప్రసిద్ధ చరిత్రకారుడు ప్రొఫెసర్ జదునాథ సర్కార్ ముక్తకంఠంతో పొగిడారు – "అతని పదాతి సైనికులు గొప్ప గురికారులుగా, మహాధైర్యవంతులుగా పేరుపొందారు వారు యుద్ధంలో గాయాలను, మృత్యువును లెక్కపెట్టేవారు కారు' [169]

బేడ శబ్దం ఉచ్చారణ తెలియని ముస్లిం నోట్లోపడి వివిధ వికారరూపాలు పొందింది బేరడ్, బిర్కి, బిర్డి, బేండర్, బేదర్ అని అట్లే వాగినగిరి కూడ వాగిన్ ఖేరా అని, వాకిన్‌ఖేడ్ అని వికారరూపాలు పొందింది బేదర్‌కు ముస్లిములు బే+దర్ భయరహితులు అని వ్యుత్పత్తి చెప్పారు చివరకు డాక్టర్ రామరాజుగారి వంటివారు ఆయనను అనుసరించి తక్కినవారు "బేదర్=నిర్భయులు" అని వ్రాయడం గమనార్హంగా [170] వాక్-ఇన-గిరి = వాగినగిరి బ్రహ్మగిరి అని అర్థం

## భార్గపురాణంలో వంశావళి

భార్గవపురాణం ప్రథమాశ్వాసంలో రాఘవపామనాయకుడు వర్ణించిన వంశక్రమం ఇది ఈ అన్వయానికి ఆదిపురుషుడు గుహుడు అతని వంశం అనేకశాఖలుగా విస్తరించింది ఆ శాఖలలో కొన్ని వంశంలోనివారు

1 నరసింహ మహీపాలుడు

2 నడియర నాయకుడు

3 కల్ల మహీ వల్లభుడు

---

168 కపటరాళ కృష్ణరావు—సురపురసంస్థాన ఇతిహాస, పుట 224–300 వివరాలు చూడండి

169 పై గ్రంథం పుట 23

170 డాక్టర్ బి రామరాజు మరుగుపడిన మాణిక్యాలు, ప్రొఫెసర్ సాళ్వ-కృష్ణమూర్తి ఋచలాత్మ్యాపరిణయ పీఠిక, పుట 3

4 చినహనుమ ధరణీకాంతుడు

5 హావి నాయకుడు

6 పెదసోమ నాయకుడు

7 ఎఱసింగ ధరణీధవుడు

8 మహిరి ధరాధ్యక్షుడు

9 వీరణంపి నాయకుడు

10 బలిసోమ నాయకుడు

11 పెదపామ నాయకుడు

12 దేశాయి అక్క భూవిభుడు

13 గద్దె పిడ్డ నాయకుడు

14 పెదపామ నాయకుడు
(పచ్చంగి పామనాయకుడు)

15 పీతాంబరాధిప నాథుడు
(పీతాంబర బహరి పిడ్డ నాయకుడు)

ఈ పీతాంబరాధిపనాథునికి ఐదుగురు కుమారులు




సురపురరాజవంశంలో పామ(హవి) నాయకధేయులు పలువురు వుండడంవల్ల గ్రంథ సంస్కర్తలు, పండితులు తికమక పడ్డారు అంతేకాక వీరు వీరులయి యుద్ధాలలో మడియడం వల్ల ఎక్కువకాలం రాజ్యం చేయలేకపోయారు అందువల్ల ఒక తరంలో వారసులు ముగ్గురు నలుగురు కూడ రాజులయ్యారు పీతాంబర నాయకుని పెద్దభార్య కుమారుడైన పామనాయకునికి పెద్ద భార్య కుమారుడు పిడ్డ నాయకుడు, రెండవ భార్య కుమారుడు వెంకటప్ప నాయకుడు (వెంకట క్ష్మావిభుడు) పిడ్డ నాయకునికి

171 లేఖకుడు హనుమధరణీపతిని వదలి పెట్టాడు

సంతానంలేదు గనుక ఇతని సవతి తమ్ముడు వెంకటప్ప నాయకుడు రాజయ్యాడు ఇతడే మొండిచేయి వెంకటప్ప నాయకుడు ఇతనికి కూడ పుత్రసంతానం లేదు ఇతని ఒక పిన తండ్రి కృష్ణ భూపాలుడు (కృష్ణప్ప నాయకుడు) వెంకటప్ప నాయకునికి ఇతనికి (కృష్ణప్పకు) మనస్తాపంవల్ల ఇతడు సురపురం వదలి వెళ్లాడు అందువల్ల మరొక పిన తండ్రి రమణ ధరావరుడు (రమణప్ప) రాజసుడయ్యాడు అతడు వృద్ధుడు కావడంవల్ల రాజ్యం వద్దన్నాడు అతని కుమారుడు రాఘవ పామనాయకుడు రాజయ్యాడు పేర్లవల్ల, రాజ్యకాలం స్వల్పం కావడంవల్ల పలువురు చాల భ్రమ పడ్డారు "పీతాంబరావని పాలుని ఐదుగురు కొడుకులలో పామ మహీధవు డొకడు, ఇతని కొడుకు వెంకట క్ష్మాపాలుడు అతడే వెంకటప్ప కానోపును అట్లాగాక భార్గవపురాణ కర్త్రయగు రాఘవ భూపాల పామనాయకునకు వెంకటప్ప యను పుత్రుడుండెనేమో తెలియరాదు పామ మహీధవుని కొడుకైన వేంకట క్ష్మాపాలకుడును రమణ ధరణి రమణుని కొడుకైన రాఘవ భూపాల పామనాయకుడును అన్నదమ్ముల పిల్ల లగుటచే సమకాలికులే అగుదురు"[172] అని ప్రొఫెసర్ సార్వకృష్ణమూర్తి సందేహం ప్రకటించారు ఈ సందేహాలు నివారించడం కోసమే పైన వివరంగా చరిత్ర ఇచ్చాను

రాఘవ పామ భూపాలు డిచ్చిన వంశావళిలో నరసింహ నాయకుని తర్వాత వరియర నాయకుడని తెలిపాడు తక్కిన దంతా సరిగావుంది ఇతర చారిత్రాధారాలమబట్టి నరసింహ నాయకుని తర్వాత పీర తిమ్మనాయకుడు, సింగప్ప నాయకుడు ఉన్నారు భార్గవ పురాణ పటాలికలోని వంశావళి తెలిపే వచనంలో ఒక పంక్తి లేఖక ప్రమాదంవల్ల ఎగిరిపోయిందని తోస్తుంది "తన్మహీశానికి పీరవరుండగు పీర తిమ్మనాయకుండును, అవ్వీరునకు సింహ విక్రమదగు సింగప్ప నాయకుడును" అని చేర్చితే సరిపోతుంది

ఇంత స్పష్టంగా చరిత్ర ఉండగా, శ్రీ ఆరుద్ర "భార్గవ పురాణాన్ని వ్రాసిన సురపురం అధిపతి పామనాయకుడు క్రీస్తుశకం 1696 దాకా జీవించాడు" అని వ్రాశారు"[173] ఆయన ఆధారాలు చూపితే బాగుండేది శ్రీ ఆరుద్ర పచ్చంగి పామనాయకుడు, రాఘవ పామ నాయకుడు ఒకరే అని భ్రాంతిపడి వుంటారు పచ్చంగి పామనాయకుడు కూడ 1696 వరకు జీవించలేదు అతని రాజ్యకాలం 1686-1687 అతడు ఔరంగజేబు నుండి మన్‌సబ్‌లు స్వీకరించడానికి ఢిల్లీకి వెళ్లాడు దర్బారు మర్యాదల తర్వాత హఠాత్తుగా 27-12-1687న మరణించాడు[174] మరి 1696 వరకు జీవించిన పామనాయకు డెవరో!

---

172 ప్రొఫెసర్ సార్వకృష్ణమూర్తి అభిలాత్మజా పరిణయ పీఠిక, పుట 19

173 సమగ్రాంధ్ర సాహిత్యం సంపుట 13, పుట 47

174 ప్రొఫెసర్ జదునాథ సర్కార్ హిస్టరీ ఆఫ్ ఔరంగజేబ్, సంపుటం 4 పుట 397

## కిరీటి వెంకటా చార్యులు

ప్రకృతానుప్రసక్తంగా అణ్ణయాచార్యుల కుమారులైన కిరీటం వెంకటాచార్యులను గురించిన ఊహాపోహలను, అసంబద్ధపు ప్రచారలను సరిదిద్దవలసివుంది. కిరీటం వెంకటాచార్యులు ఇమ్మడి వెంకటప్ప నాయకుని లేక హిరియ (పెద్ద) వెంకటప్ప నాయకుని ఆస్థానంలో వున్నారు.

ఇమ్మడి వెంకటప్ప నాయకుడు భార్గవపురాధికర్త రాఘవ పామనాయకుని కుమారుడు. ఇతని రాజ్యకాలం 1778-1808 ఇతడూ మహావీరుడు మహాపరాక్రమవంతుడు. నిజాముతోను, రఘునాథరావు పీష్వాతోను, టిప్పు సుల్తానుతోను, ఆంగ్లేయులతోను యుద్ధాలు చేస్తూ, సంధులు చేసుకుంటూ, సహాయపడుతూ 29 సంవత్సరాలు పాలించాడు ఎంతో రాజనీతిజ్ఞతతో. అభినవ వేదాంత దేశిక బిరుదాంకితులైన, అణ్ణయాచార్యుల సోదరులైన శ్రీనివాసాచార్యులు తమ తత్త్వ సూత్రాంతంలో ఇతని ఆధ్యాత్మికోన్నతిని వర్ణించారు. ఇతడు దేశానికి చేసిన గొప్ప సేవ అప్పటి పిండారీల దండును అణచివేయడం. పిండారీల బాధ విపరీతం కాగా, ఇతడు తన రాజ్య పరిపాలన భారాన్ని దాదిమరి కృష్ణ నాయకునికి అప్పగించి, తన వీర నాయక బృందంతో పిండారీల వెంటబడి తన రాజ్యం సరిహద్దుల అవతల తరిమి నరికి కోస్తార అనే పట్టణంలోని పెద్ద చెరువులోకి విసిరి పడవేశారు.

అణ్ణయాచార్యులకు ముగ్గురు కుమారులు, శ్రీ ఆయన సోదరులైన శ్రీనివాసాచార్యులకు సంతానం లేదు. కవి సప్తతి గారులా ఈ విషయంలో పొరపడ్డారు [175]

అణ్ణయాచార్యులు

| | | |
|---|---|---|
| శ్రీనివాసాచార్యులు | కిరీటం వెంకటా చార్యులు | చిన్ని వెంకటాచార్యులు |

శ్రీనివాసాచార్యుల చరిత లేమి లభించడంలేదు. తక్కిన అన్నదమ్ములిద్దరి పేర్లు ఒకటే అవడంవల్ల చిన్నవారి పేరు చిన్ని వెంకటాచార్యులన్నారు. విశిష్టాద్వైత కిరీటాన్ని ధరించినందున పెద్ద వెంకటాచార్యులకు కిరీటం వెంకటాచార్యులనే పేరువచ్చింది [176] ఈయన 1 గణసూత్రార్థవాదః 2 శృంగార తరంగిణి 3 భావశతకమ్ 4 రుంయూమారుతః (గదాధరీయఖండనమ్) 5 అలంకారకౌస్తుభమ్ 6 రసిక మానసోల్లాస భాణః 7 కూటిపటనమ్ 8 ఉషా పరిణయ నాటకమ్ 9 యతిరాజ దండకమ్ 10 హయగ్రీవదండకమ్ 11 అచలాత్మజా పరిణయము (తెలుగు) మొదలైన షణ్ణవతి (96) గ్రంథాలు రచించారు.

---

175 — బయసు వెంకటయ్య, కవిసప్తతి

176 పెరుమాళ్లగుండాచార్య నగరనాథ దర్పణ పుట 104

కిరీటం వెంకటాచార్యులు ౨౦ భాషా విదులు, తెలుగు, కన్నడ, మహారాష్ట్రి, హిందీలలోను కవిత చెప్పగల దిట్ట. ఈయనకు, ఇమ్మడి వెంకటప్ప నాయకునికి కొంత మన స్పర్థ ఏర్పడింది. ఈయన శిష్యులలో ఒకరిపై రాజా వెంకటప్ప నాయకునికి కోపం వచ్చింది. అతడు గురువు వద్ద మొరపెట్టుకొన్నాడు. "ఈ విషయమై పట్టుదలకు పోవద్దు మనిద్దరికీ మంచిదికాదు" అని ఈయన తన శిష్యునికి సలహా యిచ్చారు. కాని, శిష్యుడు విన లేదు. చివరికి వెంకటాచార్యులు రాజాతో ప్రస్తావించారు శిష్యుని సంగతి. "మీరు గురువులు ఇలాంటి విషయాలలో జోక్యం చేసుకోరాదు" అని రాజా విన్నవించారు. రాజా తన మాట విన నప్పుడు ఆ సురపురంలో వుండడం ఉచితం కాదని వెంకటాచార్యులు పూనా పట్టణానికి బయలు దేరారు. వెళ్తూ ఒక శ్లోకం వ్రాసి రాజాకు పంపారు. దాని భావమిది: మదోన్మత్తమైన మతంగజం తన శుండాదండంతో భృంగాలను విసిరి కొట్టి చెల్లా చెదరుచేస్తే, వాటికి అరవులో పూవులు ఆశ్రయ మివ్వవా?" అని. అది వరకే వెంకటాచార్యులు పేష్వాం దర్బారులో పండితు లందరిని జయించి విశిష్టాద్వైత కిరీటం పొందడంవల్ల పూనాలో నానా ఫడ్నవీస్ వద్ద ఆయనకు పలుకుబడి చాల వుండేది. పూనాలో స్థిరపడ్డారు. వెంకటప్ప నాయకుడు కిరీటం వెంకటా చార్యులను మళ్లీ తన ఆస్థానానికి రప్పించడానికి ఎంతో ప్రయత్నం చేశాడు. కాని, ఆయన రాలేదు. పూనాలోనే 88 వ ఏట పరమపదించారు.[177]

ఇచ్చి వెంకటాచార్యులు సీతా పరిణయ నాటకమ్, శృంగార సారస్వతమ్, వేదాంత కారికావళి మొదలైన గ్రంథాలు రచించారు. వేదాంత కారికావళి సంస్కృతాంధ్ర వ్యాఖ్యానాలతో ప్రచురితమైంది.

శ్రీ వట్టపురెడ్డి ఇర్నాప్రెడ్డి దాశరథిచరిత్ర పీఠికలో సురపురపాలకుడు మొండగై (మొండిచేయి) వెంకటప్పనాయకుని ప్రస్తావించి గద్వాల చరిత్రలోని హనుమప్ప కథ మొండగై వెంకటప్పకు అంటగట్టి వుంటారేమో నంటూ "కథయందలి తీగ లాగి చూచి, మాళవదేశములో జరిగిన సారంగధరుని కథను ఆంధ్రదేశమున అంటగట్టినట్లుగా హనుమప్ప కథలు కూడ రాయమార్చి యుండుదురా!" అని సందేహం వెలిబుచ్చారు.[178] కథలు యాదృచ్ఛికంగా ఒకవిధం జరుగుతుంటాయి. మాళవదేశంలో జరిగినట్లు భావించే సారంగధరకథవంటి కథ, నూటికి నూరుపాళ్లు పోలిక వున్నట్టిది, పంజాబులో పూరణ్ భగత్ కథ వుంది. దీనిని హీర్ అనే మాత్రా వృత్తంలో ఎవరో ప్రాచీన జానపద కవి వ్రాశారు. దీనిని ఎకతులు సారంగి సాహాయ్యంతో రాత్రిళ్ల మైదానాలలో పాడుతారు. హిందూ ముస్లిం శిక్కులు అందరూ చెవులు

---

177 కపటరాళ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాసం, పుట 282

178 దాశరథిచరిత్ర పీఠిక పుట 18

కొనుకొని దీనిని ఎంటారు ఈ కథ సినిమాకూడ నేను 1939లో లాహోర్‌లో చూడాను హీర్ మన అక్కరవంటి వృత్తం. నేను ఈ కథ విని ఆశ్చర్యపడి, గురు వర్యులు వేటూరి ప్రభా కరులకు వ్రాశాను దీని విషయమై యావద్భారత శాసన గాథలు పరిశీలించాలని వారు నాకు వ్రాశారు

కనుక మొండగై వెంకటప్ప నాయకుని మొండిచేయి కథ కల్పనకాదు. అతడు తెగిపోయిన తన మొండిచేతికోనే డాలు పట్టుకొని యుద్ధంచేయడానికి వీలుగా ఒక ఇనుపముంజేతిని తయారు చేయించాడు. దీనిని చేతికి తొడిగి బుజానికి కట్టుకొని డాలుపట్టుకొంటే, ఇనుపవేళ్ల బిగుసుకు పోయేవి. దానితో డాలుకు పట్టు వచ్చేది. దీనిని చేసినవాని చాతుర్యం మెచ్చుకో దగి. ఈ ఇనుపముంజేతిని సురపుర రాజవంశీయులు నేటికీ మహానవమి ఆయుధపూజలో తక్కిన ఆయుధాలతోపాటు పెట్టి పూజిస్తారు[179] కనుక ఇది కథకాదు, కల్పనకాదు, వాస్తవం.

సురపురం వారు మొదట శైవులే కాని, వచ్చంగి పామనాయకుడు విశిష్టాద్వైతమతం పుచ్చుకున్నాడు. రాఘవ పామనాయకుని కాలంవరకు ధాత్రాద శ్రీవైష్ణవులే గురువులుగాను, పురోహితులుగాను వుండేవారు. కాని రాఘవపామనాయకుడు ఒక్కపట్నానికి వెళ్లి అక్కడ వున్న మహావిద్వాంసులు, మహాతపస్వులు అయిన అణ్ణయాచార్య సోదరులను తన రాజ్యానికి పిలుచుకొని వచ్చిన పిదప ధాత్రాదుల ప్రాభవం తగ్గింది. కాని వారికి దర్బారులో మర్యాదేమీ తగ్గలేదు. సురపురము రాజులకు గురుత్వము వహించిన నంబెరుమాళ్లయ్య కుమారుడు లోకయ్య కారాజులతో సంబంధ మున్నట్లు కనిపించదు. సంస్కృతాంధ్ర కన్నడ ద్రావిడ భాషా సాహిత్యములలో విశిష్టస్థానము వార్జించిన లోకయ్యకు రాజాస్థానమున పేరము లేకపోవుట విచారణీయము. పేరాంబరుని మన్మడు పామనాయకుడు తనకృతి భార్గవపురాణములో తన పూర్వులకు గురువులుగా నుండిన లోకయ్య నంబెరుమాళ్లయ్యలను స్మరించకపోవుట మరియు చిత్రముగా నున్నది. దీనికితోడు కేశవయ్యయు తన తండ్రి రాజాస్థానమున పొందిన గౌరవ ములగూర్చి ఏమియుచెప్పలేదు. ఈ కారణమువలన రాజులకు, వారి గురువులకు పరస్పర విశ్వాసములు సన్నగిలి యుండునేమో యను సందేహము కలుగును. కేశవయ్య వంశములోని తరాలను పరిశీలింప దాశరథి చరిత్రకర్తయు, భార్గవపురాణకర్తయు సమకాలికులై యుండు రని తోచును " అని శ్రీ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి వ్రాశారు[180] ఒక్కపట్నం ఆచార్య సోదరుల రాకవల్ల కేశవయ్య మొదలయిన ధాత్రాదుల ప్రాభవం తగ్గడం నిజమేకాని, వారికి దర్బారులో

179 కపటరాల కృష్ణారావు సురపుర సంస్థాన ఇతిహాస పుట 88

180 దాశరథి చరిత్ర పీఠిక, పుట 16

గౌరవమర్యాదలేమీ తగ్గలేదు దక్కపట్నం వారికి, కేశవయ్యగారికి సమానమైన గౌరవ స్థానాలు ఉండేవని ఇప్పటి స్థానిక ఆధారాలుమంట్టి తెలుస్తున్నది [181] భార్గవ పురాణకర్త కేశవయ్య పూర్వులనేకాదు, తాను సగౌరవంగా పిలుచుకొనివచ్చిన అళ్వయాచార్య సోదరులను కూడ తన కృతిలో స్మరించలేదు ఈ విషయంలో కృష్ణరాయలను అనుసరించాడు ఇక కేశవయ్య ౭౫ సంవత్సరాలు జీవించాడు కనుక ఇమ్మడిపాముడాయకునికి, ముమ్మడి పిడ్డ నాయకునికి, మొండగొ వెంకటప్ప నాయకునికి ముమ్మడి రాఘవపాము నాయకునికి, ఇమ్మడి వెంకటప్ప నాయకునికి, ఆరుగురు రాజులకు సమకాలికుడు పైన పేర్కొన్న మొదటి ముగ్గురి కాలంలో బాలుడుకాని, తర్వాతి ముగ్గురికాలానికి యువకుడు, వృద్ధుడు

## భార్గవపురాణము

రాఘవపాముడాయకుడు స్వతః మహావిద్వాంసుడు, సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో కవి, అళ్వయాచార్యులవంటి విద్వద్వరేణ్యుల సత్సంగంలో వున్నవాడు కనుక భార్గవ పురాణాన్ని ప్రబంధ పద్ధతిలో ప్రౌఢంగా విశిష్టాద్వైత సంప్రదాయానుసారంగా ఎనిమిది అశ్వాసాలుగ అంగీకరించాడు అశ్వాసం కథను —ఏ కథకాకథను — చిన్న భావ్యాలుగా తీర్చాడు మూల సంస్కృత భార్గవ పురాణం అధ్యాయానుకూల ఎక్కడికక్కడే పేర్కొన్నాడు "అని నరులను నారాయణువలన మహాయోగిమాహాత్మ్యమును, సంవాద రూపంబును, శ్రీమంతం బనునగు భార్గవపురాణో త్తరఖండంబునందలి ప్రథమాధ్యాయం బాలించి —ఇత్యాదిగా [182]

ఉభయవేదాంత సంప్రదాయజ్ఞుడైన పాముడాయకుడు ప్రబంధప్రథమాశ్వాసప్రారంభంలో ఇష్టదేవతాస్తుతి సంప్రదాయాన్ని కృష్ణరాయలలాగ కొత్త పద్ధతిలో చేశాడు భగవత్తత్త్వం పైనుంచి కిందికి దిగివచ్చి లీలావిభూతి అయింది ఆ పరతత్త్వ లీలావిభూతి అయిన నాగినగిరి సురపురవేణుగోపాలుని కవి మొదటి రెండు పద్యాలలో వర్ణించాడు ఆ పరతత్త్వం మరికొంత కిందికి దిగి అనంతు డయింది అనంతుడు — ఆదిశేషుడు ప్రథమసూరుడు పిదప తార్క్ష్యుని, అనంతరం విష్వక్సేనుని వంధాయుధాలను - శంఖ చంక్ర కౌమోదకీ శార్ఙ్గ సుదర్శన దేవులను ముక్తులైన పన్నిద్దరు సూరులను వర్ణించాడు "అని ఇవ్విధయిగా సార్థంబగు దివ్య దేవతా ప్రార్థనంబు" కావించాడు కవి [183] సార్థమంటే అనూహ్యాఖ్యానుక్షక ాత్మకులైన అనంత గరుడ విష్వక్సేనాదులను క్రమంగా వర్ణించడం ఇది సృష్టిక్రమం

181 తిరుమల సుచరిత, ఎం ఎ, ఎంఫిల్ నగరనాధదర్పణ, పుట 287

182 భార్గవపురాణం ప్రథమాశ్వాసం ౯౧వ పద్య తర్వాత వచనం

183 భార్గవపురాణం ఆ 1, పద 12

## అంకితం

పర్వంగిపామునాయకుని ఆహ్వానంపై వేణుగోపాలస్వామి కోవెలలో అధ్యయనాధ్యాపనాలకు, పురాణ ప్రవచనానికి దక్షిణాదినుంచి సురపురం చేరిన శ్రీవైష్ణవ బ్రాహ్మణ కుటుంబాలలో వాధూల గోత్రజులయిన నా మామగారు శ్రీమాన్ పెరుమాళ్ళ వెంకటాచార్యుల వారి పూర్వుల కుటుంబం ఒకటి. శ్రీమాన్ వేంకటాచార్యులవారికి రామాయణ భాగవత హరివంశ విష్ణుపురాణాలు వాచోవిధేయాలు. విశిష్టాద్వైత వేదాంతంలోను వారు ఉద్దండులు. ఆరేడు దశాబ్దాల క్రితం వనపర్తి సంస్థానం దివాను శ్రీ వెంకోబనాయకుడు కృష్ణాతీరంలోని యాపర్లలో భారతదేశం నాలుగుచెరగులనుంచివచ్చిన పండిత ప్రకాండులతో నిర్వహించిన భాగవత సప్తాహ మహోత్సవంలో శ్రీమాన్ వేంకటాచార్యులవారు మధుర గంభీర కంఠంతో శ్రీమద్రామాయణం పారాయణం చేసి, శ్రీమద్భాగవతాన్ని ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సంప్రదాయానుసారంగా ప్రవచించి సన్మానితులయ్యారు. ఆ మహోత్సవంలోనే మంటూరకర కె.వి. శ్రీనివాసస్వామి, శ్రీమాన్ తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులవారు నిర్వహించిన వేదాంత లిఖిత సంస్కృత పరీక్షలో శ్రీమాన్ వేంకటాచార్యులవారు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులై "వేదాంత కేసరి" అనే సన్మానపత్రం పొందారు. పిదప వారు 1986 లో అమరచింతాత్మకూరు సంస్థానంలో శ్రీమాన్ కోశమురి కృష్ణమాచార్యులు జరిపిన భాగవతసప్తాహమహోత్సవంలో సన్మానితులయారు. ఆ మహోత్సవం నిర్వహించిన విద్వద్వరేణ్యులు శ్రీమాన్ పుసులూరి శేషాచార్యులవారు శ్రీమాన్ వేంకటాచార్యులవారికి బహూకరించిన శ్రీమద్భాగవత సంపుటిలో ఈ శ్లోకం వ్రాశారు

అసార సంసార విచ్ఛిన్న భావాత్
కృష్ణామృతాబ్ధా వవగాహ్య కృష్ణః,
అదా దిదం భాగవతం తదర్థ
విదే ముదే వేంకటసూరయే హరిః

శ్రీ వేంకటాచార్యులవారికి భాగవతం వేంకటాచార్యులనే ప్రతీతి ఉండేది. వారి దివ్యస్మృతికి ఈ పీఠికను అంకితం చేసి ఋణ విముక్తుడిని అవుతున్నాను.

## మంగళాశాసనం

ఈ పీఠిక రచనలో సురపురం పుట్టినిల్లయిన నా అర్ధాంగి శ్రీమతి అనంతలక్ష్మి సురపురాన్ని గురించిన ఎన్నో సందేహాలు తీర్చింది. ఆమె సురపురపు పక్కింటి పురాణాల పట్ల ఆమెకు నా మంగళాశాసన పూర్వకమైన కృతజ్ఞత

## కృతజ్ఞతలు

మిత్రులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయ సంచాలకులు డాక్టర్ దాసరి వేంకట లక్ష్మీనరసింహారావు కవి పండిత పరిశోధకులు ఈ రామకవి పాండిత్యవైభవాన్ని, కవితాకమనీయతను, నిర్మాణమార్మికతను గురించి వివరించారు గనుక నేను చెప్పడం అప్రస్తుతమవుతుందని మానుకున్నాను

ఈ ప్రబంధ పరిష్కారంలో నావల్ల గలిగిన విలంబాన్ని సహించి నాతో ఈ ఉత్తమ సాహిత్యసేవ చేయించిన మిత్రులు డాక్టర్ దాసరి వేంకట లక్ష్మీనరసింహారావు సహృదయతకు కృతజ్ఞుడను

ఏ బి రెడ్డి ఆర్ట్ మ్యూజియం,
హైదరాబాద్-38

భాషాసేవకుడు
తిరుమల రామచంద్ర

# భార్గవ పురాణము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీ లక్ష్మీరమణిన్ వివాహమునఁ దాఁ గ్రేగంట వీక్షింప నే
త్రాలోలాంబురుహద్వయం బాగిని ముద్రాముద్రితంబౌట హ
ర్షాంకూరంబున నంద దైవతనికాయం బెంచ భాసిల్లు ని
గ్గోలానస్మితిఁ బ్రోచుతన్ సురపురీగోపాలకృష్ణుం డిలన్ 1

మ. పరమాంగస్థితిఁ గల్గి వాగినగిరి[1] ప్రాశస్త్యఁ గావించి సు
స్థిర భక్తవ్రజ పాలకత్వమున నిశ్శ్రేయోఽధిక ప్రాప్తియై
యరుదారన్ విభవాప్తి ని సురపురాధ్యక్షస్థితిం బొల్చు న
ద్గురుఁ [2]డా నందుఁడు బ్రోచు మమ్మెపుడు శ్రీగోపాలకృష్ణుం డొగిన్ 2

చ. అనయము నే మహామహఁ దనంత పరస్థితి పూర్ణతాప్తియై
తన నఖిలావనీభృతిని కల్పమహోన్నతి యొప్ప శ్రీ భా
వన సమరాగరం బొరయు వాసవముఖ్యసురార్చ్య నయ్యహం
తుని వినుతింతు నంతసముతో నతిదాంతు జగన్నిరంతునిన్ 3

చ. నెరయ సహస్రభేదకత నిష్ఠుల వైభవ శౌర్యరేఖయుం
బొరయఁ బవిత్రతాప్తిఁ గాని పూరితగోభృత శక్తి వైఖరిం
బరపద సంపదం గలుగు భాసురకీలుని నాగవైరి శ్రీ
ధరతురగున్ బతంగపతు తార్క్ష్యు మహోన్నతిఁ బ్రస్తుతించెదన్ 4

---

1 మూ – దర, వాగినగిరి సురపురాధీశ్వరుం బొందిరాజధాని సురపురమునకు
ఐదామైళ్లదూరమున నున్నది

2 మూ- దా నం

ఉ. అతి విశదాభివృద్ధిఁ గాని యద్భుతరూపం మహాచలోదయ
స్ఫురణము గల్గి సంతతము శోభిత సద్గురుదయాళు వైభవం
బరసి తమోహర క్రియలఁ బొల్పగు విక్రమతం గరంగి య
చ్చెర కలుషౌఘముల్ గరవఁబాలు సుదర్శనదేవు నెన్నెదన్ 10

మ. తను దీప్తిచ్ఛట యద్భుతైక మహిమా తాత్పర్య దుర్వార్యగా
సమదర్శిత్వముఁ జేసి లోకతతులన్ సంరక్షణముం జేయుచున్
విమలాత్మస్థితి గల్గు నా మనము న వి క్) స్ఫూర్తిం గొల్చెదన్
కమనీయాంగుల శ్రీవరాత్మపరులన్ పన్నిద్దరన్ సూరులన్ 11

వ. అని యిట్టిధంబున సార్థకంబగు నిష్టదేవతా ప్రార్థనంబు గావించి యేను తద్వం
బగు నాకృత్యావశ్యం బంద్రథాషన్ ఏచియింపం దలంచి సుప్రాంతుండనై
యేకాంతంబున సనయంబుగ శయనంబున శయనించి యున్న యవ
సరంబున 12

సీ. తర మతిత బ్రహ్మకల్పాంతర స్థితిఁ
చిరతర విభవాప్తిఁ జెలఁగువాఁడు
కమలానుషక్త సంగత శుభకర దీప్తిఁ
బరభోగ మహిమంబు పరఁగువాఁడు
తన యాజ్ఞలోనె సమస్త ప్రపంచ స్ఫూర్తిఁ
గల్గి లోకములఁ గాచువాఁడు
స్ఫురణింప నఖిల భూభువన ప్రకాశ్యాకృతిఁ
బరిమ సహస్రంబుఁ బ్రబలువాఁడు

తే.గీ. శంఖ చక్రాది ప్రకాశిత భుజుండు
శేషశేషిత్వ లక్షణ శ్రీకరుండు
శ్రీనివాసుఁ డనంతుఁ డచ్యుతుఁ డతఁడు
విమల మతిఁ జొక్క నాదు స్వప్నమునఁ దోఁచి 13

మ. అల పన్నిద్దరు సూరు లిజ్జగమునం దావంద సంధాయులై
కలు భక్తామృతముఁ గ్రోచునట్టి కథ విఖ్యాతంబుగాఁ గావ్య మీ
తెలుఁగందున్ రచియింపు మంచు హరి సంకీర్త్యంబుగాఁ బల్కుటో
నలరం దాపక పూర్వ పుణ్యమునఁ గాదా యాస్థితిం గల్గుటన్ ౧౮

వ. నీవు పరమ భాగవత భక్తి తాత్పర్య నిర్ణయుండ వగుట భవదన్వయంబున బాది పురుషుండును శౌర్య వినీత గుణుండును నగు గుణుండు రామునారక భక్తి హృదయానుపహుండగుట తద్వంశం బనేక శాఖాభేదంబుగాఁ బాదుకొన నందలి కోసల కులంబునందు నరసింహ మహీపాలుం డనవరత పుణ్యాహ్వాయ ధర్మశీలుండగుటఁ దన్మహీజానికి నిరత చతురుపాయకుండగు వడియము నాయకుండును నమ్మహామహునకుఁ బరహృదయశల్యుండగు తిల్ల మహీవల్లభుండును నమ్మేటికి రూపకీర్తి రతికాంతుండగు చినహమ్మ ధరణీకాంతుండును నవ్విభునకు భావితాత్మ ప్రధాన సంధాయకుండగు పోలి నాయకుండును నా గోత్రాధినాయకునకు బంధితారాతి సముదాయకుండగు పెదసోమ నాయకుండును నా రాజున్యున కుత్తుంగ సంగరాంగణ శౌర్యప్రసంగ భవుండైన యెఱసింగ ధరణీధవుండును నా నృపసార్వభౌమున కుద్దామ విక్రమ రక్షండగు మదిరి ధరాధ్యక్షుండును నమ్మహీపతికి కంటకాగ్ర వీరనాయకుండగు వీర బంటునాయకుండును నవ్వీరునకు సారదోస్సార విజితారాతి నాయకుండగు బలి సోమనాయకుండును నా రాజున కత్యుగ్ర విక్రమమాన సాహససంధాయకుండగు పెదపాము నాయకుండును నా నృపోత్తమున కఖిల దేశాధీశ వర్ణిత కీర్తికాంతా విభుండగు దేవాయి బల్ల భూవిభుండును నయ్యధిపునకు బ్రోద్ధిన భుజావిక్రమ పాలకుండగు గద్దె పెద్ద భూపాలకుండును నమ్మహాత్మునకు సమదశత్రు విపాలుండగు పెదపాము ధరణీపాలుండును నా భూవిభునకు బీతాంబర కరుణాలవాలుండగు పీతాంబరవసి పాలుండును నమ్మహీధవ వననిధియందు సంతాన పంచక తరు స్వరూపులగు పాము మహీధవ కృష్ణ భూపాలకరమణ ధరణీరమణ వాసుదేవాధిప మహీపతులను సుతుల గల్గి రందు పాముభూపాలునకు విశ్వధాత్రీకు వెంకటమ్మ ధీవు లను తనయు లియ్యు రగుటఁ బీతాంబరనాథ సాధ్వీమణి తిమ్మమాంబా గర్భశుక్తి ముక్తాఫల రమణ భూపాం

---

1 ము — భూవ

2 ము — దరమణ

నతింరాము లక్ష్మమాంబా గర్భవనధి పిరీమతల్లి రాకాసుధాకరుండ నగుచు రాఘవ భూపాలకాభిధానంబున దిగంతకీర్తికాంతా మనోహరుండనై సకల ధర్మ ప్రతిపాలకుండనగుచు భవద్భుజా ప్రతాప శిఖిశిఖా పరంపరం శరీర టాట్మన్నిరాయుండు శంభ నివయంబు మాడ్కి మిసిల్లాట నాతినాజాయణ పరాయణ తత్పరుండవు గాన భగవంతుం దానతిచ్చిన విధంబున భగవద్భాగ వతాచార్య కటాక్షవీక్షానుగుణ్యంబునంజేసి మహోన్నతుండ నగుటం దాను మహిపాలా[1] యేతత్కృతిఁ గావించి వాగినగిరి యందధివసించి సురపురం బున నెలకొన్న శ్రీమత్కేశవ గోపాలము ర్తి కంకితం బొనర్చు[2] మని సభికుల వల్కిన నేను ప్రాణినాథుని మహాకవీనానుగ్రహంబున సంతోషహృద యుండనై యిట్లు వృత్తంబు గావించుట కుత్సహించి కృతికర్త యగు శ్రీహరికి షష్ఠ్యంతంబులు రచియించెద

## షష్ఠ్యంతములు

క. కరుణాకర నవ శంకర
పరిపోషయిత్మాఖిల భవ ప్రముఖ సురౌ
ఘరుయనకుఁ గుణాషాంబుధ ని
ర్భర పవమానుక భక్త పరిపాలనకున్. 20

క. మధుకైటభ సంహారికి
బుధ దాతక పాతకాశ్రయమునకు శుభశ్రీ
మధురాంగుని ధరణీ పద
మధుర క్రమ కృతికి విమత మానవ్యతికిన్- 21

క. భవ పద్మభవ శివా
ప్రవిమల సురరత్న బంధుర స్వవర పయో
భవ యుగళి సంతతగత
పవ విరతి వధిలోక పాలన మతికిన్ 22

---

1 మూ - లా
2 మూ - బొనర్చు

క. దుస్తర పంకాదార,
ప్రస్తర టంకాయితాసి భవ్యకరుణకున్
శ్రీస్తన కుంకుమ సంయుత
కౌస్తుభ వక్షునకు సర్గకర వీక్షునకున్ 23

క. సుర దానార్చిత పదపం
కరుహ యుగునకు కలిలోక కల్పకునకు సు
స్థిర వాగీనగిరి సురపురి
చిరవాస వరిష్ఠునకును శ్రీకృష్ణునకున్ 24

వ. [1]నిరంతరాభ్యుదయ కల్యాణ పరంపరా వాప్తిగా నా యొనర్పంబోవు నీ విష్ణు భక్తి ప్రధాన మార్గంబగు భార్గవ పురాణంబునకుఁ గథా ప్రారంభం బెట్టి దనిన 25

## కథా ప్రారంభము

ఉ. ఘనతర ధర్మతత్పరులు సంభవగాత కటాక్ష వీక్ష ప్ర
త్తనులగు శౌనకాదులు కృతద్యుతిసంగతు సూతుఁ గాంచి పె
మ్మనమున సంతసించి యుపచార హితాత్మక భక్తి[2] నెంచి య
క్షనిధి మహత్త్వశీల సముదంచిత వాగమృత ప్రసక్తిగాన్ 26

తే.గీ. సూత [3]ధర్మార్థ తత్త్వజ్ఞ సూత శాస్త్ర
వేత్త తత్త్వార్థ విద్యత్ప్రియతర సూత
మౌని ద్వైపాయన ప్రియ మానినేయ
యనుచు నభివాదమును చేసి యంపు మతిని 27

---

1 మూ—కాది

2 మూ. అని నిరం 3 మూ—చెంది 4 మూ. ధర్మాత్మ తత్త్వజ్ఞ

తే.గీ. అనఘ భవవార్ధిమగ్నులౌ నార్తులైన యీ స
[1]మస్త జీవ వ్రజముల కత్యాదరమున
సులభమగు మోక్షమార్గంబు కలుగునేని
దానిఁ బలుకుము దయచేసి ధర్మమతిని 88

క. గురుమతిత్రై పల్కిన యా
సురువచనముఁ బ్రియముఁజేసి సువ్యయగర్వుం
దురుమతి హరి విని పలికెన్
నరుఁగూర్చి కరుణయనతితి వందితుఁ డగుచున్ 7

మ. మను సర్వేశ్వరి లోకమాతయగు సంతోషాలయాదేవి నే
ర్చున వైకుంఠపురంబునందు హరి సంతోషాత్మునింగూర్చి దీ
నిని ప్రశ్నంబుగఁ బల్కినట్టి కథ నే నీకూహగావించి సూ
క్తిని వెంపొందఁగఁ జేతునంచుఁ గరుణా దివ్యప్రభావాధ్యుఁడై

ఆ. అం త్రిపాద్విభూతి యైన వైకుంఠంబు
విరజ కవలి దరిగ [2]వెలయు నెద్ది
పురి యయోధ్యగాఁగఁ బొల్చు నిత్యం బది
యంత సమ్మతమునని యావరించి 89

తే.గీ. తలఁప మణిసా[3]లయ దిక్సంద్రముంగు
రత్నమయ మందిరములు [4]హర్మ్యప్రసాద

1 యతిభంగము 2 వెలయు 3 మూ — లేయ
4 ప్రాసాదమునకు ప్రసాద ప్రయోగము

ములు విమానమ్ములును శుభములగు తోర
ణములు గోపురములు గల్గి యమరుచుండు 40

వ. సకలం కార్యకారణ కారణంబును నావరణ సప్తకంబును దశగుణోత్తరంబును చతుర్దశభువనాత్మకంబును నగు నండంబు గడచి పరమం బగు వ్యోమ శబ్దంబునం జేసి యభిధేయం బగుట బ్రహ్మాదుల కవాఙ్మనస గోచరంబై శ్రీమంతంబగు దివ్యలోకం బగుట సనకసనందన శతానంద శివాదులచే[1] నై నీ ధ్యానంబు సేయుట యశక్యం బగుట నవిచ్ఛిన్నస్వరూపైశ్వర్య నిత్యానంత సిద్ధులును భగవత్పరిచర్యానుకరణ యోగ్యులును భగవదనుకూలైక భోగులును మహాత్ములు నగు దివ్యపురుషులచేత నత్యంతపూరితంబగుట తత్స్థానికులకు లేని యాశ్చర్యస్వభావంబును నింతపరిమాణంబును నింతయైశ్వర్యంబును నని పరిచ్ఛేదంబు సేయుట కశక్యంబుగాన దివ్యావరణ శతసహస్రావృతంబును దివ్యకల్పతరూపశోభితంబును దివ్యోద్యాన శతసహస్రకోటి సమావృతంబును నతిప్రమాణంబును నగుచు దివ్యతరం బగునొక్క తలంబున విచిత్ర దివ్యరత్నమయంబగు దివ్యాస్థాన మంటపంబు గలిగి దివ్యరత్న స్తంభ శత సహస్ర కోటి శోభితంబై నానాదివ్య రత్న కృత స్థలం విచిత్రంబయ్యు దివ్యాలంకారాలంకృతంబౌట పతితంబులను పరమానందంబులును నగు పాదపస్థ వివిధ గంధ వర్షంబులంగల్గు దివ్యపుష్పశోభమానంబులగు దివ్య పుష్పోపవనశోభిత సంకీర్ణ పారిజాతాది కల్పద్రుమోపశోభితంబులయ్యు దివ్యంబులగు గొన్ని యంతస్థ పుష్ప రత్నాది నిర్మితంబులగు లీలామంటపశత సహస్ర కోటులంజేసి శోభితంబులుగా నిరంతరానుభూయమానంబులై యపూర్వ పదార్థంబులు నాపేక్షించిన క్రీడాశైలంబు శత సహస్రంబులచేత నలంకృతంబులయ్యు నారాయణ దివ్య లీలాంకృంబు నారాయణ దివ్యలీలా సాధారణంబులుగల్గి కొన్ని [4]పద్మవనాలయా దివ్యలీలా సాధారణంబులయ్యు గొన్ని శుకశారికా మయూర కోకిలాదులచేతనైన కోమలంబులగు కూజితం

1 గ్రంథపాతమున్నట్లు తోచుచున్నది

2 మా—పూరిత 3 మా—నశక్య 4 మ—పద్మ

బులచేత నాలుగంబులగు దివ్యోద్యాన శత[1]సహస్రంబులచేత నావృతంబై
మణిముక్తాప్రవాళకృత సోపానంబులును దివ్యామృతామృత రసోద
కంబులును గల్గి దివ్యాండజ తరంబు(?)చేత నతిరమణీయ దర్శనంబు
లై వ యతిమనోహర మధుర స్వనంబులచేత వ్యాప్తంబులైన యంతస్థ
ముక్తామయ దివ్యక్రీడాస్థాన శత[2]సహస్రకోటి శోభిత దివ్య సౌగంధిక
దివ్యరాజహంసావళీ విరాజితంబులగు వాపీశత సహస్రంబులచేత సమా
వృతంబయ్యు నిరస్తాతిశయానందైక రసత్వంబునం జేసి యమృతత్వంబగు
నదులు గల్గి ప్రకృష్టక్రీడోద్దేశ విభ్రాజమానంబై [3]యందందు నిర్మింప
బడిన దివ్య పుష్పపర్యంకంబుల చేత శోభితంబయ్యు వివిధ కుసుమ
మరందాస్వాద మత్త మధుకర నిరంతరోద్గీయమాన దివంగాంధర్వ
పూరితంబయ్యు చందనాగరు కర్పూర దివ్య పుష్ప రసావగాహిత మందా
నిలసేవ్యమానంబగు వైకుంఠపురం బయట కోటిసూర్య సమప్రభంబగు
తదంతఃపుర వరంబున బ్రాకారంబున దన్మధ్యంబునందు మాణిక్య స్తంభ
శోభితంబగు దివ్యమంటపంబు సమృద్ధి ప్రబ్బగుట నందు

తే॥ బాలసూర్య సకాశమై పరఁగి కలము
వందు సింహాసనమున సహస్రదళ వి
శోభితంబయి భాస్వదత్యంబగు నమరి
కమల మొప్పారు నిద్దంపు కాంతి గల్గి 42

క॥ ఆ పద్మ కర్ణికయం దధివసియించు
సర్వేశ్వరుండు జనార్దనుండు

1 మూ-సహస్ర
2 మూ-సహస్ర 3 మూ-యెందెందు

ప్రభువు విశ్వమునకుఁ బతి దేవదేవుండు
నారాయణుఁడు శ్రీ నాయకుండు
శ్రీ భూమి నీళా విభుండు దేవాధి
పతి యనంతుండు శశ్వంతకాంత
[1]సాహస్రదళ సమానకోమలాద్య స
హస్ర చామర విరాజిత మూర్తి

ఆ. వె. భూర్యసంఖ్య నిత్య ముక్త శేషాది సం
సేవితుండు భూత భావనుండు
సంతతంబు విష్ణు సంజ్ఞితుండై దివ్య
భోగ విభవ మహిమఁ బొల్చు పేర్మి 43

క. విమలార్యనేక చామర
సముదయ పరి[2]వీజితుండు సౌఖ్యపరుం డు
ద్యమఁ దగుట [3]వనధి సుత యొక
సమయంబున విష్ణు గూరి జగదధిపాలున్ 44

వ. ఏకాంత సమ్మహోత్సుండు తదీయ నేత్రారవిందమ్ములకుఁ బొనఁ పుణ్యా-
నంద సంధాయకుండగుచుఁ బ్రశస్త గోష్ఠి లిత పుండరీక సదృశ నయ
నుండును విమల పీతాంబర ధరుండును సత్కస్తూరి పీత వసనుండును
నిరింత్యంబును దివ్యంబును నద్భుతంబును నిత్యంబును నగుయౌవన
స్వభావ లావణ్య స్వరూపామృత సాగరంబు గల్గు [4]మహోత్సుండును
నత్యంత [5]సుకుమారేవద్రప్ర స్వీన్న వదాంక్యపాల [6]నిటాల ఫలక దివ్య

1 మూ – సాహస్ర 2 మూ – వీచితుండు 3 మూ – వనిధి
4 మూ – మహోత్సుండు 5 మూ - సుకుమారతేవ
6 మూ – నిషాం

లతావళీ విభ్రాజితుండును నటింపకచమాన దాయకర సారసాక్షుండును [1]సవిభ్రమ భ్రూలతా సంయుతుండును ప్రవాళాధరుండను దరహస స్మేరాననుండును మృదుల కపోలఫలకుండును మున్నతనాసికుండును సుదగ్ర [2]పీనాంస విలంబమాన [3]వక్రకుంతలాలతావళీ విస్ఫురిత దర కంధరుండును శ్రియావతం సేందీవర శ్రోత్రయుగళ [4]స్నిగ్ధాంజనాంబుధ విమర్ద ప్రశంసాతాను విలంబి చతుర్బాహు విరాజితుండును నతిమృదుల విద్రుమరేఖాలంకృతాకరుండు కరతల దివ్యాంగుళీయక భాసమానుండును నత్యంతకోమల దివ్య నఖ పంక్తికా విభ్రాజితానురక్తాంగుళ్యలంకృతుండును దర్పాల సముల్లసిత కమల సన్నిభ పదయుగళుండును పదకకర కోటీర కోటి చూడావతంస గ్రైవేయ [5]క హార కేయూర కటక శ్రీవత్సకౌస్తుభ మౌక్తికదామోదరబంధన చామీకరాంబర [6]మేఖలా గుణ ము ఖాతర మంజీర రంజిత సువర్ణ దివ్యగంధ భూషా భూషితుండును శ్రీమద్వైజయంతీ వనమాలా విలసితుండును శంఖచక్ర గదా నందక శార్ఙ్గాది దివ్యాయుధ సేవ్యమానుండును నిజ్ఞామాత్రాన క్లుప్త భువన భవన సంస్థితి సంహారక శ్రీమంతుండగు విష్వక్సేను[7]నందును సమస్తైశ్వర్యంబు తెల్పిన స్వభావంబు వలన నిరస్త సమస్త సాంసారిక స్వభావులు భగవత్పరిచర్యైకభోగులును నిత్యసిద్ధులును నగు సనంత వైనతేయాదులచేత యథాశక్తి యోగింపనంజేసి యథా సంపాత ధరాది కాలంబున దివ్యాము కోమలాలోకనంబు జేసి ఏకంబయిన నావ్యాయవంబు సేయుచున్న మహానుభావుండును కించిదున్మీలిత వదనాంబుజవా వినిర్గతంబును దివ్యగాంభీర్యౌదార్య సౌశీల్య మాధుర్య సౌందర్యాద్యనవధిక గుణ గణాలంకృతంబును నతిరమ్య దివ్యభావ గర్భంబును నగు[8]దివ్యలీలాలాపామృతంబున నఖిల జన హృదయంబులు పూర్ణంబులు గావింపుచున్న

---

1 మూ - సలేదు
2 మూ — పేవాంస
3 మూ - వక్రకుంతలం
4 మూ — క్రశా
5 మూ — కాహార
6 మూ — మేఖాలి
7 మూ — నందను
8 మూ దివ్యలీలా

ఉ స్థిరమతి రామకృష్ణ ముఖ దివ్య శరీరము దాల్చి నీవు ధ
న్వరమను శ్రీవ నిట్టుల ¹నవనంత సుశీలతరాత్రి వల్ల వి
స్ఫురణముగా నిరంతరముఁ దాల్చి హరంబు నొసఁగు వాఁడ వై
ర్కర శర్కరాకృతివై ఘనకల్పక మూర్తివియై మదంబునన్ 50

ఆ వె ఎపుడు శివమోక్ష హేతువు నగు నీవు
వత్తిలంగ నెల్ల ప్రాపులందు
ముక్తి కోరుచు నిట్లు మోసని సంకల్పింపఁ
బడుదు శివ జగతి శంకరాక్ష 51

వ అంతట భవసాగరమునందు మునుంగుటయుఁ గొందఱు కొందఱుగుదురు
ముక్తి శివు లగుటయు నీ మాయాప్రభావంబు నీకుఁ బ్రసిద్ధంబగుట నీవు
శివివే శివరూపం గలుగు నీవ సర్వ సంకల్పంబుల నవ్వు సర్వకామంబుల నొసగు
ప్రకృతియందుండు వర్తగుటంచేసి నిగమంబులు ²కన్పతంబు గావింప
వలదు దేవ దేవా భవదనుగ్రహంబువలన సమస్త శివ కోటులకుఁ బర
మంబగు పదంబు గల్గ కోరుచు నిన్ను ప్రార్థించెద మత్కాంక్షితంబగు
దాని నొసఁగ వలయు మహాత్మా సర్వజ్ఞశివగు నీకు భేద బుద్ధి యేల ?
ఈ లోకంబు నందుఁ గొందఱు బద్ధులును గొందఱు ముక్తులును నగుటకేమి
దాని విచారింపఁదగు నిట్లు గావింపక సర్వజనులకు ముక్తి ప్రదుండవు
గమ్మని యిచ్ఛిధరయునఁ ప్రార్థింపుచున్న శ్రీ రమాదేవి నవలోకించి పరాత్ప
రుండగు జగత్పతి భవనంబు నందుఁ బుత్రుల యెడ జనకుఁ డంతె జనని
యధికంబగు ప్రియంబు గందని యత్యాదర కృపారసుండగుచు
నామె కిట్లనియె 52

1 మూ . యనంత 2 మూ - నెనరెద్ప 3 మూ — కన్పంతం

వ. అని నరుండు నారాయణునివలన మహాయోగి మాహాత్మ్యంబును సంవాద
రూపంబును శ్రీమంతంబును నగు భార్గవపురాణోత్తర ఖండంబు నందలి
ప్రథమాధ్యాయం బాలకించి నమ్రుండై పరమభాగవత ధర్మ వివరింపు
మనుఁడు తదీయ వచనంబు విని యప్పు డా నారాయణ మునీంద్రుఁడు
ప్రీతి సంపూర్ణనిఖిలాంగుండగుచు నతనిం గూర్చి మృదుతరోక్తి
నిట్లనియె 62

తే.గీ. అంత నాథూరకాలంబునందు నాకి
యందు వైవస్వతాంతరంబందు ద్వాప
రాంతము మొదలుకొని దీప్తిమతి గరిమ
నెనయ నా భగవత్పంచహేతు[1] లిట్లు 63

క. సిరియు మ భూమియు నీరయుఁ
దొరి సేనేశాద్యుఁ లనినిఁ దొరమిని మోక్ష
స్ఫురణకు సాధనములుగాఁ
[2]యుగదించిన ప్రదిదేశమునయం దనఘా 64

తే.గీ. భక్తి మహిమంబు భక్తిముక్తి ప్రదములు
దివ్యనంద నగాగాధ భవ్యభేయ
పరివృతంబు నిరంతర ప్రాభవంబు
గాంచియును పృథ్వింబు ప్రఖ్యాతిఁ దనరు 65

చ. గురుతర ధర్మదిగ్భిర నిశాటిక తీర్థ [3]సురక్ష ముఖ్య వి
స్ఫురణము గల్గి యప్పుడు ప్రోల్చిన బంగరుకోట మూర్తిగా
నరసి సువర్ణపర్వతము [4]హస్తిగిరిబడి భక్తిగొల్ప ని
ర్భరఁ బలుతెంది యాశ్రితగుఁ దార్కొనెనో యనఁ బొప్పు నెప్పుడున్ 66

---

1 మూ - ఎను 2 మూ - పుర 3 మూ - సురా 4 మూ - హస్త

చ. పరివృత నీలనీరద విభాసిత శైత్యము లెల్ల నిల్ల వి
స్ఫురిత శిరోగృహాగ్ర పరిశోభిత కుంభ పయోజ లోచనో
త్కరముగ స్వర్ణకేతన విరాజము వట్టిన చామరాళియై
యరయ పురీ గృహాంతర లనంతపదస్థితి మించె నెంచఁగాన్ 87

వ. కాంచన ప్రాకార సంయుతంబును సకలసంపదానిక్షేపంబును సమంత
తస్సమావృత ప్రకాశమాన మేరుసంకాశ ప్రాసాద నికరంబును నగు
పురంబునందలి [1]హాస్త్రిగిరిశిఖరంబున కుత్తరభాగంబునందుఁ గనక కమల
సంకీర్ణ మత్తమధుకర నికర [2]ఝంకారితాలంకారంబును విమలజల
[3]తరంగ్ప్రసమాన కతీర సంచరిత సకలజంతు సంతాప దురంత సందీ
పిత తాపత్రయ నివారకంబును నగు సరస్సమీపంబునందు
బాలార్క ప్రభాభాసమానంబగు హేమనళినంబు వందుఁ బ్రవేశించి
యరవిందవదన పదారవింద మరంద నిషేవణంబుసలుప సద్యః ప్రవర్తి
మాన నిఖిలావయవుండును భగవత్ప్రియుండును మహత్తర పాంచ
జన్యాంశుండును నగు మహానుభావుండు శిశువగు ద్వాపరాంతంబు నందలి
శ్రవణనక్షత్రయుతాశ్వయుజమాసంబునందు సకలదేవ ముత్కర్షంబుగా
సముద్భవింప దివ్యులు [4]దేవ దుందుభులు మొరయింపుచు మహనీయం
బగు పుష్పవర్షంబు గురియించి రమ్మహాత్ముండు ప్రాదుర్భవించు సమ
యంబునందు యప్సరస్సంఘాతంబు నటియించె నంతదేవుండును సర్వేశ్వ
రుండును పరదుండును నళినభూతకారియు పుండరీకవిశాల నయ
నుండును శంఖచక్రగదా ధరుండును నీలజీమూత సంకాశ మం
గనుండును కోటిసూర్య సమప్రభాభాసమానుండును పీతాంబ
ధరుండును వనమాలా విభూషితుండును హారకేయూర కిరీట కంకణాంగద
శోభితుండును మహనీయకాంచీ దామ నూపుర ప్రకాశితుండును గరు

1 మూ - హస్త 2 మూ - ఝుంకార

3 మూ - తరోత్పవ 4 మూల - దేవ

దాధిరాజుఘను శ్రీమద్రమామతీ సహితుండును జగద్విభుండును ధవళ
చామర పరీత ధవళాతపత్ర పరిశోభితుండునునగు నచ్యుతుండు దయార్ద్ర
హృదయుండయి పారంబగు సరస్తీరంబున కరుగుదెంచె 68

క అరయఁగ సత్పాలునిఁ గాంచి
కర మాహ్లాదముఁ జేసి శ్రీహరి నిగమా
ధర నిజ నిశ్వాసంబులఁ
జరిలింపఁగ వరుని వేదపారగుఁ జేసెన్ 69

తే.గీ. అట సరోయోగి యని యభ్యాయంబు చేసి
ప్రభువులోకాధినాథుండు బాహువులను
స్పర్శ గావించు తన ప్రియభామ కొనఁగ
సంతసంబున సత్పాల సత్కృతుల 70

క స్థిరమతి వాత్సల్యంబునఁ
గర మా సిరి ప్రాపితంబుగాఁదగు చనుబా
లరుదార నొసఁగి యారతి
వరసి సుతుని పగిదిఁ బ్రోచె నతిమోదముగాన్ 71

చ అతఁడు ప్రవర్ధమానుఁడయి యంచితభక్తి నిజాత్మనెంచి సం
తతముగ వారి పాదసరసీరుహసీమను దండవత్ప్రణా
మ తనుఁడునై యథోక్షజుని మాధవు లోకవిభున్ మహాత్ము సం
స్తుతి రచియించె నిత్యపరిశోభిత సత్కృప మృదూక్తి నైపుణిన్ 72

సీ. అతఁడు సంస్తుతిఁ జేయ నప్పుడు సంప్రీతుఁడై
దేవతేశ్వరుఁడు సుధీమతుండు
వరదుండు నిర్మలస్వాంతుండు యోగ క్రమ్మ
శ్రప్రదంబు సతంబు సుప్రభావ
మహిగమ్య మతిశయంబగు ధ్యానయోగంబు
మునివర్యుఁ గాసార భూతయోగిఁ
గూరిచి కరుణనై కొని యుపదేశింపఁ
దన్మహామహుఁడు తత్పాద నతిని

తే.గీ. ముంతఁ బ్రణమిల్లి సంతోషమున వినీత
వంతుఁడయ్యుఁ బ్రసన్న తద్వదన నీర
సంభవ న్యాసముంగొని సహృదయాప్తి
హర్షితుఁడు గాఁ దనర్చె యత్యంత మతిని 73

క. మునిపతి కృతకృత్యుఁడు గాఁ
దనుఁ దెలియఁజూచుఁ బరుని దేవుఁ డాపురుష దళా
క్షునిఁ గూర్చి కృతాంజలియై
యనియెన్ న్యాసార్థ కాంక్షుఁ డా[1]యాతండై 74

తే.గీ. అనఘ నీవు పలికిన ధ్యానయోగ
మరయ గుహ్యంబుఁ దాత్పర్య మనుట యెట్టి
దానినంతయు నతివిస్తృతముగ మాకు
దాఁపిగాఁ జెప్ప వలయుఁ గారుణ్యబంధి 75

వ. అనుడు భగవంతుం డిట్లనియె, 76

---

1 పు — తాయ

నరెడు [1]ధ్యానవంబు దత్త్వవేదులగు మునులెల్ల నాత్మన్యాసంబని పల్కెం బటియె ప్రధానంబు గూర్చి బుద్ధి తత్త్వంబు గదారూపంబుగం జేసి నాకు ధరియింపనగుట భూతప్రవృత్తీంద్రియాదియు శంఖరూపంబుగా ధరియింపు చుండు నుత్తమంబును ద్వివిధంబును నగు నహంకారంబు శార్ఙ్గ రూపంబునం జేసి ధరియింపుదు మనస్తత్త్వం బేను చక్ర రూపంబునంజేసి [2]దాలుతుం బ్రి యగు నిరింద్రియంబులు బాణ రూపంబులం జేసి ధరియింపనగుట విద్యా మయంబగు జ్ఞానం బెద్ది యది ఖడ్గరూపంబునే నాకొఱకు ధరియింపంబడు నవిద్యామయంబగు జ్ఞానం బెద్ది యదివర్మ రూపంబున ధరియింపంబడు వైజయంతీ స్వరూపంబు వలన పంచభూతంబులు ధృతంబులయ్యె నెట్లు ప్రధానంబును బుద్ధియు నఖిలాత్మకం బగు భూతాదియు నింద్రియాదియగు నహంకారంబును మనంబును సకలేంద్రియంబులును విద్యావిద్యలును భూమి మొదలగు భూతాదియు నను నవి మఱియనస్త్రకముంబులయందలి విజ్ఞానధ్యానంబునంజేసి సన్న్యాసంబుగా నాత్మీయ న్యాసంబుల న్యాసయోగ విశారదులు పల్కుదు రివ్విధంబున స్వాత్మను నా యురంబునందలి కౌస్తుభ రూపంబుచేత సన్న్యసించి నక్షత్రానందసుధారసం బహర్నిశంబు గ్రోలుచు నాయుధ రూపకంబులగు తత్త్వంబులచేతఁ బరివృతుండయ్యు మత్కరారవింద మాధుర్య మకరందంబు పిక్కిలి సేవింప బహిర్విషయ వైముఖ్యంబగు నాత్మన్యాసంబుగాఁ దలఁపఁ దగు నని యిట్లనియె

తే. గీ. ఈ సమస్తంబు లెస్సగా నెఱిఁగి నీవు
సర్వసర్వేశ్వరుండవై సంతతంబు
నూపము వక్షింపు నాయందుఁ బాడ్కుఁ జేసి
యలరుచు సమాధిఁ గ్రీడింపు మనుచరిత 81

1 మూ. వ్యాస 2 మూ. దాలుత

సర్వదేహులకు మోక్షదమునా మర్థిప
రంగనం దము నీరరుహ కుముద
ములను తెంగల్వలు ఎలి సుత్ప్రంయులు
నెనసి దివ్యయుగా నెసఁగు నొక్క

తే.గీ. సరసి తలమున రాజహంస స్వనంబు
గలఁగి సురరాజ సింప్రహాళ మగుచు
శుభము గావించి నిస్తుల స్ఫూర్తి నలరు
దివ్య నీలోత్పలంబు సంభావ్య మగుట ౮౫

వ. అందు ౮౬

క. కౌమోదకీ మహాంశుఁడు
తామరసాక్షాంఘ్రి పంకజ (?) ధ్యాన సుధా
ధీ మహిత వివర్ధితుఁడు [1]మ
హా మహుఁడు వసించి నిస్తులానందుండై ౮౭

క. క్షితి తత్త్వ జ్ఞానాధికుఁ
డతఁడు పవిత్రాశ్వయుజము నగు మాసమునం
దతి శుభమగు దినమున నం
చిత మతి జన్మించె విమలచిత్తాంయుణుఁడై ౮౮

వ. అయ్యవసరంబున

1 ము — మా

ఉ. అనుపమ కోటిసూర్య తులితాభుఁడు పంకజనాభుఁ డాశ్రితా
[1]వనుఁ డఖిలేశ్వరుండు బుధవంద్యుఁ డనేక సుమాస్త్రదారుణా
ప్తి విగళరూపుఁ డచ్యుతుఁడు దేవుఁడు శౌరి చతుర్భుజుండు [2]శ
ర్వ్యానయుఁడు గోమరావసువశాసితుఁ డవ్యయుఁ డప్రమేయుఁడున్ 30

సీ. సర్వమయుఁడు శంఖ చక్ర గదా పద్మ
విభ్రాజమానుండు విశ్వమయుఁడు
సుముఖుండు సుభ్రూయుగ్మ సుజనస్తుతుఁడు పుండ
రీక దళాక్షుఁ డస్తోక గుణుఁడు
నారాయణుండు సునాసుండు విద్రుమా
ధరుఁడు సుదంతాఢ్యుఁ డరిజయుండు
సు[3]శ్రోత్రుఁ డకఘుండు సులలాటవంతుండు
సువిభూషణుండు విస్మితయుతుండు

ఆ. సుగుణ మాలి సుగంధ చుబుక కంధరుఁడు సు
నసుఁ డమరకుతుఁడు వాసుదేవుఁ
డమ్మల దాయకుఁడు సదానందరూపుఁడు
దివ్య గంధలిప్తదేహుఁ డనఁగ 31

వ. పుష్పమాలా విరాజితుండును దివ్యపీతాంబరధరుండును నగు వ్యాధరుండు జగజ్జనని యగు లక్ష్మితోఁగూడి నిత్యముక్త పరివృతుం డగుచు సరస్తీరంబున కరుదెంచి యుత్తముండును నీలోత్పలాంతరస్థుండును నగు నయ్యర్భకుం గ్రొత్త[4]పోషణం బొనరించుటకై ప్రియమగు[5]కమలాహ స్తకముం బూనం

---

1 మూ - నమ  2 మూ - రా
3 మూ - త్రోతు  4 మూ - పోషణంబగు
5 మూ - కమం

దొసంగిన నాలేఖ బహుళముగా వజ్రాంతకుంగొని హర్ష మానసయై
స్తుతియింపుచు నతని తమ్ములం బొసంగెను సమ్మహాత్మ్యంబు తత్క్షణంబ
ప్రవర్తమానంబగుటఁ దర్శనయంబునం బాశౌరి యమ్మునీంద్రునకు
భూతాభిధానుండని ప్రవరమైన సరహస్యంబును సవిస్తరంబును బరమం
బను వ్యాసాఖ్యంబును నగు యోగంబు యోగి ధ్యేయుండును భక్తుండును నగు
నమ్మహాత్మున కుపదేశంబు గావింప మునిశ్రేష్ఠుండగు వాతండు జ్ఞానయోగ
రహస్యం బెఱింగి యతండును నప్పయుండును నగు వానిం గూర్చి
సంబంధ జ్ఞాన భేదంబులగువాని ప్రశ్నఁజేసిన భగవంతుండు సంబంధంబు
లగు జ్ఞానభేదంబులయందు కర్తృ కార్యం యందవి [1]సంబంధము
శ్రేష్ఠం బని లోకంబునందుఁ బ్రఖ్యాతుడు కతంబున మునీంద్రా దాని వటి
యింతు విను మని యట్లనియె ౯౨

తే గీ ద్వారి రామావతారంబుఁ దాల్చి నాదు
చరిత మధికంబుగాఁగ నాశ్చర్య మగుట
నిదియె విజ్ఞాన సిద్ధికై యొసఁగుచుండుఁ
బార్వతీశాలంబు నందు విస్ఫూర్తి మించి ౯౩

క మనసువలన నీ చరితం
బను దశకంధర వధార్థముగఁ దెలియఁగ నీ
కను జీవునిగాఁ బరమా
త్మ నయిన నను రాముగాఁగఁ దలపఁగ వలయున్ ౯౪

సీ ఉరుదీప్తియగు మదయోధ్య వైకుంఠంబు
[2]దగఁ బ్రపంచము దండకావనంబు
నందుఁ బ్రవిష్టుండనై పరమాత్మనౌ
నాకు లీలార్థమై నలవుగాంచ

---

1 మూ — సమ్మంధ 2 మూ — దనప్రపం

సీ. ఆమూధిగా నూ మర్త్యంబు విర్తేం
మను భారు దాస్యైకమూగఁ బ్రీయంబు
నగుచు భిన్నతఁ జేసి యనుదినంబును బ్రతి
క్షేత్రంబు గూర్చి వసించు నెన్ని
దగు గుణంబుల గల్గి యరయ నచింత్యంబు
నిం డవ్యక్త మనియు వచింప
నలరు చిదూపంబు నహంకారమును బంచ
భూత విస్మయములను నైదు

తే.గీ. నింద్రియంబులు పదునాలుం డెసఁగు బుద్ధి
తత్త్వ మవ్యక్త తత్త్వ మీ తత్త్వములను
నెంచి నిర్వికారాత్మగా నెసఁగుచుండు
మహితగుణధుర్య భక్తవర్య మౌనివర్య 108

తే.గీ. అవియు త్రైగుణ్య విషయమై యలరి జడము
నగు నవిద్యారూప మని యరయంగ నగుటఁ
నిందు సర్వేశ్వరుండనై యే సనాత
నుండనగు నీశ్వరుఁడనుగా నొప్పుచుండు 109

వ. సర్వ వ్యాప్తంబును నవరోధంబును నమలంబును నానందంబును నగు నాకారంబుతోఁ గూడికొన్న యనంతుండును నగుణుండును సాక్షియు శాస్త్రయు సర్వంబునకు ధారకుండును స్వాధీన సర్వవ్యాపారుండును శ్రీభూనీళాధినాయకుండును బ్రభుండును నిత్యలావణ్య సౌందర్య సంయుక్త శుభ విగ్రహుండును నే నగుట నేతత్పదార్థ త్రితయంబునందు ద్విపదార్థాత్మకంబగు జగత్తు మచ్ఛరీరం బనియు నీశ్వరుండనగు నేను

---

1 మూ సులేదు

లేలు గృహంబులు గల్గి తుల్యశీతోష్ణ సుఖ దుఃఖులై శరీరాదులందు నిర్మో
హంబు గల్గి భగవత్పాదాసక్తులై భోగాసక్త జనంబు వలన భీతులై భగవ
త్ప్రియ బాంధవులుగాన పరమానంద సంభృతులై యంత లోక్కాలం
బునం [1]దేశీకృతులై యూనంప్రీతులయ్యు దూరంబువలన దండ ప్రణా
మంబులు చేసి తద్దర్శ[2]నాతిశయాహ్లాద [3]పులకీకృత విగ్రహాలును బర
స్పరాలింగనతత్పరులును నానందాశ్రువిలోచనులును మాటిమాటికిం బెద్ద
దడ వనిమిషదృష్టిం [4]జూచి పైన పున్యంబుగు నంజలియుం దాసక్తి గల్గి
వినయా[5]న మస్తకులగుచు వారు ధన్యోస్మి యని పల్కుచు సమీపంబు
నందుఁ గూర్చున్నవారై [6]యతిభక్తి వినయాన్వితులుగా నన్యోన్య పృచ్ఛం
జేయుచు రహస్యంబును శేషశేషిత్వ లక్షణంబును భగవత్పరతత్త్వంబును
నగు జ్ఞానయోగంబు పరస్పరంబు వలన వినుచున్నవారై యనంతరంబు 112

సీ. సంతతం బన్యోన్య సత్సంగ వశమున
నిలఁ బరమానంద వృత్తిఁ జెంది
మాటి మాటికి వేడ్క మహనీయ విస్ఫూర్తిఁ
దిరుగుచు నొక్కెడ దివ్యమైన
సిరిమించు వామన క్షేత్రంబునకు [7]యదృ
చ్ఛంజేసి వారలు చని రయమునఁ
దత్పుర ప్రాంతంబు దడయకఁ బ్రాపించు
యోగీశ్వరులయం దనూనవృత్తి

---

1 మూ - దేశీకృతులై
2 మూ - నాతిప్రియా   3 మూ - పులకే
4 మూ - గలుపి   5 మూ - కృత
6 మూ - మతి   7 మూ - యదృచ

వ. సకల జీవదయాపరుండు గాన గాసారయోగి ధామం బొసంగి చప్పు డా మహాయోగి యచ్చట వృష్టిసిరంబునం దడిసి[1]నవాఁడగుచు హరిపదాంభోరుహధ్యాన సంలగ్న హృదయుఁడై సంకుచి[2]తంబగు నా స్థలంబునం దధివసించిన యమ్మునిశ్రేష్ఠుం గూర్చి యాగేహళి శేగుదెంచి తదవలోకనంబు సేసి నివర్తితుండగుచుఁ దోవుచున్న మహదాఖ్యుం గాంచి వేదివారు గృతాంజలులై బలాత్కారంబుగాఁ గరంబులం గైకొని గేహళిం జేర్చి ప్రమోదంబున నమ్మువ్వు రేకావాస మాత్రయగు నాగేహళి యందుఁ బరదుఃఖా సహిష్ణువులగుచు వార[3]లం దత్యంతంబుగా సంకుచితావయవులుగా నిరత్యాసులును నిశ్చలులును నిష్పందులును నిరంతర విఖ్యాతి పరులును నచ్యుతధ్యాన సుధాపానులును సునిర్వృతులుంగా నూరకున్న యెడ విశ్వేశ్వరుండగు దేవుండు గేహళిం జేరి తత్క్షమా చంచెచ్చుం జేసి తన్మధ్యంబునం దతిప్రవృద్ధుండయ్యె నని యిట్లనియె 118

తే. గీ. ఆరయ సమ్మర్దమునఁదై వర్షి పంక
నాతుదేత మునులు దారు యంత్రమునను
దగిలికొని యున్న చెఱకుల దంట్లరీతి
నుండి రచ్యుత సంస్మృతి నూని మదిని 119

ఉ. ఆయెడ వార లద్భుతము నొందుచు సచ్చటఁ గ్లేశకారణం
బై యలరారు [5]వామనుని యమ్మురవైరిని నాత్మదృష్టిచేఁ
వాయక చూచి చూడకయె భాసిలుచుండిరి నిర్వృతిప్రసం
ధాయక మానసంబు గొని నవ్యశతోన్నతులై పయంబునన్ 120

---

1 మూ — నలేదు 2 మూ — తలేదు
3 మూ - వారలయందత్యంబుగా 4 మూ - రు
5 మూ — నావునియ

తే. గీ. విశద పీఠము విస్తృతి వెలయ నీదు
కన్నులను మెఱుపుం మార్కొం గదలు కుంద
యముల వింటిల్లు గంధకలంబులను భ
జింపవారల నమలు సేయుకొంటు 184

తే. గీ. దివ్యము మహాత్మ్యశాలంబు భవ్యమగుచుఁ
జొల్పు మాణిక్యమంటపంబున భజింతు
భక్తి హృదయంబు వెనుఁగొను బ్రతిష్ఠఁజేసి
దేవదేవ గిరీశ వందితపదాబ్జ 185

సీ. కనుబింత దీప్తి సంకలిత కోటీర వి
రాజితు వాదు పూర్వమగు జన్మ
ముల నొనర్చు నలిన పుణ్యంబులను వం
మిందిరానాయకు వెల్లలోక
ముఖుఁ బ్రభుని హరిఁ బుండరీకాక్షుని
మఱ్ఱిన నలింప్య మధువిభేది
భవవార్ధి లంఘనోపాయ నవ్యయు గుణ
భరియింది రకాద పద్మములను

ఆ. వె. శరణమొంది యేను సద్భక్తిఁ గ్రైకొని
[1]నిరత మన్మహార్యకరుణఁ జేసి
యీ సమస్తములను గృతకృత్యుఁడ నగుచు
ధన్యుఁడుగఁ దనర్చుఁ దత్త్వరూపగను 186

---

1 మూ-నిరత

వ. ముకుంద దర్శనంబు వలన నాహ్లాద పరిపూర్ణ రసార్ద్రితంబును నానంద
గద్గదంబును నగువాక్యం బిట్లు సమాధీరితంబగుట సత్యాసార భూత
యోగీం[1]ద్రులు జగదీశ్వరు నవలోకించి తద్దర్శనంబువలన నమితంబగు
నానందంబు భరియింప నగరుహంబులంజేసి(?)యంచితులై ప్రపంచంబు
స్మరియింపక పారవశ్యగతులైన యప్పుడు సంపూర్ణమతులును మువ్వురు
నగు నమ్మునులకుఁ నాద్యంతగు హరి యచింత్యంబును నవ్యయంబును
నగు నట్టి విశ్వరూపంబు దర్శింపంజేయ మువ్వురు సత్త్వమయంబును
నానందమయంబును శుభంబును నగు రూపంబుఁగూర్చి ప్రణమిల్లి
యాయోగిశేఖరు లానంద మగ్నులై యిట్లని స్తుతియించిరి 187

సీ. జయ రమేశ చతుర్దశ భువనైశ్వర్య సా
 మ్రాజ్య ధురంధర మధువినాశ
జయ సర్వ సురగణ సార్వభౌమా[2] యఖి
 లేశ్వర యద్రిజాతేశ వినుత
జయ భక్త జనస్తోత్ర సాఫల్యమయ విగ్ర
 హా జయ నీలమేఘాంగ శౌరి
జయ కనకాంబర జయ కమలావర
 ధ్యాన మనోజ్ఞ భుజాంతరతల

తే.గీ. నాథ జయ సర్వకల్మష నాశ నామ
కీర్తన యనంత యచ్యుత కృష్ణ యోగి
మానస సాంబుజ కర్ణికా మధ్య వాస
జయ విమల పద్మపత్త్ర[3]విస్తారనయన 188

1 మూ-ద్రుడు 2 మూ-మా తర్వాత ం అక్షరమున్నది

3 మూ విస్తార.

క జయ ఖండిత దుష్టదనుజ
జయ విక్రమ దేవదేవ జయ సర్వజగ
న్మయ నిగమాంత విహార ని
ర్[illegible]య భువనవ్యాపి చక్రిశౌరీ 139

చ జయ కమలాసహాయ మునిసన్నుతపాద జనార్దనా హరీ
జయ పరమేశ నీ వెపుడు సర్వజగంబును బ్రోచు[1]చుండ్రు మే
మయమతి(?)భక్తిగైకొని త్వదంఘ్రి సరోజము మెచ్చుటంబుగా
నయతరనిష్ఠతో వనుపొందెద మెప్పు దయ్యతా 140

వ ఇట్లు మహాయోగీశ్వరేశ్వరులు హృషీకేశు స్తుతియించి నిగమసారార్థ
సంగ్రహంబులును నమ్మతమంటపసోపానంబులును నమ్మత చింతామణు
లును కథంబులును నగు మాండుప్రబంధములు గావించి రంత దేవుండును
వామ్నాయవేద్యుండును దయాపరుండును విశ్వమయుండును నగు విష్ణుం
డనవరతం బా యోగీశ్వరుల హృదయ కమలంబులయం దధివసించె నట
ముమ్మరు యోగంబులచేత దివ్యయోగసామ్రాజ్య వైభవం బతిశయంబుగా
భరియించుచు జగతియం దెయ్యెడ సంచరింపు చుందురని మహాయోగి
మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవపురాణంబు నందలి యుత్తర
ఖండంబునందు భక్తిపరాయణుండగు నారాయణుండు సంవాదంబుఁ జేసె
నరునకుఁ జతుర్థాధ్యాయంబుఁ జెప్పి పెండియు నిట్లనియె 14

సీ అంతట నాయోగు లందఱు పుణ్యభా
ముల యందుఁ దిరుగుచు [illegible] మఱి
నీ యాత్రయంబగు నాయొద్ది కరుదెంచి
రాత్మీయ మానసాహ్లాదు లగుచు

---

1 ము టుచ్కు

క. విదితంబగు తత్పద్మము
ముదిఁగల విజ్ఞాన మనెడు మార్తాండునిచేఁ
గొదిలి వికసింపఁ జేయుచు
ముదమున వర్తిలిరి యోగపూరిత మతులై 146

తే.గీ. తత్త్వ ధర్మ ప్రథ [1]గుణంబు తత్ప్రయోగ
కర్మకోపాకలంబునఁ గరము చంద
కోద్భవ ద్యుతి దామరాగోజ్జ్వలం స్థి
తిఁ గాను సిరిఁ గూడికొని యున్న దేవదేవు 147

సీ. తరుణార్క సమతేజుఁ దామరసాక్షు నూ
నీలా సమాయుక్తు నిర్మలాత్ము
దేవతేశుఁ గిరీట దివ్యహారణ్మయా
కృతిఁ బీతవాసునుఁ గృష్ణరూపు
భూరిచందనదామ భూషితుఁ గేయూర
కంకణాంగద సమా[2] కలితు శంఖ
చక్ర నందక ఖేట శార్ఙ్గేషుపాశాక్ష
దానవాళిభంగు ధర్మప్రదాయి

తే.గీ. దాం సూర్యోజ్జ్వలత్కౌస్తుభప్రభాతి
హారవిద్యోతమాన విస్తారవక్షు
వజ్రమణిరవీరంబుల మాలిం వికీర్ణ
మేఖలా స్ఫూర్తి కటిభాగు మహిత వాసు 148

---

1 మూ. గుణంగు 2 మ. కవిక

సీ. సామజ రాట్కర సన్నిభోరు యుగళ
[1]పాదర్శదారుతరాకృతి న్వి
నామయుగ్మ సదృశ సరసిజాంచిత పాద
యుగుఁ [2]గపోలద్వయయుతు ననంతు
సంతత ప్రాద్విత సౌందర్య విత సూన
బాణకార్ముకుఁ దరిభ్రూలతతిలోల
కుండల కర్ణయుగ్ము సదవలోకనో
ల్లోల సుశీల ఏపీల శుభ్ర

తే.గీ. తార విస్ఫూరితాల్పాపు త్రైవపఘుఁ
దారు దంతస్ఫుర ద్విద్రుమోరు లోహి
తాధరు సువాసితు మహాత్మ వచ్యతునిఁ బ్రి
యాశ్రీ శరదిందు ముఖ పద్ముఁ గరుణసద్మ 149

వ. ఇట్లు పరిశుద్ధంబగు స్మితంబు గల్గి పీతాంబర కృపావలోకనంబునం
జెన్నొందు హృషీకేశు ధ్యానించి ప్రత్యగాత్ముఁ నద్వైతు ఏకంబునందలి
[3]యత్యంత ప్రకాశక కౌస్తుభ స్వరూపిగాఁ జేసి, తదురఃస్థలానంద
కటౌధి సంస్థితులుగా మనంబు సన్నిహింపి యాది దంపతులగు లక్ష్మీ
నారాయణుల చరణంబులను కమలంబులయందు మధురంబగు మకరంద
రస సుధా పూరం బనయంబుఁ గ్రోలుచుఁ బరవశంగరు లగుచు సత్త్వ
స్వరూపంబులగు తత్త్వంబులచేత ([4]భాసితంబులగు) తత్కార పంక
జంబులయందు సంస్థితంబగు మకరందానంద రసం బాస్వాదనంబుఁ జేసి
నిర్భరానందులై యివ్విధంబున సమాధియుక్తులగుచు నుత్తమంబగు నేత
ద్యోగంబు ధరియించి బాహ్యప్రపంచంబు మఱచి చిరకాలంబు సమాస్థితులై
యుండు నప్పు డేను భక్త విక్షేపంబు సహింపనివాఁడ నగుచు మద్భక్తుల

---

1 మూ పాదర్శ 2 మూ యుగ కపోలద్వయయుతు ననంతు
3 మూ యత్యంత కరాత్మక'' క'' పర్ణమున్నది 4 మూ లేదు

సీ. ఇం దనుత్తమముగా నెసఁగు యోగముదాల్చి
మద్భక్తులగు వీరు మహితదీక్ష
వసియింపుదురు నాదు ప్రాణభూతులుగుట
నిర్భటనే వసియింతు వారఁ
ధారుణి యోగ విద్యామహాంబుధి తర
ణ్యతి మగు వీరి దర్శనము వచ్చి
వచ్చి నీ వరయవొ నరయంగ నాచేత
సల్పఁ దగినవాని సారసభవ 166

తే.గీ. యా క్షణంబున వసియింతు నొ క్షణార్థ
మవని వారక్త సంగమం బభింపావ
హరము త్రైవర్గ సాధనం బనుఁడు బ్రహ్మ
నన్నుఁ గూర్చి వచించె విష్ణుఁడియగుచు

ఆ.వె. యోగసిద్ధు లగుచు నొప్పు నీ భక్తులు
చూడ[1]రెట్టు లయినఁ జూడ్కిఁ జేసి
నన్ను వీరలను ననంత శ్రీ పురుషోత్త
మా యటన్నఁ బద్మ దళఘుమతిని 167

వ. మనంబున యోగంబు ధరియించి బ్రహ్మానందం బనుభవింపుచుఁ బ్రపంచం బతిక్రమించు చూడ్కి గలవారల కవలోకనం బేమి పని యనినఁ బత్యుక్షముండు మహామునివర నిశ్చలంబగు వీరి యోగంబు పరీక్షింప విధో పాయంబులచేత భగ్నంబుఁ జేసెదఁ బ్రసన్నుండ వగుచు నాకు యొసంగుము దీనం జేసి వీరి మాహాత్మ్యంబు ప్రకటంబుగాఁ జేయఁబడుఁగాక యనుచు దర్ధక్షణంబునందుఁ బ్రహ్మప్రసన్నుండ వగుచు నే నానతిచ్చిన విష్ణు మదనునకా

---

1 మూ. రెట్టనయున

వ. ఆ గుహలయందు శరీరధారులును యోగస్థులును నగు మునీశ్వరుల నా మృగంబులు దారుణంబులగు పాదవిక్షేపంబులచేత మర్దనంబు గావించె [1]వాని యందుఁ గొన్ని శరభంబులు క్షుధా సంపరిపీడితంబులగు దంత సంఘట్ట పీడనంబులచేత నాయోగివర్యుల భక్షించెఁ ధర్మకృత్య సంస్థితు లయ్యు వారందఱు ధ్యానసుధా పరిపూరితులై దానిచేతఁ గోపింపఁబడిన వారగుచు సుఖంబుగా నుండి రత్యాహార దోషంబుచేత శరభంబులు పిక్కటిల్లి పీడింపంబడిన వగుచుఁ గృశీభూతంబులును నిరుచ్ఛ్వాసంబులును నగుచుఁ బ్రాణాంతికము నొందిన నయ్యె నిట్లు హతంబులగు మృగంబులను శిష్యులగు నమ్మునులను నవలోకించి వివిధ విస్మితులై వారలఁ బ్రశంసచేసి దివ్యలోకమయంబులగు వారల కాయంబుల నిరీక్షించి దేవ మహర్షులతోఁ గూడఁ బ్రదక్షిణ నమస్కారంబులు గావించి యా యోగ ప్రభావం బెఱింగి మాటిమాటికిం బ్రశంసించి యను క్రమంబున యోగదార్ఢ్యంబును నగుఁ దత్ప్రభావం బిట్టిదంబని నరసిన వాఁడయ్యెఁ ననుదెంచి నాకు బ్రమోక్షకారంబగు యోగలక్షణంబు ప్రశ్నఁజేసె నా కొలఁ దయోగం బొసంగుమని ప్రార్థించిన నేను శేషశేషిత్వ లక్షణంబును లోకంబునందు జ్ఞానులకు యోగుల కత్యంత రహస్యంబును నగు యోగం బరయికొల కొసంగిన పిదప దేవదానవసందోహ మహర్షులతోఁ గూడ సంతు ష్టం డగుచు నాయనుమతింగైకొని పరమంబగు నిజధామంబుఁ బ్రవేశించె నంత 107

క. ఆదరార నపలక్షితయగు
తతి నా మువ్వురై న యోగి ధన్యుల దామా
ర్కారమతి నావ్య గదవి
మృగంబులైన మర్షించుం షడి రోగిన్ 108

---

1 మూ. వానియందు

క. ననుఁ గూర్చి మ్రొక్కి స్తుతింపఁ
గానియాడి ప్రియంబు వలవ గుణనిధులగు న
మ్మునివరులు నాదు పంపున
జనిరి సుపుణ్యమగు నైమిశవని స్థలికిన్ 184

తే. గీ. అంత వసియించు హరిదేవు నల్లు దాఁరు
బుధు ననంతునిఁ గన్గొని వందనములఁ
గరపి యందున్న మునుల కందఱికి వ్యాస
యోగ ముపదేశ మిచ్చి రనూన మతిని 185

వ. అనంతరంబ 186

క. పొగడొందు హరిక్షేత్రం
బగు సాలగ్రామమునకు నరిగి హరిఁ బ్రభున్
జగతీశుఁ జేరి సేవిం
జగతిని ధన్యులు మటంచు నలుపుదురు నతిన్ 187

ఉ. ఆ మునివర్యు లంతట రయంబునఁ దోయ యయోధ్యఁ జేరి వి
ద్యామ[1]యుఁ దత్త్వ[2]నిర్ణయ మహాత్ము రఘూత్తము లోకపాలు సు
త్రామ సురాంఘ్రి పద్మయుగుఁ దామరసాక్షునిఁ గూర్చి మ్రొక్కి లోఁ
బ్రేమము పెంపు భక్తి గురిపింపుచు స్తోత్ర మొనర్చి రర్థితోన్ 188

1 ము. యు 2 ము నిర్ణయము

క హరి సంబంధ ధ్యానము
[1]పరము విమలంబు భక్తిభావ్యాఖ్యము సు
స్థిరమతి నందు వసించిన
పురుషుం డొనఁగూడ నయ్యమున మునివరు లనఘా 169

తే గీ దక్షిణ తీరంబున సరయూతటమున
మందు రటియగు నొక్క విప్రుండుఁ దమ్ముఁ
గూర్చి యాలించు వానికిఁ గోరినట్టి
సహంధనము లిచ్చి రదట నావాసమొంది 170

వ దక్షిణుండగు నతఁడు తత్తత్ పదార్థంబు లొసఁగి యనంతరంబ యయ్యోగి
వరులు మధుర కేతెంచి హరియు [1]ద్భవించుము, నిఖిల గుణగణాలంకృ
తిష్ఠుండగు బాలకృష్ణుంగూర్చి ప్రణిపత్తిఁ జేసి సంస్తుతించి యంత
మాయాపురాధిష్ఠితుండగుచు దేవుండగు నమ్మధుసూదను యథావిధిగం
బూజించి పిమ్మట వారణాసిం జేరి భగవద్యశుం భజియించి యందువసియుం
డిన నరులకు జ్ఞానయోగం బుపదేశించి యవంతి కరిగి యచటివారుం గని
భక్తిమున మిక్కిలి పూజించి ద్వారవతియం దధివసించిన దేవుండగు
యాదవేంద్రు సపర్యగావించి యచట నంద్రవణమునందున్న గోపాల
సఖుండగు హరింగూర్చి ప్రణమిల్లి యట బృందావనంబుఁ జేరి నందనంద
నుండగు నచ్యుతు నర్చించి కాళియహ్రదంబున కేతెంచి యందు భక్తి
మందారుండగు గోవిందు నానందయుతా నభివందనం బొనర్చి గోవర్ధన
మహీధర శిఖరంబు నందలి గోపవేషుం గూర్చి నమస్కరించి పిదప భవ
న్ముంబు నందలి భక్తనేత్రసేవ యతిశయంబు గావించి తదనంతరంబు 171

---

1 మూ° తరము

తే. గీ. భవ్యతీరమగు గోమంత పర్వతమునఁ
జెలఁగు శౌరిని సంస్తుతిఁ జేసి యవల
యత్నమువలనఁ జని హరిద్వారమునను
జరఁగు జగదీశు సపర్యఁ జేసి 172

క. తరము ప్రయాగఁ దనర్చిన
హరిమాధవు దేవదేవు నమరస్తుతు ను
త్కరముగఁ బూజించి యచట
నరనుత వర్తిలితి కొంతసమయము భక్తిన్ 173

సీ. అటఁ బ్రయాగకుఁ బోయి యందుఁ దఱచు గదా
ధరు సన్నుతించి యుదారమతిని
గంగా సముద్ర సంగమమున వర్ధిల్లు
విష్ణుని మ్రొక్కి యభిజ్ఞుఁడగుచుఁ
జిరకాల మచ్చటఁ జెన్నొంది యందున్న
వారల హరిభక్తి పరులఁ జేసి
గురుతరంబగుఁ జిత్రకూటంబునకుఁ జని
యచ్చటి రాము నధిక భక్తి

తే. గీ. వినుతిఁ గావించి నిస్తుల విమల హృదయుఁ
డగుచు రమ్యనందిగ్రామమందుఁ గల్గు
రాఘవస్వామి దేవుఁ బ్రణతిఁ జేసి
యచ్యుతారాధనాసక్తుఁడగుచు నంత 174

చ. కలయఁగ సర్వపావనము గాంచు ప్రభాసమునందు జేరి యం
దలఁదగు విశ్వరూపు పరితోషయితామరకోటి సేవయున్
సలిపి యనంతరంబున విచక్షణశీలుఁడు మాసి పోల ర
వ్వలఁ జని రాత్మశౌరిని నపత్య యొసఁగుచు భక్తియుక్తుఁడై 176

యుత్తరఖండంబునందలి పంచమాధ్యాయంబు భక్తపరాయణుండగు
నారాయణుండు నరునకుం జెప్పిన పెండియు నతం డవ్వలి కథాక్రమం
బెట్టిదని నతని కతండు వివరించిన విధంబు సూతుండు శౌనకాదుల కిట్లనియె
178

మ. లలితానూన దయాపయోధి పటుశాలంకార యోగీంద్రహృ
[1]జ్జలజక్షేత్ర నివాస వానపగిరీశస్తోత్ర ప్రాత్రక్రియా
ద్వ్యం దివ్యాంఘ్రి పయోజ యుత భాస్వత్పద్మజాతాండ క
ల్ప లసత్ప్రాభవ భావ భావభవ రూపారూప నామక్రియా 179

క. గరచర కిరి హరి వటు భృగు
వర రఘువర రామ బుద్ధ వాజీశ్వర భా
స్వరరూప రూపవిజిత
స్మర స్మరణామృత పదాను సంధాయి హరీ 180

మాలిని. శరణదప సుతాంగా సత్యరూపాను[2]షంగా
వర విభవ నివేశా వాగినాద్రిస్థ వేశా
సురనగర విహారా సూరిలోకప్రచారా
విరచిత గుణ జాలా వేణుగోపాల బాలా 181

గద్య. [3]ఇది శ్రీమద్రాజగోపాల కృష్ణ కరుణా కటాక్ష [4]వీక్షణాప్త పాండిత్య
ధురీణవరతానకీ మండలాఖండ సామ్రాజ్యధౌరేయ స్వ సమర్థతాకృత
పటహ ధణంధణారావ విసరిత పరస్వకీయా ఢిల్లీశాధీశ దుందుభి ధ్వాన
కోలాహల హనూ[5]మద్ధ్వజాంక కనకదండికృత హార కటీసూత్ర నందిపుర
ప్రతాప కీర్తి ప్రాభవ కౌసం వంశపయః పారావార రాకాసుధాకర పితాం

---

1 మూ జలజా 2 మూ షాంగా 3 మూ ఇతి
4 మూ వీక్షణా 5 మూ మద్ధ్వజా

ఇరనాయక పౌత్ర రమణ భూపాలపుత్ర లక్ష్మాంబా గర్భశుక్తి ముక్తా ఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్యతిలక సుమసాయక ఇహరి పాము నాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబునందు ఇరవిశ్రాశ్వ మందు నారాయణుం గూర్చి నరుండు ప్రశ్నఁజేయుటయుఁ ఇరమపద వర్ణనంబును వాసుదేవ ప్రభావంబును లక్ష్మిప్రశ్నంజేసి నారాయణానుమతి వలన సేనేశాదు లంశరూపంబుఁ దొరమ నుద్యోగింపుటయుఁ గాసార భూత మహదాహ్వయ సంయమనంబును దత్త్రసన్నుండగుమ భగవంతుండు తదుపదేశకుండగుటయు వాసుదేవుండు మహాయోగులఁ గూర్చి విభిం ప్రాణంబు న్యాసయోగం బుపదేశంబు గావింపుమని యనుటయుఁ దత్త్ర సాదంబున వార లటు వలెనే సేయుటయుఁ దదనుమతింజేసి వారు తీర్థాట నంబు సల్పుటయు వర్షాగమనంబున నొక్కచో వారు మువ్వురుం గూడు టయు వారిభక్తి దెలియ గోరుచు భగవంతుఁ దప్పుడు ప్రత్యక్షంబగుటయు సమ్మోహంబుమలా హరింగూరిచి మానసపూజ గావించుటయుఁ దదాజ్ఞం గొని వారు నారాయణాశ్రమంబున కేగుచుటయుఁ దత్త్రపో మాహాత్మ్యం బును బ్రహ్మవైవర్తకంబును సరోభూత మహదాహ్వయుల సకల పుణ్యక్షేత్రములు సేవించి నీలాచలంబునందలి జగన్నాథుని సభివర్ణించు టయు నను నెత్పభావంబు గల ప్రథమాధ్యాయము సంపూర్ణము

❀

# భార్గవ పురాణము

## ద్వితీయాశ్వాసము

క శ్రీ వనితా భూ[1]నీళా
ధావాంబుదానువక్త్ర వాగినగిరి వా
సా వాసవ వందిత శ్రీ
రీ వైభవశీల సురపురి గోపాలా 1

వ అని సకలగుణ వికర ప్రజ్ఞాధురంధురుండగు నయ్యెడ వివిధ విబుధో[2]ప
లాలన పరాయణుండగు నారాయణుం గూర్చి ప్రణమిల్లి మహాత్మ మహా
భాగులగు యోగులు నిఖిలపుణ్యక్షేత్రంబులు సంచరింపుచు నీలాచలంబు
నందలి సుభద్రా ప్రాణనాథుండగు జగన్నాథుం జూచింది యవల నెటు[3]సని
రని యడిగిన నతం డిట్లనియె 2

తే గీ క్షితిని నంతటఁ దన్మహాక్షేత్రముఖ్య
మయి యతిశయంబు గాంచు సింహాచలంబుఁ
జేరి యందున్న నరసింహసారసాక్షుఁ
యుక్తమూర్తి జనార్దనుఁ బూజచేసి 3

క ఘనమతు లవ్వలఁ దులసీ
వనమున[4]వర్తిలిన గతిని వనజాక్షుని దే
[5]వనుతుని భక్తపరాయణు
వినుతించిరి యాత్మభక్తి విస్తృతి గాఁగన్ 4

---

1 మూ భూపీశ 2 మూ ధోసలా 3 మూ నెటురని నడిగిన
4 మూ నర్తిలి 5 మూ వనుతిని

తే.గీ. అంతఁ గృతశౌచమునమందు హరుని బయిని
వృతినహరుఁ బ్రణామగావించి పిదపఁ నధిక
పుణ్యమౌఁ బరమమగు స్తోత్రపూర్వకముఁ
జేరి రాధూతభక్తి సంస్ఫురదంగుమ 5

తాపారభూత మహామాహాత్మ్యయుత సింహాచలాది క్షేత్రముల సేవించుట

ఉ. మునివరు లాస్థలంబున సమున్నతిఁగల్గు నృసింహరూపి దే
వునిఁ బరమాత్ము నచ్యుతుఁ బ్రభున్ మధుసూదనుఁ దద్గుణాశ్రితం
బునగు సుధారసంబుఁ బరిపూరితభక్తిని గ్రోలుచుఁ ముదం
బునఁ బ్రణమిల్లి నిష్ఠఁగొని పుణ్యతరోక్తి నుతించి రర్థితోన్ 6

తే.గీ. హర్ష నిర్భర మానసుఁ లగుచుఁ గొన్ని
దినము లందుండి యచట వర్తిలిన నయం
బాశ్రితప్రియుఁడగు శ్రీకరుండు భక్తి
దృఢముగాఁ బాదు కొల్పిరి దివ్యమతిని 7

వ. అనంతరంబు యయ్యోగివర్యులు గోష్ఠి దినాంతరంబునందలి గుహాపార
మాహాత్మ్యక్షేత్రంబునందుఁ బ్రత్యక్షంబుగా స్మరణంబువలన మిక్కిలి
మూర్తి నొసంగు దేవుండును నారాయణుండును నగు హరింగూర్చి ప్రణ
మిల్లి స్తుతియింపుచుఁ దద్గుణంబు లభివర్ణింపుచు మహాయోగంబు ధరియిం
పుచుఁ జిరకాలం సమాహితులై యందున్న నరుం డనవరతం బపవర్గ
మార్గంబు దర్శింపం జేయుచున్నంత శ్రీకూర్మాధీశుండును నాంధ్రనాయ
కుండును నగు నచ్యుతుం గూర్చి దండంబుఁ బెట్టికొనియాడి యవం ధర్మ
పురింజేరి యందలి యోగానంద నృసింహుం గూర్చి మ్రొక్కి స్తుతియించి
యధివిష్ణు పదంబు నందలి విభుండును వరుండును లక్ష్మీనారాయణుండగుఁ
గృష్ణుంగూర్చి నమస్కరించి యభివాదించి భక్తివలనఁ బ్రణామగావించి
పిదప నహోబిలంబున కేగించి హిరణ్యాసుర మర్దనుండగు జనార్దను

సేవించి [1]యంతటఁ బాండురంగం బనుచున్న విఠలస్వామి సపర్య
గావించి తదనంతరంబున శ్రీవేంకటాచలంబుఁ జేర నేతెంచి 8

కాసారభూత మహదాహ్వయుఁడు వేంకటాచలంబున కరుదెంచుట

సీ. సౌవర్ణమయ సమున్నతంబు విచిత్రాతి
దారు[2]భూత స్ఫురత్ కాంతారవరము
నానామృగాకీర్ణ వనరాజి విరాజి
తంబు పొన్న సహస్ర ధన్యతీర్థ
పరివేష్టితంబయ్యుఁ బరికింప నారయో
జనములం[3] విరుపు యోజనములై దు
వెడలుపు గల్గి భావింప మర్త్యుల కతి
లాఘవ హారంబు నాహ్లాదకరము

తే.గీ. భుక్తి ముక్తి ప్రదంబు సంపూర్ణ ఫలము
[4]సర్వ తీర్థాధిపతియగు స్వామి పుష్క
రిణి గలిగి శేషరూపమై గణుతికెక్కు
నట్టి శ్రీవేంకటాచలం బనుదినంబు 9

క. వాంఛిత ఫలోపలబ్ధా
కలుషము భక్తాఘహరము గాఁదగు శేషా
చలము నిలిచ్చి సేవిత
మహము భజింతైన దాని సరసిజ భక్తిన్ 10

క. వనజాక్షునకు విహార పు
ర నివాసం బెట్లు ప్రీతి రంజిల్లు నట్లం

---

1 మా. యట 2 మా. తుట 3 మా. విధుదు
4 మా. సర్వతీర్థాధిప యగు శ్రీ స్వామి పుష్క

¹ దనారెడు నాగిరిఁ బలామరు
ఏమతింపుచు మ్రొక్కి భక్తి విధ్యుక్తముగాన్ 11

తే.గీ. అని శేషాచలావరోహణము నొనరుఁ
²దావన పదుల కంటించి దాని మూల
మునఁ గలుగు భక్తి తీర్థంబునను వసించి
రతిర నిష్ఠను చిరకాల మచల మతిని 12

క. మునులు మహాత్ములు యోగం
బున దైవాది యోగ విత్తములయి సమాధిన్
వనజాక్షుని యనుభవ మేఁ
పునఁ జేయుచు నుండి రార్య పూరిత భక్తిన్ 13

సీ. దేవతార్యములందు దేవదేవుఁడు ప్రీతి
వాసుండు దా మునివరుల ప్రేమ
నపుడు పత్రిలి కోమలావయవోజ్జ్వలం
బు గమించు లోకేశుఁడు గుణ మూర్తి
సుప్రసన్నుఁడు కోటి సూర్యప్రతీకాశుఁ
డాద్యంత రహితుఁ డనంతుఁడు హరి
చిరజాక్షుం డింద్ర నీలనిభశ్యాముఁ
డబ్జభవ శర్వార్చితాంఘ్రి తలుఁడు

---

మూ. దనారెడు 2 మూ కామున 3 మూ దాక్యంత

రంభాంచితోరుయుగళుండును సుజాను ద్విక[1]రాంచితుండును సర్వాధి కారియు సులలిత శరణ్యాంఘ్రియుగాంచితుండును విహంగరాజ పక్షవిక్షేప విచలిత కాంచనాంబరుండును శతపత్ర సంకాశ చామర సమీర చం చాతప్ల కమలహారుండును ననంత విష్వక్సేనాది నిత్యముక్త సమావృ తుండును బ్రహ్మరుద్రాదిదేవతర్షి పరిసేవితుండును సర్వేశ్వరుండును ఆనార్ద్ర నుండును జగత్పతియు నగు శ్రీపతి ప్రాదుర్భవింప మునిహృదయ కము దృశ్యమానుం డగుచు నదృశ్యుండైన నప్పు డా మహాయోగులు మిలితాక్షుల గుచు నాదేవేశు నవలోకించి మాటిమాటికిం బ్రణమిల్లుచు నిగమగోచరంబు లగు బహుస్తోత్రంబులను నగు ప్రబంధంబుచేతఁ గొనియాడిన శ్రీని వాసుండు సంప్రహృష్టుం డగుచు స్వహస్తంబున మిక్కిలివిస్ఫూర్తియుంపుచు దయచేసినగు పూర్ణావలోకనంబుల న[2]మ్మునుం గనుఁగొని యిట్లనియె

కాసారభూత మహదాహ్వయులకు వేంకటాచలాధీశ్వరుఁడు ప్రసన్నుఁడగుట

ఆ.వె. భక్తులార యోగివరులు మత్ప్రియులు మీ
రలు మదీయ మూర్తి తెలిసి మీరు
వెంటనంటి నేను వేడ్క వచ్చెదఁ జాలి
గోవు గ్రేపుఁ గూర్చి పోవు కరణి 17

ఆ.వె. సకల జీవ[3]కోటులకు ముక్తి కొఱకు మ
త్కాంక్షితంబు నమృత కారి సుఖము
వాదు తత్త్వము నగు న్యాసయోగం బిదె
దేశమిచ్చి పరము దెలుపఁ దొగిని 18

క. ఇది మొదలుకొని జగంబుల
పదపడి విన్యాశ్రయించు వారికి మోక్షం

---

1 మూ రాంఠి 2 మూ నమ్మునిం 3 మూ రాసుల

యి దనరుఁ గోర్కె లొసంగెడ
కుదమున సంశయములేక మునివరులారా 19

సీ. ఆ దేవదేవుఁ డచ్యుతుఁ డిట్లు నా
క్షాపించి వేంకటాచలముఁ జేరి
నంత నా యోగినాయకులు మువ్వురు భక్తి
తీర్థంబునందు వర్తిల్లి యచటి
వారికి నందు వఖ్యాగితులగు వార
లకు ముముక్షు రహస్య మకలంకంబు
నధికతరంబుగు న్యాసయోగం బంత
యు విశేషముగ నిచ్చి యొప్పు చున్కి

ఆ.వె. నప్పు డొక్క భూసురాగ్రేసరుండు త
త్త్వము నెఱుంగు కోర్కెఁ దనర వచ్చి
వారిపాదములకుఁ బ్రణమిల్లి భక్తిఁ ద
దాశ్రితుఁడయి ప్రవిమలాత్ముఁ డగుచు 20

క. కంయయంగ జీవ పరమా
త్మల సంబంధంపుఁ దెలివిఁ దంచు నతని వి
శిష్టిలి గారవించి మౌనిం
ద్రులు నుడివిరి వయతరోక్తి తోషిత మతులై 21

తే.గీ. అతులమైనట్టి సంబంధమైన ఖ్యా
యాదిగా దేహ దేహి స్వరూపకముఁ

---

1 మూ తనును

తెలియ దేహాత్మ దానికి దేహమయ్యె
దేహి హరి యచ్యుతుండయ్యె ద్విజవరేణ్య 22

వ ఈ రీతి శరీరంబుల కీనమంబు మోక్షసాధనం బగుట నేతద్విజ్ఞానంబు దెలిసి
విద్యుక్తంబుగా [1]నిరంతరంబు భాగవతార్చనంబు గావింప ద్విజోత్తమా
శాశ్వతి యగు ముక్తిఁ బ్రాపింపఁ గలవని యిట్లు పల్కిన వలతం దేమ రిత్తుం
డ[2]ను భాగవతార్చనంబుఁ జేయఁ గాం ద్రవ్య సంగ్రహణంబునం
ద[3]త్తుండ నని పలుకుచు భక్తి శ్రద్ధాన్వితుఁడగుచు పెండియుఁ దత్పాద
సేవనంబుఁ జేసిన నప్పుడు సర్వజ్ఞుండగు యోగు లతని యాశయం బెఱింగి
నాహాయమా కరుణచేతను నక్షయంబగు పాత్రం [4]బిచ్చి ధనపాత్ర
సంరక్షణార్థము సుదర్శనంబను చక్రం బొసంగి యెట దాని వంశ[5]పారం
పర్యంబుగా ధర్మసిద్ధికొఱ కగవతిని సంపత్సారస్వతాత్మకుండగు
పుత్రు పరని కిచ్చిన యోగీశ్వరుం వలన నిట్లువ్వఁబు గాంచి భూసురుండు
భూమియందలి శ్రీరంగాది సర్వక్షేత్రములయందు నిరంతరం బెందెందు
హరి యర్చగం దందందు మహాభాగవతులకు విధి పూర్వకంబుగా
నన్నం బొసంగి తత్రత్యపెద్దుఁ జేసి తద్భోజనం బభిం శివులకొఱ కిడి తద్విధిని
నసాధారణ వైభవంబుగ నే నుపగాహింతు నని హరిం గూర్చి నుడువుచుఁ
దిరువుండు ధర్మకీర్తవంబునలన జ్ఞానవంతుం డయ్యెడునని యమ్మహాం
దు నిత్యంబు చతుర్విధంబగు నన్నంబు వైష్ణవులచేతఁ జేయించి వస్త్రం
బులును గంధ పుష్పంబులును మువర్ణాభరణంబులును దను గసంఖ్యం
బగు నేతత్సంపాద్యంబు భార్గవునకు నమర్పణము గావించి తద్భోజనంబు
మొదట హరి భక్తుం కొసంగి యథాక్రమంబుగా బ్రాహ్మణ క్షత్రియ విట్

1 మూ· నిరంతరంబు 2 మూ· ణి 3 మూ· ని

4 మూ· బిచ్చిన 5 మూ· పార పర్యంతంబుగా

దానపరుం డయ్యెడు నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును
నగు భార్గవపురాణంబునందలి యుత్తర ఖండంబునందు సంవాదంబుఁ
జేసి భక్తి పరాయణుండగు నారాయణుండు నరునకు షష్ఠాధ్యాయంబుఁ
జెప్పె నా విట్లనియె 27

ఆ సారభూత మహదాహ్వయులు హస్తిగిరీశుని దర్శించుట.

సీ. అంతట మౌని నాయకులు ముచ్చరు శ్రీని
కేతనంబగు గిరిఁ గేలుమోడ్చి
ప్రణమిల్లి భక్తి సంపత్తిఁ బ్రదక్షిణం
బొనరించి యాదవాచలముఁ జేరి
నారాయణునకుఁ బ్రణామంబు గావించి
యతని యథావిధి నర్చనంబుఁ
జేసి యర్చ్యావాస స్థిరయందు నధికంబు
నగు ఘటికాద్రికి నరిగి యందు

ఆ.వె. ఘటికయందుఁ బాఱఁ గావింపు నప్తమో
నుండు మంగళముఁ వసీనాన గరిమఁ
దోఁచినట్టి దేవుఁ దోయజ నేత్రు న్న
సింహు బ్రాపుఁజేరి సేవఁజేసి 28

తే.గీ. అంతఁ గాంచీపురముఁ జేరి యందుఁ దనరు
నట్టి యరుణాచలముఁ గాంచి యధిక భక్తి
మ్రొక్కి ప్రియ హృష్టదేహులై రూఢి దాని
చెక్కిరి ద్వారిలమగ సౌను లిష్ట మతిని 29

---

2 ఎబా భక్తి

8 మా ... 4 మా దేశాయనేత్ర

సీ. పుణ్యకోట్యర్కాభంబు భువనప్రభావంబు
దివ్యమాణిక్య సందీపితంబు
నగు నవ్విమానంబునందలి దివ్య సిం
హాసనం బందున నధివసించు
నట్టి మహాత్మకు నమర వందితు గురు
పరదు విరాజితు శరధిశయను
దేవరాజుఁ గపర్ది దివిజనాథార్చితుఁ
బద్మాలయామనః పద్మమిత్రుఁ

ఆ.వె. పుండరీకనయను నార్ద్రదయాకరు
జగదధీశు దైత్యజనవినాశు
మౌనివరులు గనిరి మన్మథ మన్మథుఁ
గోటితేజరాజ స్ఫురితతేజు 80

మ. కరిశైలేంద్ర విభున్ జగత్పతి రమాకాంతున్ మహాధారు భా
స్కర సంస్థానుఁ జరాచరాంతరహృదబ్జక్రోడసంవాసు శ్రీ
ధరు లోకేశు సమస్తలోకతను [1]వంద్యత్కోటి సూర్యప్రభా
కరు నానందమయాంఘ్రి పంకజ నహిగ్రైవేయక ప్రస్తుతున్ 81

సీ. సౌశీల్య సౌలభ్య దాయ వత్సల ముఖ్య
గుణ వారినిధి లోకగురు మహాత్ము
దేవు దాంత్య భూతియగు ప్రసన్నాస్య
బింబఫలాధరుఁ గంబు కంఠు

---

1 వందధాతువు ఆత్మనేపదముగాన వంద్యానేక అని సవరించినగాని లేక సమస్తలోకతను వంద్యున్ కోటిసూర్యప్రభున్ గరుణా అని సవరించవచ్చు

సీ. చటుల పదాతి మస్తక ఘర్షణ పదంబుఁ
దెంగించె[1] నిడివడు సింధురములు
పృథుతర పరిపంథి హృత్పుటంబు లగల్చు
ఖురగతి మట్టాడు ఘోటకములు
పరిదేహ ఘర్షణాఘాత ప్రతి చక్రస్ఫూర్తి
రావంబుఁ బరగిందు రథ చయంబు
పటుతర గాత్ర ప్రాణంబులు హరింపఁ
గా హుంకరించెడు కాల్బలంబు

తే.గీ. గర్జిత ప్రావితరాజ సంగ్రామరంగ
మండలం బొప్పె నవ్వు దుర్ధండ పటహ
ఢంఢణారావ కాహళ ధ్వాన మయ్యెఁ
గాంచ లోకంబునకు భయంకరత రోఁప ౮౮

కాపాలభూత మహాదాహ్వయుడు కాంచీరాజున కభయమిచ్చుట

వ. ఇట్లు ప్రవిదిత మహీమండలాఖండలం[2] బఖండ విక్రమంబునం గొని సము
ద్దండ కోదండ మౌర్వీకా టంకార రవంబుగం జేసి విపాటితాఖండ దంతా
వళ స్కంధ పుట పటలంబగుచు నవ్వు కల్పాంత పావక శిఖలఁ దీం
ద్రించు నిశిత నారాచ పరంపరం సందీపితాటోప ప్రతాప విమల వీర
[3]తుండంబుఁ జేకొని గావించి బంధుర మదాంధ సింధుర ప్రేంఖోళిత కం
ఖాణ సమర్థాన వారాశివా వితానంబు రిపుచమూ వర్గంబుపైఁ బురికొల్పి
చురంబు సేయానెడు లోకంబున కతులవిలయ సమయ భ్రాంతి సంపాద
కంబుగ పరిపంథి రాజలోకం బసంఖ్య సంఖ్యకంబుగా గుమిగూడి

---

1. మూ. విడు 2. మూ. ఖండలామండ 3. మూ. కుండంబు

విజృంభించి యజాండకటాహ నిర్భేదముగా [1]సాధ్యుతం బేర్చి కార్చిచ్చు నదవి రౌలుకొను తెఱంగునం గాంచీపురాధీశ సేనం బరిమార్చి నా నరే శ్వరుండు సంక్షీయమాన స్వబలంబయ్యు బలవంతుండగుటం దానొక్క రుండు గ్రతువులతో యుద్ధంబు చేసి సంగరంబున సత్తుంగంబగు నద్భుతకంగబంబు బంకయుం బొలియింపం జేయునంత భీమప్రతాప వంతులగు మహీకాంతుల పైంబడి పోరికిం బిలిచిన యహంకారంబు వారితోం గూడ సాహసంబు గావించి యుదారంబులగు దర్పహారంబుచేత జర్జరీ కృత తనుండగుచు విమల[2]కీర్తి పొరలు దూలిపోవ నిజపురంబుం బ్రవే శించి యమ్మహాంబుధు కాసారభూత మహదాహ్వయులగు యోగివర్యుల సన్నిధి కేగుదెంచి యహీత భయంబువల్లం దదీయ పదారవిందంబు శరణంబు నొందిన వారంత నికీలు కథయం బొసంగి భయపడిన యతని రక్షింపవలయునని చక్రిం బ్రార్థించినం దర్పార్థవియుండగుచు నచ్యు తుండు తద్భ్రతుపథకాంక్షంతో చక్రంబు బ్రేరేపించిన 39

చ. శర కమలాప్త బింబరుచి చక్రము చక్రము వేగ మేంగి యు
ద్ధత శరకోటి కోటి నిపదంబు గదంగ నృపాలవర్యులన్
విరత పరాక్రమ స్ఫురణం జేర్చి హరించి భయంబు వేర్కొ నా
క్షితిపున కిచ్చి క్రమ్మఱను జేరె సనంత భుజాంతరంబునన్ 40

కాంచీరాజు శత్రుజయమునొంది కాసారభూత మహదాహ్వయుల
స్తుతించుట

తే.గీ. అంత నారాజు వారి సన్నిధిం గ
దాంగ జేసి [3]సనాతనంబును మహత్త్వ
మును సత్పుర మార్గము నెఱింగి మునుల యాజ్ఞ
చెనసి యా దీన రాజ్యంబు నేలుచుండె 41

---

1 మూ. నేర్పుచుం 2 మూ. దైన
3 మూ. సనాతనంబును

వ. విరాజితుండును మహాయశాఢ్యుండును నగు సర్వేశు నుపాసించుచు ననంత
రంబ యమ్మునీంద్రుఁడు దివ్యాలం గొనియాడి యివ్విధంబునఁ జిరకాలం
బం దధివసించి కాంచీపుర నివాసులకుఁ బరతత్త్వంబు బోధింపుచు
న్యాసయోగం బుపదేశించి యట నప్పురంబునఁ దాసిపోవ మంగళ శ్రీగృధ్ర
సర స్తీరంబునందు నెలకొన్న సకలలోకేశ్వరుండగు విజయరాఘవుం
దర్శించి యంత విశారద్యంబుఁ జేరి హృత్తాపనాశ [1] కరుణస్థుండగు
వీరరాఘవుం బూజించి దివ్యంబులగు స్తవంబులచేతఁ గొనియాడి
తదంఘ్రి పంకజద్వయంబుఁ గూర్చి ప్రణమిల్లి యదపఁ [2]దోతాద్రి
నెక్కి సంశ్రితామర మారుహాండగు తుంగసయను నారాధించి పిమ్మట
గిఙ్కంబున కరిగి యందల గజార్తిఘ్నుం సరసి యవ్వల బలి
పురంబుఁ బ్రవేశించి మహాబలి సమర్చించి యంతటఁ బరవ్నితుండును
జగత్పతియు నగు భక్తిసారుం గూర్చి విన్రఫీకృత మస్తకుఁగుచు
మిక్కిలి బ్రార్థించి తరువాత దేవేశుండును నప్రయుండును నగు నైంద్ర
పురాధీశు నుపాసించి గోపురియందలి గోపతి సథికయుగా సమర్చించి
యుత్తమంబగు శ్రీముష్ణ క్షేత్రంబుఁ ఁ డ్బి ష్ణోచనర్పరులగుచు దర్శ
నంబువలన ముక్తిదాయకుండగు వహావరాహు సంసేవించి సంపూర్ణ
మానసులగుచు మహా పుణ్యంబగు మహిళాఖ్య క్షేత్రంబునందలి పద్మ
లోచనం గూర్చి నమస్కరించి యనుత్తమంబులగు స్తోత్రంబులచేత
స్తుతియించి యనంతరంబ 47

### కాసారభూత మహదాహ్వయులు శ్రీరంగంబు ప్రవేశించుట

క. ధరణిని బ్రత్యక్షమయిన
పరమపదము నిఖిలలోక పావన మధికో
త్కరమగు శ్రీరంగము ముని
వరులు ప్రవేశించి రతుల ధావాన్వితులై 48

---

1 మూ కటి 2 మూ స్తో

సీ అతి భాసురము ప్రణవాకారము మహోన్న
తంబు నా౽మ్నాయ పరంబు కాంత
వ్రాది పోల్కి సింపనగు రంగ సంజ్ఞకం
బగు సద్విమానంబు నధిక భక్తి
దూరంబుగాఁ గాంచి వారు భారతి నేత్ర
పత్రపుటానుమఁ జేసి సత్రపసక్తిఁ
గల్గి వినయ సమాకలితులై యుత్తమం
బగు నా రథం బెక్కి యందుఁ దనరు

ఆ వె భుజగశయను గౌరిఁ బరము శ్రీ రంగ నా
థుని ననేకకోటి తోయజాప్త
సన్నిభ ప్రభుని బ్రసన్న ముఖాంభోజుఁ
బుండరీకనయనుఁ గాంచ సరసు 49

సీ మకుట కుండలదీప్త సుకర ముక్తామణీ
హార విభూషిత పమర వినుత
విష్ణుం బీనోరస్క విభాసిత స్వర్ణ
వసను వక్షఃస్థిత వారిరాశి
తనయతోఁ గూడ నుద్యద్విద్యుదంచిత
పీం మేఘముఁ బోలి నెఱయు వానిఁ
గణుత కంధరు దివ్యకాంతి గుణ ధరుని
నతులిత పారిజాతాగ్రము యక్షి

తే గీ సూత్రశోభితుఁ బరమ పవిత్ర దీక్ష
తనువిఁ బ్రసృతాన్య కరపద్ముఁ దత్త్వ సద్మ
స్వామి నీం తువం దళ శ్యాము గౌరి
హాసి హస్తోపధాను మహానుభావు 50

సీ. దైత్య సంహార నీకు దండంబు హరిభవే
ర భవా యనంత సరసిజాక్ష
పద్మాసనస్తుత్య ప్రణతి నీ కొనరు ప
భక్తప్రద నతి నీకుఁ బద్మపాణి
వనమాలి నీకు వందనము హృద్బ్జ ని
వాసి పంకజనాభ భక్త వరద
సత్య స్వరూప ప్రసన్నుండ వగుము శ్రీ
రంగనాయక గణనాథ వినుత

తే.గీ. శంకరార్చిత శ్రీపాద పంకజాత
యమరపాల ప్రశాంత ప్రపన్నార్తిహారి
కాంతి శోభిల దేహ సంతాననాథ
²మా కనుగ్రహండవు కమ్ము లోకధారి 64

కావేరభూర మహదాహ్వయులు కావేరి తటంబునం దధివసించుట

వ. అని యివ్విధంబున దేవదేవుంగొనియాడి తదీయ కరుణావర్ష సంప్లుతులై యందున్నవారలచేతఁ బూజింపబడిన వారలగుచుఁ గిందికాలం బధివసించి యనుత్తమంబును ¹సరహస్యంబును దాత్పర్యసహితంబును నగు ధ్యానయోగం బచటి వారల కందఱి కధికారానురూపంబువలన నెఱింగించి యార్తులకు వార్త ప్రవర్తియుఁ దృష్టులకుఁ దృష్టాంతంబును ధ్యానకాములకు ధ్యానంబును

---

1 ము మూలు సిద్ధచరిత్ర 2 మూ మ కమ్ముగహాండవు నమ్ము
3 సరహస్య 4 మూ దృష్టులంగు 5 మూ కాలము

సీ. అట వారి కడకేఁగి యతఁడు తద్పాదంబు
లను గూర్చి యు ప్రాలి లలిత మతిని
మంత మతి తెలి సుస్థిర భక్తిని గృతార్థ
హంగాంజలి యగుచు నవల భాష్ప
పర్యాకులాంగుఁడై భక్తి భావా యోగి
వరులను గొనియాడి వారి చరణ
ములయందు దాసభక్తి గలవాడ్కై కొని
వ్యాప్త మనంబునఁ [1]దుష్టి నొంది

ఆ వె. పల్కె మీ పదాబ్జ సేవ ప్రభావంబు
నద్భుతంబు సంపదావహంబు
గాన దర్శనంబు గా నాదు కృతార్థం
గంటి దివ్యమగుచుఁ గడలు కొనుట 60

కాపారభూత మహదాహ్వాయులు కుష్ఠత్రియుఁడగు
యోగిదాసున కనుగ్రహం బొసంగుట

వ. భాగవత పదారవింద పరాగం బఖిలార్థ సాధనంబగుట నిఖిలాపన్నాశకరంబును బరంబును పావనంబును మహత్త్వమునంగాఁ దనరు నదియ లోకంబునందు ముక్తి నొసంగు సాధనంబు దానికంటె నితరంబగు సాధనంబులేదని పెద్దలదవుఁ దొలగకున్న యతని సౌహార్ద దయా రసంబునం గనుంగొని మహాత్ములును హరిప్రియులును నగు మునీంద్రులు కరకంజంబులు [2]నెత్తియింపుచు నతని యమ్మహాత్మ్యపదంబు దయించి రంత నదియు యోగియు దాసాహ్వయుండును నగు పురుషశ్రేష్ఠుండు సంతతంబు వారలకు శుశ్రూష సేయ నిశ్చయింపుచు నంత వసియించియుండెనటఁ బతురంగబలయుతుండును భాగ్యసహితుండును శ్రీమంతుండును లోకాధిపతి యను రాజు పుత్రకళత్ర సంయుతుండగుచు శ్రీరంగనాథ సపర్య కొఱకు తత్క్షేత్రంబున కేఁగుదెంచి తత్రాంతరంగాధినాయకుండగు

1 మూ దృష్టి 2 మూ న్పతి

శ్రీరంగనాయకు సంసేవించి వివిధంబు లగు రత్నంబులును విచిత్రంబు లగు వంబ రయులును మహత్తగు స్వర్ణంబును దీటయిన. నను నను త్తమంబును నసంఖ్యం బును ప్రియతోనపార్జితంబును నగు వస్తువు నమర్పించి తద్భృత్యులకుఁ గవకమణి వసనాదికంబగు ద్రవ్యం బొసంగి యపు యోగీంద్ర సేవ కౌతుకుఁ దద్గ్రామం బున తిరుగుదెంచి మహిమాన్వితుం డై విప్రులారాను నపు దారం నిరీక్షించి కుటుంబిని కుమారికలతోఁ గూడఁ దత్పూజ గావించి యప్పుడు 61

## యోగిదాసుఁడు చోళరాజకన్యకా శతము నరిణయమగుట

సీ. ఆ రాజపుత్రిక లరిరమణీయ కం
దర్ప సన్నిభు యోగిదాసుఁగాంచి
మన్మథ నిర్భిన్న మానసలై వాని
యందు విలగ్న[1]మైనట్టి యాత్మ
వనుపొంది యచ్చట నధిపనియోగ వా
రంబి త్ర మెఱిఁగి యూరాఁ మదన
సుందరుండగు వానిఁబోలి యమ్మోహముఁ
గూర్చి దండము పెట్టి గురుమునివ

తే.గీ. దనరఁ గృతాంజలి యగుచు వినుతిఁ జేసి
తమ్ముమంవల్ల నాయోగిదాసకులము
గలయ విస్ఫురిత గోత్రంబు దెలిసి ప్రీతి
నరిది కొనఁగొను[2]ధారఁ గన్యాశతంబు 62

క. పౌరి నరట యోగిదాసుఁడు
గరమునఁ బాణిగ్రహణము గావించెను ద

---

1 మా. మానసలై నట్టి 2 దార

ధ్వరతీరకుమారికలను
బరిపూర్ణానంద విమల భవ్యాత్ముండై ౬౩

మ. అనవద్యుండయి యమ్మహీపతి సముద్యల్లీలమై సర్వమా
తనరాజ్యం బట యోగిదాసునకు సత్యస్ఫూర్తిగా నిచ్చి వే
ద్క్రను వానిం జతురంగ సైన్యముల తోడన్ వేగ మార్కొయ ప
త్తనమున్ జేరఁ గఁ బంపి తా నచట సుద్ధామ స్థితిన్ వర్ధిలెన్ ౬౪

తే.గీ. ఘోర వైరాగ్యుఁడగుచు నా భూవరుండు
సంతతంబా హరిప్రియ జపముఁ గూర్చి
భక్తి స్మరణంబుఁ జేయుచుఁ బ్రమతి మోక్ష
మొందె దేహాంతమందు నానందుఁడగుచు ౬౫

ఆ.వె. అంత యోగిదాసుఁ డంగనాసహితుఁడై
బల సమేతుఁ డగుచుఁ బట్టణంబుఁ
జొంది రాజ్య భోగములు చిరకాలంబు
ననుభవించె [1]సుభరతాప్తి యగుచు ౬౬

క. అరయ నాతప్పుడు జగదీ
శ్వర సేవ యొనర్చు కొఱకు శౌరిప్రియుఁ డు
త్కర మతిని యోగిదాసుఁడు
స్థిరభక్తిం జేరె పేర్కొ శ్రీరంగంబున్ ౬౭

---

1 మూ. సుభ

తే. గీ. అందుఁ దగు యోగి రాజ పదారవింద
[1]చిత్రితావనియందు విశేషభక్తిఁ
దివురు నా యోగిదాసుఁ జింతిత ఫలము
నడిగి మౌనులు సంప్రీతి నలవరింప 68

క. తర మనపత్యుఁగ నాతని
నెఱిఁగి మునులు వాని కొసఁగి రింపుగ ఫలాం
ఘ్రి[2]రజస్సమర్చన యుత
స్ఫురణము హరిభక్తిరతము పుత్ర ఫలంబున్ 69

వ. అంత 70

క. మును లాతనిఁ బంపించిన
ననుపమమతి యోగిదాసు డతి మోదముతోన్
జనియెఁ దన పట్టణమునకు
ఘనతర చతురంగ బల నికాయము తోడన్ 71

వ. అనంతరంబు

శా. శ్రీమంతుండగు యోగిదాసునకు సందీప్తప్రభావంబు ను
ద్దామ శ్రీ విభవంబు పుత్రగత సూత్సాహంబునన్ గల్గెఁ దో
భూమీనాథుఁడు పెద్ద కాలము మహాభోగానుసంధాయియై
ప్రేమన్ యౌవన సంపదం దనరె గంభీర ప్రతిష్ఠారతిన్ 72

వ. నిగమ నిగమాంతవేత్తలును ధనుర్వేద విశారదులును నగు వారలఁ జేరం
బిలిచి కాలంబుచేత యౌవనంబు నొంది సంతతంబు విష్ణు భక్తి పరులును
తదీయారాధనోత్సుకులుగాఁ దనరుట మహీ విభుండు పుత్రరత్నంబునకు

---

1 మా చి తావని 2 మా రజస్సేవార్చనయుత 3 మా దత్త ప్రమో

రాజ్యరతం బొసంగిన మహాబలులగు రాజపుత్రులు తమతమ రాజ్యంబు లొంది ధర్మంబున సకలం బగిలిం బాలింపుచు హరిప్రియులై యనయంబు భగవద్భాగవత పూజనంబు గావింపుచుఁ బ్రియంబెల [1]నట్టె యలరింపు చుండి రంత ధీమంతుండును నిరపేక్షుండగు యోగిదాసుండు మోక్షార్థి యగుచు రంగ క్షమాతలంబు నందున్న యయోధ్యాం సన్నిధి కేఁగు దెంచి నిరంతరంబు శుశ్రూష గావింపుచుఁ దత్కృపావలోకన వీక్షితుం డగుచుఁ దత్పాదసేవకుండయి వారంవలన న్యాసయోగార్థం బవగా హించి తదనుగ్రహంబువలన దుర్గమంబగు పరమ స్థానంబు ప్రాపించె నీ కథ[2] యోగిదాస చరితం బెవ్వ రెవ్వరు వినఁగలరు వారు ఇహలోకంబు నందలి సుఖం బనుభవించి దేహాంతంబునందు పరమంబుఁ గాందురని మహా యోగి మాహాత్మ్యంబు శ్రీమంతంబగు భార్గవ పురాణంబు నందలి సప్త మాధ్యాయంబు సంవాద రూపంబుగా భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పెయు చెంతియు నిట్టనియె 74

కావేర ఘాతమహదాహ్వయులు సకలలోక తీర్థాటనంబు సేయుట

తే గీ ఇవ్విధంబున నిరతాం మెంపు మౌని
పుంగవులు భక్తిఁజేసి శ్రీరంగమున వ
సించి యప్పురి వెడలి విశేష మహిని
భూరితర మార్గమునఁ గూర్చి పోవ నెదుట 75

క విమలాని శ్రీరామ క్షే
త్రము నడుమ వసించు హరుని ధరణీ నాథున్
గమలాక్షు దానక్షిప్రియ
సమోదంబిర భక్తిఁ బూజ సల్పిన పిదపన్ 76

---

1 ము నట్టెనె మం 2 దూ

తే.గీ. శ్రీనివాస స్థలమున వసించు దేవుఁ
డార్తజన భక్త కల్పక్షేత్రుఁడు డాఁ
భక్తిఁ గావించి యచల సువర్ణ భవన
వాసిని హరి సువర్ణున్ సపర్యఁ జేసి 77

క. పొగడొందఁగ నటఁ బుణ్యం
బగు వ్యాఘ్ర పురంబునందు నలరు మహో దా
హం గిరిశ వందితు శ్రీహరి
నగధరు సేవించి రతులితాహ్లాదమతిన్ 78

తే.గీ. అంత నాకాశనగరంబునందుఁ గల్గు
హరిని భక్తపరాయణు నంబుజాక్షు
శ్రీహరిని భక్తివర్ల నారాధనంబు
సల్పి యవ్వలఁ దోషిత స్వాంతులగుచు 79

క. వనజాక్షు భక్తి తత్పరు
లనఘులు మౌనివరు లుత్పలావర్తకమం
దొనరిన శౌరిని యమ్మరు
ఘనుఁ బూజయొనర్చి విగతకలుషాత్మకులై 80

తే.గీ. అంతటను బుద్ధ్యవరియగా వంరి ఖ్యాతిఁ
గాంచు మణికోటియందులఁ గల్గుదేవుఁ
బుండరీకాక్షుని మహాప్రభుని నుతించి
యవఎ గృధ్రపురినిగూర్చి యరిగి యందు 81

క. తనరు మహాకృష్ణుని పద
వనజంబులఁ గూర్చి ప్రమోక్తి భక్తిని యతినిం
గొనియాడి మౌని పుంగవు
డనుపమ హృదయానురాగులై యటఁ జనుచున్ 82

క. అమలంబగు విష్ణుస్థా
నము చేరి యచట మహాత్ము వనదగోపున్
గమలాధినాథు నచ్యుతు 83
సముదంచిత భక్తిఁ బూని సల్పెరి పేర్మిన్

వ. అంతటఁ బుణ్యంబగు శ్వేతహ్రదంబునందలి శాంతమూర్తిని సమర్చించి పిదప నగ్నిపురంబుఁ బ్రవేశించి యచట సురప్రియు సమారాధించి యనంతరంబు భార్గవస్థానంబునందలి భార్గవుం బ్రార్థించి వైకుంఠాఖ్యంబగు క్షేత్రంబునందలి మాధవుని పదారవిందంబులు తెలిసి యటఁ బురుషోత్తముం జేరి భక్తసులభ నర్చనంబు గావించి యవల చక్రతీర్థంబునందలి సుదర్శనుంగూర్చి కరంబులు మోడ్చి మహాపుణ్యంబైన కుంభఘోణంబునందలి శార్ఙ్గపాణి చరణకమలంబులం గూర్చి ప్రణమిల్లి కొనియాడుచు నచ్చోటు వాసి దూరస్థానం బాశ్రయించి శాశ్వతవందనంబు చేసి, యంత నమ్మునులు కపిస్థలంబున కేఁగుదెంచి గజార్తిఘ్నుం గూర్చి నమస్కృతిఁ గావించి యంతటను మనోహరంబగు చిత్రకూటంబునందు వెలుగొందు దత్తమోత్తమువంటగు గోవిందుఁ గాంచి ధ్యానంబు చేసి తరువాత శ్వేతపర్వతంబునందలి పద్మలోచనుంగూర్చి నమ్రులై యథాన్యాయంబుగాఁ బూజించి పిమ్మటఁ బార్థస్థలంబునకుం బోయి యందు పరబ్రహ్మ నుపాసించి యనంతరంబు కృష్ణకోటియందలి మధుద్విషు సేవించి మహాముదంబుగ వారలు పరిపూర్ణ మనోరథు లగుచు నందపురి యందలి మహానంద నిధి నందనముగావించి మథురాపురి కరిగి యచట వృషాశ్రయ మాశ్రయించిన వారగుచు నంత 84

తే. గీ. అతులమగు సంగమగ్రామమందుఁ జేరి
సంగమాహ్వయు సేవించి సదయు లక్ష్మి
సింహయుతుఁ గరణ్యపురిఁ జేరి నిష్ఠ భక్తి
శరణముగఁ గాంచిరి శరణ్య హరినిఁ గూర్చి 85

క. విమలంబగు సింహక్షే
త్రమునకుఁ జని యందుఁ గల్గు ధరణీధరహరిన్
గమలాక్షు మహాసింహునిఁ
గమనీయ సుప్రశ్రయంబు గావించి యటన్ 86

క. ధరణీమంటప సంస్థితు
హరి మల్లారిని నుతించి రనఘులు శౌరీ
శ్వరులు సమాహ్లాద హృదయు
లురుతర సుఖి[1]తాత్ము లగుచు నూర్జితరీతిన్ 87

క. ఘనమగు నిడద క్షేత్రం
బున జేరి మహాత్ము లిలం బూజ్యుని దేవే
శుని నిడదాకారుని హరి
వనజాక్షుని సంశ్రయించి పరమోత్సవులై 88

క. లలి నట ధానుష్కంబునఁ
గల జగదీశ్వరునిఁ బూజగావించి మఱి

---

1 మూ. లాత్మ

శ్యాల యగు మోహనపురి యం
దలి యమ్మతుఁ గాంచెమేఖా దర్శించి రాగిన్ 89

ఎ అంత 90

తే ఎల సరోభూత మహాదాహ్వయులు సుభక్తి
వలరఁ బాణ్యంబు సమహాంచినట్టి మధురఁ
వేరి సుందరు పదసరసీరుహంబు
సంగ్రయించి మునీంద్రులు సంతసమున 91

క భాసుర మరి వృషభాద్రిని
వాసము గావించినట్టి పరమస్వామిన్
దాసవనుతుఁ బాతించిరి
ధీ సంపద గర్గ నిఖులం దివిజస్తుతులై 92

వ అంత శ్రీ మద్వరగుణ క్షేత్రంబు నందలి వారు మహాసింది ప్రేమార్ద్రిం ఎను గమలంబును వగు మనంబు గలవార లగుచుఁ బిదపఁ గురుకాళ్యంబగు మహోత్సవంబు నందలి రమాసఖు నారాధించి ప్రియాన్వితు లగుచు గోష్ఠిపురంబునందలి గోష్ఠిపతి నభివాదనంబు గావించి దర్పసంస్తరంబుగ కేఁగుదెంచి గయానుంగూర్చి వందనం బొనర్చి ధన్విమంగళక్షేత్రంబునందలి శౌరిం బూజ గావించి క్రమరక్షంబునం దధివసించు బలాఢ్యుఁ బిక్కలి నపర్యసల్పి కురంగింబు నందలి పూర్ణుఁ బ్రార్థించి యనల లదిష్ఠలంబు నందలి విష్ణుం గూర్చి మాటిమాటికిం బ్రణమిల్లుచు దివ్యంబులగు నంత్ర వంబులంగొనియాడి తామ్రపర్ణి యందు సమావిష్టులగు నచ్యుత పర్వగావించి పూజ్యంబగు పవంతగయపం బందుండు జగత్పతియగు బద్మనాభుం గూర్చి నమస్కరించి స్తుతిఁ జేసి పరమానంద నిర్భరులగుచు మహీతలంబున నిర్విఘ్నంబున నగరంబులను మోక్షదంబులను విష్ణువాసభూతంబు

లును దివ్యంబులును నేతదాద్యంబులును నగు క్షేత్రంబులం గూర్చి సంద
ర్శింపుచు యోగివరులు సంసారధ్వాంత¹వర్తులగు తత్ర న్నివాసులకుఁ
గృపాన్నదులగుచు సంతతంబు ధ్యానయోగ ప్రదీపంబున బ్రహ్మాది దుర్ల
భంబు నగు మోక్షంబు దర్శింపఁ జేయుచు యదృచ్ఛచేతఁ గొంతకాలం
బధివసింపుచు ననంతరంబ యొక్కసమయంబునఁ గ్రమ్మఱ వేంకటాద్రి
కరుదెంచి వెండియు తత్తీర్థంబునం దధివసించి యథాసుఖంబుగా సమా
సీనులగుచు మునుమిక్కు దనుత్తమంగు నశేషక్షేత్రయాత్రలు గావించితిమి
శ్వేత ద్వీపాదియాత్రఁ గావింపలేదని మిక్కిలి చింతించి యున్నపుడు
93

క. వారు మహాయోగము వి
స్తారమతింగొని యథోక్తసత్కరణము వొ
ల్పారఁగ శ్వేతద్వీపముఁ
జేరిరి నిస్తుల మహత్త్వశీలాస్పదులై 94

క. పేరిఁ దారకసంజ్ఞికమై
పరగంగా నందు నుండు పరమబ్రహ్మం
బరసి శిరస్స్పష్టాంగముఁ
గరపి రధికముదులఁ జేసి గౌరవఫణితిన్ 95

సీ. అంతట క్షీరాబ్ధి కరుదెంచి శ్రీభూమి
ప్రాణాధిపుని హరిని విశ్వరూపుఁ
బన్నగశాయిని భవహారకుని దివ్య
మగు నలంకారంబు నందువాని

---

1 మూ. వర్త

ఉ. అందుఁ దనర్చు విష్ణుఁ బరమాత్ముని విశ్వవిభున్ ప్రభున్ సదా
నందు రమాసమేతుని యనంత విధాతృమహేశసేవితున్
గంధవిభాంగు నమ్మతునిఁ గౌస్తుభ భూషణదివ్యసుందరున్
మందరధారిఁ గేశవు సమాహిత పాదపయోరుహంబులన్ వాసిన్ 100

క. సకల[1]లాలంకృతి సంయుతు
మకరధ్వజు జనకుఁ గాంచె మౌనీశ్వరు డా
తత్పర భావంబుగుచు ప్రొక్కికి
[2]వికసీకృత భక్తి హృదయ విమలాంబుజుఁడై 101

తే.గీ. దివ్య సన్మునులు నుతించు దివ్యదీప్తు
లవల సామోదలోకంబు నందుఁ జేరి
యందు వర్తిల్లు ననిరుద్ధ నమలమూర్తి
నరసుని నుషాపతిని గూర్చి సంస్తుతించి 102

వ. అతని నమస్కరించి సంప్రహృష్ట తనూరుహు లగుచు నటఁ బ్రమోదకం బగు లోకంబు నందలి ప్రద్యుమ్నుం గొనియాడి దివ్యస్తుతులంజేసి సంస్తుతించి యోగీంద్రులుఁ బ్రహృష్ట లగుచుఁ దదన్యామోద లోకస్థుండును విభుండును నగు సంకర్షణుం గూర్చి ప్రొక్కి పరిపూర్ణమనోరథు లగుచు స్తోత్రంబు గావించి యవల నానంద నిలయంబును మహత్తువగు వైకుంఠ నిలయంబుగాంచి యందు దివ్యంబగు సింహాసనంబునందుఁ బ్రకాశించు సనాతనుండును గోటిసూర్య ప్రతీకాశుండును గోటిమన్మథ సదృశుండును దివ్యపీతాంబర ధరుండును దివ్యకుసుమగంధ సమన్వితుండును శ్రీ భూసీ

---

1 మూ సకలాంకృతి   2 మూ వికసీ

తే. గీ. అనుపము నలౌకికుని నీ వుదార మతిని
యిచ్చు నిట్టిదా నీవ గ్రహించి కొనుము
అడుఁడు నుతుఁడేల యనుచును స్వాత్త్విక వయసు
లేని యాదంపతులఁ జూచి యాదరించి 112

సీ. హరి యిట్లు పల్కె మీ యాత్మజుం డల మహా
యోగి మత్స్యేంద్రుఁ డుద్భవించె
లోక రక్షార్థ మలౌకిక స్థితితోడఁ
గన మర్త్యమాత్రుండు గాఁడు సుమ్ము
యటుగాన మీరు హర్షాత్ములై యాత్మజా
రక్షింపుఁ దన రమారమణుసూక్తిఁ
రసయు నపార్థికృతతనుని యా హర మంది
రమునకే పోషింప రమణితోడ

తే. గీ. నతఁడు బాలార్క నిభుఁడు పర్యంకతలమ
యానుఁడు హరిపదాంబుజ ధ్యానలగ్న
మానసుండయ్యెఁ దద్దేవ మందిరమున
గలయఁ జరియింపుచును నొక్క కాలమునను 116

వ. అందుఁ గింద గరు మూలాధారకోటరంబు ప్రవేశించి బద్ధ పద్మాసనాసీనుండును నిమీలిత నయనుండునై హృత్పద్మంబున నచ్యుత శ్రీరామ పాద పద్మాలోకనంబు సేయుచు బాహ్యంబు నవలోకింపక యే గసమాధి నధివసించె నిట్టిదయిన షోడశ వత్సర కాలం బమ్మహాత్ముండగు హరి సుతుండు హరిసమాలోకనాహ్లాద నిర్భరుండై యుండె నని మహాయోగి

క. వచ్చిన [1]హరిఁ గని కన్నులు
విచ్చి మహానందమునను వెస లేచి యతం
డచ్చోట మాటి మాటికి
మెచ్చిన భక్తిని దండము లిచ్చు నుతించెన్ 117

వ. అంత నతండు మౌనంబు విడిచి నిటలతట ఘటితాంజలియై యిట్లనియె శ్రీ సర్వేశ కమలాకర కమలలాలితంబులును నూపురోజ్జ్వలంబులును రక్తారవింద సుందరంబులును పద్మరాగమణి ప్రభవంబులును వజ్రధ్వజాంకుశ పంకజ కల్పవృక్షాది వాంఛితంబులును ఇంద్రమండలఖండాభ నఖరాజి విరాజితంబులును సువృత్తాకార రుచిరాంగుళీ శోభితంబులును సుపార్ష్ణి పార్శ్వలలితంబులును ప్రవాళాంకుర కోమలంబులును సంరక్త నీల వర్ణపరివృతంబులును బ్రహ్మరుద్రేంద్ర మకుటమణి నీరాజితంబులును సర్వామరార్చిత కల్ప పుష్పవిలసితంబును దుళసీకోమల ప్రభాపటల భాసితంబులును లక్ష్మీవక్షోజ కాశ్మీరచందనాలంకృతంబులును ననవరత భక్తి వినత సంకరాలోక సంకరంబులును ఇందిరా కపోల సయువ పల్లవాధర వక్షోభిమర్దితంబులును బ్రహ్మాస్త్రి హరంబులును సమాధి మహిత మహాయోగీశ హృత్పద్మస్థాపితంబులును సమస్తాంతర లోకప్రియంబులును గంగాజనకంబులును సకలప్రపన్న జనాభీష్ట ప్రదంబులును భక్తజన కామధేను కల్పతరు చింతామణి సమానంబులును శరణ్యంబులును వరేణ్యంబులును ధన్యంబులును యనన్యంబులును నిరామయంబులును వదాన్యంబులును నగు భవచ్చరణాంబుజంబులు శరణంబులుగ నొచ్చెదనని వినుతించిన గరుడాద్రియగు నయ్యనంతుం డనంత వేద శాస్త్రోదితం బయ్యెనికి దివ్యాగ్రంబైన ద్రావిడాకృతిం బ్రత్యక్షమ నట్లుగాఁ గృపా కటాక్షంబున వీక్షించి యమ్మహానుభావుండు పరమ పదంబు గూర్చి చనిన యనంతరంబున 118

---

1 మూ. హరిగన్నుల

## శఠకోపముని దివ్యప్రబంధంబులం జేసి హరియర్చావతార విగ్రహముల నాకర్షించుట

చ. ఆ ఘనదైత్యసంహరు కటాక్ష వశంబునఁ జేసి సర్వవి
ద్యామయమైన భారతి శుభాత్మక యాతని జిహ్వయందు ను
ద్దామత నిల్వఁ దత్త్వమయి తన్ సుగుణుల్ గొనియాడ నర్థిఁ బ్ర
జ్ఞా మహిత ప్రచారగతి నంతత నిర్మల వృత్తి నందిటన్ 119

సీ. అగాధ వేదమయంబులు దివ్యముల్
శ్రీహరి భక్తి విజృంభితములు
సమ్మతానంత కల్యాణ గుణావళి
మణి పయోరాశులు మౌనివర్య
ములు పరతత్త్వార్థములు నిరవద్యముల్
బహువిధ చేతన పావనములు
హరిపాదభవమగు నా గంగయును బోలఁ
గడు పవిత్రములు మోక్ష ప్రదములు

తే.గీ. ధన్యతరములౌ నగు ప్రబంధములు చేయ
వింటు సత్కారిసుతకృత కృతులఁ గాంచ
నమరి యర్చావతార రూపమున సర్వ
సంస్థితాత్మక మూర్తి యచ్చటికి వచ్చె 120

## శఠకోపముని యర్చావతార విగ్రముల విధానమ్ముం గనుపుట

ఉ. ఆటఁ బిందారకు కోటిరాంతరమునం దారామముంగాంచు నా
షండకుం జేరి తదీయ నంస్తుత పృథక్ ప్రత్యాలి వెంపొంది యు
త్కృష్టరీతిందగు దివ్య సత్కృతులంచేరన్ భక్త సందర్శన
స్ఫుట సంహృష్టము లౌచుఁ దిండె ౨౦ నమ్మూర్తుల్ స్వధామంబునన్

తే గీ. వాని మధ్యంబునను శ్రీనివాసు శేష
శైలవాసు జగద్గురు శౌరి ననంత
విప్రబృందమ్ము లర్చించి రహిఁ దనర్చు
హర్ష విలసిత మానసులగుచు నపుడు 122

శఠకోపుండు చింతామహీరుహ కోటరావాసుండగుట

తే గీ. చారుతర తత్ప్రదాప్త నిష్యంద మధుర
సామృతముఁ గ్రోలుచను సమాస్వాదమునను
దద్గుణాస్వాద మత్తుఁడై తత్ స్థలంబు
నందు షణ్మాసి నందముఁ దదివసించె 123

సీ. ఆ సమయమున సంభావహంబగు తామ్ర
పర్ణి నది తీర భాగమునను
నమరు కోం గ్రామ మందు వర్తిల్లు మ
హీసుర శ్రేష్ఠుండు భాసురుండు
హరిపదాంభోరుహ [1]ధ్యానమూర్ధ్వపుండ్ర యుక్త
ముఁడు తద్భృత శ్రేష్ఠ భూసురుండు
దేశికుండును విజితేంద్రియుండు[2] ను బరి
తత్త్వార్థ విదుఁ దతి సాత్త్వికుండు

తే గీ. వాడికేసరివాముఁ దభార్యగుణుఁడు
సామవేద పరాయణుండౌ మహాత్ముఁ
డీ ప్రభావంబు గలవాని గృహిణియైన
సతి యనెడు పేర విలసిల్లు సాధ్వియందు 124

1 మూ ధ్వారోద్వేగరోత్త 2 యూ ప్రాఙ్జదు పర

## మధురకవి జననము

క. సేనేశ గణాధ్యక్షుం
డైన కుముదనామకుండు హరి హితుఁడు కళా
నూన మగు చైత్రమునఁ జి
త్రా నక్షత్రంబునం దుదారత వారమున్ 125

సీ. జన్మించె నతఁడు దా జన్మప్రభృతి లబ్ధ
వర భగవద్ధ్యాన వైభవుండు
విమల యోగమహత్త్వ విస్తార పరమత
తత్త్వార్థ నిర్ణేత యష్టాక్షరాఖ్య
మంత్రరాజ జప సమాసక్త హృదయుండు
హరిపదాంభోజ నిష్యంద మధుర
సాస్వాదనపరుఁడు దగుచు రమాధీశ
మాధుర్య కవితా సమగ్ర రచన

తే.గీ. మధురకవ్యాఖ్యఁ దనరి యమ్మహా గపీంద్రుఁ
డతి కృపానిధి యఖిల వేదార్థవేది
యఖిలవేద ప్రశస్తుఁడు యఖిల భోగ
ములు విరక్తుఁడు గురుభక్తి కలితుఁడగుచు 126

ఉ. అందు వసించు శేషశయనాంచిత శౌరిని హృత్ప్రయోజనం
దందముగా భజించి మరి యచ్చటనచ్చటఁ గల్గు విష్ణు స
న్మందిరముల్ సుతీర్థములు మాటికి సేవ యొనర్చుచున్ జగం
బుం దనివారి చేసెం దైర బవిత్రిఁ బరిభ్రమించుచున్ 127

క యమునను బవిత్రతరతో
యమునను గృతదురితసంచయమునను సదుపా
యమునను గృతసుకృత నితా
యమునను గందాని సవినయమునను నచటన్ 127

క మఱియు నవిద్యాబంధని
బరవిద్యాప్రదయుఁ గృష్ణపద విన్యాస
స్ఫురిత ప్రాంతయు నగు నా
తర[1]యగు కాళిందిలో యథాన్యాయముగాన్ 129

క స్నానం బొనర్చి తత్తీ
రానవదేశమున హరిపదాంభోజమున్
మానస మెసఁగ సమాధిన్
ధ్యానింపుచు నియతి దాతఁ డందు వసించెన్ 130

ఉ అంతటఁ గొన్ని నాళ్లరుగ నప్పుడు దక్షిణ దిక్కునందు దు
ర్వాంతముగాఁగ భానుశతధామ సహస్ర నిభోజ్జ్వలంబు న
త్యంతము దివ్య మద్భుతము తప్పరకోపమునింద్రు తేజ మ
త్యంతయుఁ గాంచి విస్మయ సమేధిత మానసుఁ డౌచు మేదుకన్ 181

క కనుఁగొని యవ్వని రుచియా
వనజదళాక్షునకెాని యందు నరుం
దనిశము హరిసదృశం బగు
మునిశేఖరుఁ డందు నుండఁ జూలా నధికుఁడై 182

1 మూ మ

## మధురకవి శఠకోప సందర్శనార్థం బయలుదేరుట

సీ. అనుచుఁ జింతించి తదాలోకనముఁ జేసి
యతని పాదాబ్జంబు లాశ్రయింతు
[1]నని మనమున నిశ్చయ మొనర్చి తత్క్షణ
మునఁ బార్శ్వ నిధి వేగమునఁ గవీంద్రుఁ
డా దిక్కునకు స్వస్థ మనస్కుఁడై పోవ
మార్గ సంస్థిత నదీమహీధరములు
పల్లెం వనంబు లెల్లఁగ దిత్తుం దగు
తన్మహామహునకు దారి యొసఁగఁ

తే.గీ. గాన భాగవతుల కెవ్వరేని చేయ
చుందురె సహాయ మట్లౌట గురు మనీషి
యైన యమ్మధురకవీంద్రుఁ డతులభక్తి
నతిరిఁ గురుకాఖ్య నగరంబుఁ జేరవచ్చె 188

వ. అందలి బిందారక కోటరంబునం దధివసించు మహా మహుండును బ్రహ్మా సనాసీనుండును భద్రపత్రనేత్రుండును ప్రసన్నవదనకమలుం డును దీర్ఘబాహుయుగళసమంచితుండును విశాలఫాలఫలకుండును విస్తీర్ణ భ్రూయుగ శోభితుండును గంభీర నాసాంకురుండును బింబోష్ఠ ద్వయ విరాజితుండును సముజ్జ్వలాదర్శ సంకాశకపోల విలసితుండును తిరస్కృత కుందకోరకదశనలసితుండును మహాహనుండును గూఢ జత్రుండును గంబుకంధరుండును మందస్మితదంష్ట్రికా నిస్తంద్ర వదనచంద్ర మండలుండును సముదగ్రకుందిల స్కంధుండును విపుల తర వక్షస్స్థలుండును పీనదున్నత కుక్షిస్థ నాభిగహ్వర భ్రాజమానుండును

---

1 మూ మానసము

సమస్థిరోరు యుగ్మంబును బ్రహ్మబ్రోణకటితటంబును సంశోభిత తానుతుంబూద్వయంబును శోణపాణితలాంబితంబును స్ఫురదరుణారవిందచరణ సుందరంబును భావ ముద్రాముద్రితంబును జటామండలమండితంబును గరుడాంకాంకహృదయంబును దాంబూన్ప్రభాభాసమానంబును నమాధినమాయుక్తంబును నగు నమ్మహానుభావుం గనుంగొని యానంద సమాకులేక్షణుం డగుచుఁ బ్రణమిల్లి యతని పదారవిందయుగళంబు నిజనేత్రాంబుజంబుల మిక్కుటంబుగా సంస్పృశింపుచు బహువిధస్తోత్రంబుల స్తుతియింపుచుఁ గృతాంజలి పుటుండై యున్న యవసరంబున 184

తే గీ ఆతనిచే నిట్లు సంస్తుతుఁ డగుచు ని గి
ఘనకృపాదృష్టి వీక్షింపఁగా వరుండు
తన్మహాజ్ఞానవంతుఁడై తత్ప్రభావ
మహిమము నెఱింగి వాక్య మిట్లనుచుఁ బల్కె 185

చ గురుతర యోగివర్య ! రతీప దయార్ద్రి మదీయ దేశికా
యరుతర వేదసారమున నుత్తమమల్ పఠదంబులన్ భవ
ద్విరచిత నర్పశీంధములు విస్తృతి గాంచఁగ నాకుఁ జెప్పి పెం
పరయఁగఁ దెల్పుమీ పదపదార్థములందుఁ గల్గు భావముల్ 186

మ అని ప్రార్థించిన వా పరాంకుశుల భవ్యప్రీతిచే నాతనిం
గని శిష్యోత్తమ నీవు గోరినది పుష్కంగా మహాగోప్యమై
యెనయుం దానటులైనఁ జెప్పెదను నీ కేకాగచిత్తుండవై
విను మారీతి యథాక్రమంబున వ్యాఖ్యావిర్భూతిగాఁ దెల్పెదన్ 187

## శఠకోపముని మధురకవి ననుగ్రహించుట

సీ. అని యిట్లు పరతత్త్వ మనువదుర్వ్యూహముల్
    విను సనాతనముల విభవములను
నంతర వంతర్యామి యర్చావతారంబులను బ
    రములు పర్యాయ విగ్రహము లగుట
నిల శ్రుతి స్మృతి పురాణేతిహాసాగమ
    ములు నన్నిటను [1]నివి దెలుపుచుండు
నతిశయస్ఫూర్తిగా సత్కృతకృత ప్రబం
    ధము లట్లు ప్రతిపాదనము నొనర్చు

ఆ.వె. ననుచు నీ రహస్య మంతయు శఠకోప
మునివరుండు ప్రేమమున పవిత్ర
రముగ శిష్యుగూర్చి విమలతరోక్తిని
యాదరత ననుగ్రహంబు చేసె 138

తే.గీ. అట మధురకవి యనుపేర నమరు మౌని
యతని పదపంకజములందు నతి యొనర్చి
తద్దయు నమస్త్రములగు నర్థంబు లొంది
యా గురుని వాశ్రయించె నెంతయుఁ దగుచు 139

చ. సతతము భక్తి కీర్తనము సల్పుచు నా గురువర్యు నందు నా
యతమతిఁ జేర్చి తన్మతమునందు వసింపుచుఁ గాలమున్ సమా
ధ్యుత గతిగా నిమేషము సరిం గనుగొంచు స్వకర్మ భక్తు లా
[2]స్నత మగు జ్ఞానమున్ మొద లనందగు వీఁ దొలంగి విష్ణలోన 140

---

1 పా. నివి 2 పా. ప్నతియగు

## భగవంతుండు ప్రసన్నుం డగుచు శఠకోప మునికి వకుళమాలిక నొసంగుట

వ. ఏకాంతమానసుం డగుచు నారాయణుండే పరమం బగు దైవంబును
నతండే పరమగతియు నతండే పరమం బగు జ్ఞానంబును నతండే
యుత్తమం బగు ధనంబును నతండే పరమ యగు విద్యయు నతండే పరా
యణుండును నతండే సర్వార్థంబును నని విశ్వాసంబువలన సంధింపుచు
నతని యందాత్మభరంబు నునిచి యహర్నిశంబు నంద యధివసింప
మహాయోగియగు నప్పరాంకుశుం డతనిచేత శుశ్రూష సేయంబడిన
వాండగుచు సంతోషంబుగా భగవంతుం డొసంగిన వకుళమాలికచేత
భూషితుం డగుట యది మొదలుకొని లోకంబులయందు వకుళాభరణాహ్వా
యుం డగుచు దృఢయోగ సమాధిం జేసి శ్రీకాంతాంఘ్రికమలధ్యాన సుధా
రసం బనవరతం బనుభవింపుచు నతిం డనుం గృతకృత్యుం గావింపుచుం
దింత్రిణీమహీరుహచ్ఛాయ యందుండె నిలయందుం దత్కృత దివ్యప్రబం
ధంబు లేవరులు పఠియింతురు వారు సురదుర్లభంబును సత్యంబును బర
మంబును నగు పదంబుం బ్రాపింతురు కలుషనాశనంబగు నీ శఠకోప
చరితం బెవ్వండు భక్తిం జేసి వినుచుం బఠియింపుచు వ్రాయుచు శ్లాఘ
నంబు గావించెనేని వాండు పుత్రపౌత్ర సంపదలను నిరామయం బగు
నాయువుం గాంచి యంతంబున దివ్యంబును బరంబును వైష్ణవంబును
నగు నద్దిపదంబు నొందునని మహాయోగి మహాత్మ్యంబును శ్రీమంతం
బును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి పంచదశాధ్యాయంబు
భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పిన నతండు 141

మ. సురలోకార్చిత పాద పద్మయుగ రక్షోనాయక ధ్వాంత భా
స్కర మౌని ప్రకరాత్మ సీరజదళాగ్రజ్యోతి వ్యాద్యాస సం
సరణాంభోనిధి తారణ ప్లవ రమా సర్వంసహాధీశ ని
ర్జర గంగాజని కర్తృకాంఘ్రి ఘనవక్షా వక్షిత ప్రాభవా 142

క సకలాగమాంత సంగా
వకుళాధరణాంతరంగ వాసశుభాంగా
యశుదం కరుణాపాంగా
ప్రకటాసుర మదవిభంగ [1]పతగ తురంగా 143

మాలి॥ వరకమల విఫాలా నవ్యకస్తూరిఫాలా
సరసగుణ విశాలా దారుసౌవర్ణచేలా
సురపుర వరశీలా సుందరీ చిత్రలోలా
విలసిత ఘనలీలా వేణుగోపాలబాలా 144

గద్య [1]ఇది శ్రీరాజ గోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణాంబ్ధి పాండిత్య ధురా
సవరతాపనీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ నవ్యనమర్గతాకృతాకృత
పటహ దణర్ధణారావ విపరీత పరమ్ప్రకియా ధిల్లికాధీశ దుందుభిధ్వాన
కోలాహల హనూమద్ధ్వజాంక కనకదండికాకృతి హీరకంకణకృత సందీపిత
ప్రతాపకీర్తిప్రభావ కోశలవంశకలశపారావార రాకాసుధాకర
సౌందర్య జిత సుమ సాయక మహీపాలనాయక ప్రణీతంబైన శ్రీ
మహాభార్గవ పురాణంబునందు భక్తిసారుంగూర్చి శ్రీకృష్ణుండు భక్తిం
జేసి శుశ్రూషగావింపుటయు శ్రీకృష్ణునెడ దోశరాజవమతి గావింపుటయు
శ్రీకృష్ణుండు గురుసమేతుండగుచు సకలంబై పతోభిష్టంబుగా దేశాంతరంబు
నునుటయు సదోత్ర మహిపాల ప్రార్థనంబునంజేసి శ్రీకృష్ణ భక్తిసారులు
సకలదేవతా సంఘంబుతో వెండియు స్వధామంబు ప్రవేశించుటయు భక్తి
సారుండు భగవత్ప్రార్థనంబు గావించుటయు విప్రుం డద్వరంబున భక్తి
సారు న్నిగ్రహంబు గావించుటయు విప్రుం గోపంబున భగవద్దర్శనంబును

1 మా ఇతి

భక్తిసారానుగ్రహంబును గారి నాథనాయకీ భవంబును భగవదాజ్ఞం జేసి వారియందు విష్వక్సేనాంశజాతుండైన శఠకోపముని సముద్భవించుటయు భగవత్ప్రసాద ప్రభావంబునం జేసి పరాంకుశమునీంద్రుండు దివ్య ప్రబంధంబుం జేసి హరి యర్చావతార విగ్రహంబుల దాక్షింపుటయుం గ్రమ్మఱ వాని నిజధామమ్ముం బనుపుటయు శఠకోపుండు చింతామహీరుహ కోటరావాసుం డగుటయు మధురకవి జననంబును దపోవిఘ్నం బగు మధురకవి పరాంకుశ సందర్శనార్థం బరుగుదెంచుటయుం బరాంకుశులు మధురకవి కనుగ్రహం బొసంగుటయు భగవంతుండు ప్రసన్నుం డగుచుం బరాంకుశులకు వకుళమాలిక నొసంగుటయు శఠకోపమునీంద్రులు మధురకవి సహితులగుచు నిజనివాసంబున నుండుటయు ననెడు నేకకథలుం గల తృతీయాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## చతుర్థాశ్వాసము

క. శ్రీధర రథాంగధర గం
గాధర నుత పాదవేటు ధరాధర ధా
శ్రీధర శ్రీ వాగిన ధా
శ్రీధర తిరుతిరం సురపురి గోపాలా 1

వ. అవధరింపుము సకలగుణనికర ప్రశస్తధురంధరయం దగు సభయందు నారా
యణున కిట్లనియె 2

తే.గీ. అనఘ నారాయణ మునీంద్ర యఖిలలోక
పూజిత మహాత్మ శరకోప మునివరేణ్యుల
దరితమంతయు వాసిర సాదరమున
వినఁగ నయ్యెను వన్నెల విస్తరింపు

చ. అతులము విష్ణుభక్తచరితామృతమున్ మధురంబు దివ్యమా
ధృతి భవదాస్యదుర్గ బంధిం బనియించిన దానిఁ గౌతమ
స్థితి శ్రవణాంజలిం గొనియుఁ దృప్తి నొసంగక యున్నవాఁడ నం
చిత దయతోడ నాకు మతిఁ జెప్పఁగదే హరిభక్త సత్కథల్ 4

క. అని నరుడు పల్కె దారా
[1]యణ మౌనిఁ బ్రశంసచేసి యతనికి మఱి యా
ర్లిను ఏ వాక్యము సత్యం
బనఘా తుష్టింద నయితి సద్వాక్యమునన్ 6

సీ. శ్రోతంబును శ్రోత చేత ప్రియంబులు
ధీర సంసార ఖేదమములు
మోక్షకాంక్షప్రాప్యములు పావనమ్ములు
పరమ బ్రహ్మానంద కరముత్రైన
హరిశ్చంద్ర చరితంబు లాలించి యెవ్వఁడు
తుష్టి నొందఁడు పలాదుండు దక్క
యోగనిష్ఠాపరు లర్షిఁ గాసారాది
మునివరుల్ హరిశ్చంద్ర నుతిఁ జనుం

తే.గీ. సేవచేతను మును కుంభేశ్వరుండు
మనుజపతియయ్యె నట పరమంబు నైన
పదముఁ బ్రాపించె నమ్మహాత్ముని చరిత
మేను వచియింతు వినుమని యిట్టు లనియె 6

## కుంభేశ్వర ప్రాదుర్భావము

క. కేరళ దేశంబులలోఁ
బారిత సంపదల కోంపురమను విదితం
బౌ రాజధాని వెలయున్
ధారుణిఁ ద్రైలోక్య విశ్రుతస్థితి యగుచున్ 7

---

1 వ. ప్రాసము 2 మూ. పు

తే.గీ. ఆ పురవరంబు బాలించ నధిక యశుఁడు
నత్కృతిసుఁడు దుర్గక్ష
(గ్రంథపాతము) 8

ఉ.

హమ్మీల్ మొగిడ్చి నృపకేసరి వల్కె దయానిధుల్ క్షమా
సారులు మీరు మిమ్ము బ్రోఁగఁజాలని మంత్రి కృతాపరాధమున్
జేరి క్షమింపరే శరణు జెందితి దాసుఁడ నంచు వేడినన్ 9

క. వారలు పరసుర మున్లై
కారుణ్యమూర్తి పతివిఁగని నిమ్నలోచన్
శ్రీ రమణుం డని కిరిన
తారూధి నొసంగి రా ధరాధిపుఁ దంతన్ 10

గీ. ద్వార పాలురఁ గాంచి రోషారుణాక్షు
లగుచు మున్నేమిఁ జెప్పిరి యట్టి భాగ
వత విరోధంబుఁ జేసిన పాపాత్ము
లక్షమతులగు మీరు దండార్హు లనుచు 11

సీ. ఆ దురాత్ములఁ దీక్ష్ణమైన దండన సేయ
నార్తి యొనర్చిన నతిలంఘూత
కారుణ్యపరులు భాగవతులు ప్రార్థింప
నా ప్రార్థనము శిరసావహించి

ద్వారపాలకుల భూపవర్యుఁడు విడిపించి
యంతఃపురంబున కరిగి యందు
నా వైష్ణవులను సింహాసనాసీనులఁ
గావించి తత్పాదకమలములను

ఆ. గనుఁ బాత్రముం గుంభస్థితిఁ జేర్చి యు
త్పాదకముల హస్తయుగము చేతఁ
గడిగి పావనంబు గల్మషాపహము
బరమమైన తీర్థవారి గ్రోలి 12

వ. కళత్ర పుత్ర మిత్ర బంధు భృత్యులను గ్రహించి [1]తచ్ఛేషంబున శిరంబున మూర్ధనం బొనర్చి గంధ పుష్పాదుల బూజించి వస్త్రాభరణ ధనాదుల సంతుష్టిం గావించి కులీనుండు వారితోఁ గూడ నంతఃపురంబు వెడలి దేవసభానమానంబగు నాస్థానంబుఁ బ్రవేశించి యలంకృతంబులగు భద్రపీఠంబుల వారలఁ బసింప నుండి తదీయ ముఖారవింద నిష్యంద గోవింద కథామృత పానంబున నానంద భరితుండై యుండె నని మహా యోగి మాహాత్మ్యంబును బ్రేమకరంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి షోడశాధ్యాయంబు శ్రుతపాపహరంబగు నారాయణుండు వసుసుతుఁ జెప్పె వెండియు నిట్లనియె 13

క. ఈ విధి భూవిభుఁ డుండిన
చో వాని యమాత్యు లర్థ సూచకులు కళా
కోవిదులు వచ్చి సమయము
భావింపుచున్న వారి భావ మరయుచున్ 14

---

1 మూ. తచ్ఛే

తే. గీ. చెప్ప వలసిన మది యున్నఁ జెప్పఁ దగిన
మంత్రు లిట్టని రా రాజమౌళితోడ
నీవు సర్వజ్ఞుఁడవు మహనీయమతివి
నీవ రెండవ హరివి ధరావరేణ్య 15

సీ. అవిగంబు సేయునట్టి మహావైష్ణ
వార్చన మతిగా మహాత్ముఁ డగుచుఁ
దగు మహామంత్రులకుఁ గర్తవ్యంబు మంత్రి కు
పాయంబు ధర్మ మౌనైన రాజ
ప్రజలఁ బ్రోచుట శిష్టరక్షణంబును దుష్ట
శిక్షణంబు నెఱింగి చేయవలయుఁ
[1]చతురుపాయంబులు [2]త్రిశక్తియును [3]షడ్గు
ణంబులు [4]పంచాంగ నయము దెలిసి

తే. గీ. యరసి [5]సప్తాంగ రక్షా సమర్థుఁ డగుచు
యశము దిక్కుల నెఱపి [6]భోగాష్టకంబు
ననుభవింపుచుఁ బోషించి యాశ్రితులను
వర్ణ ధర్మాళిఁ బాలింప వలయు జగతి 16

---

1 సామ దాన భేద దండములు
2 ఉత్సాహ ప్రభుత్వ మంత్రములు
3 సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ ఆశ్రయములు
4 ఉపాయ సహాయ దేశకాల విభజన ప్రతిక్రియా కార్యసిద్ధులు
5 స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలములు
6 గృహ శయ్యా వస్త్రాభరణ స్త్రీ పుష్పగంధ తాంబూలములు

యందఱు విద్యావగతులు హితంబును బ్రత్యక్ష సౌఖ్యప్రదంబు
నుత్తమంబును నగు రాజధర్మంబు బోధింప నెఱుంగరని చెప్పిన 20

చం. అన విని మంత్రివాక్యములు హాసముఖుండయి ధారుణీశుఁ డి
ట్లను నిల వైష్ణవోత్తములె యెవరేని హితోపదేశ మిం
పున నొనరింప వారు హితబోధనుఁడన్ శుభదుల్ విముక్తిదుల్
ఘను లనిపల్కి మంత్రులకుఁ గార్యము తేర్పరఁ జెప్పి యంతటన్ 21

మ. ధరణీనాయకమహా వైష్ణవులతోఁ దత్వార్థసంలగ్న హృ
త్పరసీజం బగుచున్ వసింప నధిపుల్ తద్వైష్ణవ శ్రీతతిన్
నరనాథాగ్రణి యా విశేష మనువందం జేయఁ బాపాత్ములై
యరయంజొచ్చిరి పెక్కుపాయములు ధర్మద్వేషణాసక్తులై 22

సీ. అంతట నొక్కనాఁ డవనీశ్వరుఁడు మహా
తేజుఁడు సుముఖుండు రాజరాజ
పరిరక్షితాంచవమర్త్యుఁడు మహాభాగ
వరమహారక్తాంఘ్రి పాలితయుఁడు
దర్పుఁడు విస్తీర్ణ ఫాలభాగుండు వి
శాలవక్షుఁడు సుజ సుమంచి
తా యుగళుండు దీర్ఘాయత బాహాప్రకుఁ
దక్షగుండు మహాభుజాండు

తే.గీ. సుభ్రూవు సునాసికుఁడు బృహచ్ఛ్రోణి కటిత
టుఁడు బింబాధరుండును గండమండ
లుండు గంభీరనాభిపుటుండు మంద
హాస హసితం రుచిరుంతరాంచితుండు 23

తే.గీ. దివ్యమాల్యాంబరధరుండు దివ్యచంద
నానులేపియుఁ గేయూరహారమకుట
కంకణాంగద కుండలక రభూష
ణాంఘ్రిమంజీర భూషితుఁడై విభుండు 24

కం. అతులమణి స్తంభ సమం
చింతామణిమంటపము నందు సింహాసన సం
గతుఁడును నృపమండల సే
వితుఁడును నయవేది మంత్రివితతివృతుండై 25

కం. హితులు పురోహితులు కవి
ప్రతతియుఁ బౌరాళికులును బరివేష్టింపన్
క్షితితలనాథుఁడు తారా
న్వితుఁడగు చంద్రుఁడుఁ బోలి వెలసిల్లె సభన్ 26

వ. ఆయ్యవసరంబున భాగవతశ్రేష్ఠులుం గృపానిధులును ననన్యదేవతాభక్తి విశిష్టులును జగత్పవిత్రులును సర్వేశ్వరైకశరణ్యనిరతాశయులును శ్రీమదష్టాక్షరీ మంత్రానుష్ఠాన నిష్ఠాగరిష్ఠులును ద్రావిడామ్నాయ బోధకులును శమాదిగుణసంపన్నులును జీవాత్మ పరమాత్మలయందు శేషశేషిత్వ తత్త్వజ్ఞులును దత్త్వత్రయ పరిజ్ఞాతలును స్థిరచిత్తులును దృఢవ్రతులును నగు కొందఱు వైష్ణవ శేఖర నిరీక్షించి కులశేఖరుండు విస్మయంబున సఁబ్రీత్యతిశయప్రణామస్తుతి పూజనంబుల యథాన్యాయంబున నొనర్చి వారిం వలని గోష్ఠివలనఁ దత్త్వరహస్యంబు తెలియంగుచు హరిగుణశ్రవణాం. యామద్యయంబు పరమాహ్లాదనిర్భరుండై యుండి స్నానంబొనర్చు కొఱకు నిజభూషణంబుల సింహాసనంబునందు నిడి వెండియు హరికథాసక్తచిత్తుండై యమ్మహాత్ములవలన నుత్తమంబగు గోవిందచరితామృతాస్వాదంబుఁ జేయుచు సల్లాపకుతూహలుండై యుండె నంతట వైష్ణవుంకుఁ బ్రియమిల్లి మఁగాని యదృష్టాతుండై యమ్మహారాజశుద్ధాంతంబుఁ బ్రవేశించెనని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును

నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి సప్తదశాధ్యాయంబు భక్త
పరాయణులుండగు నారాయణుండు నరునకుం జెప్పె నందియు నిట్లనియె 27

## రాజమంత్రులు వైష్ణవులయెడ చౌర్యంబు కల్పించుట

ఉ. అంతట మంత్రులందఱు సభాంతరసీమకు వచ్చి యందు భూ
కాంతుని భూషణంబు లటు గన్గొని యా నృపభూషణాళి గే
హాంతరమందు దాఁచి యపుడా మహిభర్తకు వైష్ణవాళి పై
వింతయు ద్వేషముం గలుగ నేర్పడఁ జేయుద మందు దుర్మతిన్ 28

సీ. అన్యోన్యముగ వార లాలోచనము సేసి
నరనాయకుని భూషణములు దాఁచి
యమగృహంబుఁ జేరఁగ ధరణీశ్వరుం డంత
స్నాతుఁడై మంత్రరాజము జపించి
జానకీ లక్ష్మణ సహితుని బ్రహ్మాది
సేవితు రాము నర్చించి యర్ఘ్య
పాద్యాది విధులచేఁ బ్రణమిల్లి సర్వవే
దాంతంబులను స్తుతు లాచరించి

ఆ. ముంద హరి నివేదితాన్నంబు వ్రతసో
పేతముగ భుజించి ప్రీతితోడ
సభకుఁ బోవఁదలఁచి యవసరి పరిచార
కులతోడఁ బలికె సంభ్రమమున 29

తే.గీ. నాదు సింహాసనమున భూషణము లేదు
వెత్తి కొల్పుడిఁ దెమ్మని విభుఁడు పలుక
వేగ పరిచారకులు సభ కేఁగి యచట
గాంచి లేకున్న వెదకి మరలి వచ్చి 30

1 మా. ప్రాతమ్ము

క. జగతీశుఁ గూర్చి దివ్యము
లగు భూషణములు తదవనియందుం జేసం
దాగిఁ దెలిపిన వారల పలు
కగతిని మతి ఎరి నరేంద్రుఁ డతికుపితుండై 81

క. పుర రక్షకులను మంత్రుల
నరవిని రావించి రుచి నొసంగుచు నభయం
బిరమైన నాదు సొమ్ములు
పొరిఁ దస్కరు లెవరు గొంచుఁబోయిరి పగటన్ 82

తే.గీ. ఒప్పుగా మీరు కావలియున్నచోట
దొంగతన మేల గలుగు నిందుల మరియ
భూషణంబుల వేగ నిప్పుడె యొసంగ
కున్నఁ బ్రాణాంతదండ మే నొగి నొసర్తు 83

## కుంభోదరుఁడు శపథము చేయుట

క. అని యిట్లు నృపతి పలికిన
విని యందఱు గంపమొంది భీతిని దీనా
ననులై యభిభాషింపుట
కును శక్తులు గానిచో నతుం డితలిలన్ 84

సీ. అంత మంత్రులు నిల్చి యధిపతి ప్రేమం బ్రా
ణాంజలులై ప్రొక్కి యంద లనిరి
నృప భవదాజ్ఞచే నింత కాలము దొర
నాము మొకప్పుడైనను సమస్త

ధాత్రీ తలంబునం దసురదు గాన పి
    రందఱు భయగతులగుచు వారి
నందుచున్నారు చోరాన్వేషణం బగు
    కర్మ మిం దెట్టుం గలుపవచ్చు

తే.గీ. నిలను రాజు లనేకులు గలరు రాజ
గృహములు గల విపుడు నివారింపఁబడిన
ద్వారములు నయ్యె నిట్లు పీవంటి వారు
గలుగనేరరు పరికింపఁగా నిజముగ 85

తే.గీ. శ్వేత మృత్స్నాల్ల ధారణ స్థితిని జేసి
తావకీన నికేతనద్వారమునను
యరయు శిటువంటివారైన నరుగుదెంతు
రెందు వారింపఁబడక ధాత్రీతలంబ 86

క. కన పీ చిత్తం బెట్టుం
డిన [1]సుందరి భూమిపాల యక్కముగ గలం
పను మా మది నైష్షపుం
దును సందేహంబు వారమ మానస్థితిగన్ 87

క. వారలు గాకను పొమ్ములు
వేరొకరు గ్రహింప రథవ పిను మిన్నంగిన్
వారింబడి శోధించియు
మీరే గ్రహియింప వలయు మీధానములన్ 88

---

1 మూ సుండిని

మ అని దుర్వాక్యము దుష్టచిత్తు లతిపాపాయత్తులౌ మంత్రు లా
డిన వారించి నృపాలశేఖరుఁ డకుంఠీభూత చేతస్కుఁడౌ
చును గర్తవ్యము గేం మానసికౌని విద్విట్ సంస్కృతిం జేయుచున్
గన నెట్లౌ ఫలమైన నీ ముఖము ప్రత్యక్షంబుగా నేనిటన్ 39

క నిలువవలదు నా సన్నిధి
ఖలులారా పొండు మీరు కమలాక్షుని భ
క్తులయెడ నింద గలుపు వా
రలతో భాషింపరాదు రహి నెవ్వేళన్ 40

గీ వారిఁ జూచినఁ బాపంబు వచ్చు ననుచు
నవనిపతుఁడు పరాఙ్ముఖుఁ డయ్యె నంతఁ
గుపితులై యున్న యతనిఁ గన్గొనియు మంత్రు
లప్పు డిట్లని రవని సాష్టాంగ [1]మెరఁగి 41

మ తగుదండార్హులఁ దాతతాయిరతులన్ దండింపు మర్యాన్ యథో
క్త గతిన్ భూవర యంచు మంత్రు లన నాతం డి[2]ట్లనున్ వెఱ్ఱి యెం
తగ శ్రీవైష్ణవులందుఁ గల్గనగు నిందం దాపి యా మీఁద మం
త్రిగణంబుం గడు తీక్ష్ణదండమున దండింతున్ ప్రసిద్ధంబుగాన్ 42

తే గీ అటులఁ గాకున్న వైష్ణవు లందు భక్తి
గలిగి నృపుఁ డపరాధము గలుగునట్టి
మంత్రులను దండనమొనర్చె మహి నెఱింగఁ
జాలనిందింపరే నన్ను సజ్జనులు 43

---

1 మూ మెరిగి 2 మూ డిట్టుంన్

సీ అని మనంబున నిశ్చయమ్ముఁ జేసి నృపతి యి
ట్లని పల్కె నా మంత్రి జనములార
వదరి నే యనుమందు నప్పాతకము హరి
స్మరణచే నణఁగును గౌరినింద
చేసిన పాపంబు శ్రీ వైష్ణవస్తుతి
నలుపఁగ నణఁగు వైష్ణవుల నింద
నెప్పాపము ఘటించు నప్పాప మేమిట
నైనఁ బోవదని మహర్షు లనిరి

తే గీ యట్లు గావున మీచేత నాచరింప
నైన మహనీయ విష్ణుభక్తాపరాధ
మునఁగలుష మొందు మిమ్ము పావనులఁ జేయ
[1]శతశిఖలానే యే మహాదండమైన, 44

తే గీ అయిన వైష్ణవులందుఁ జౌర్యంబు లేమిఁ
బ్రకట మొనరించి దండింతుఁ బైన మిమ్ము
భువిఁ బ్రసిద్ధంబుగాఁగ నిపుడు యథార్థ
మైన మిమ్ము దండింపక సలుపరాఁద 45

వ హరిభక్తియుక్తులును మహాత్ములును ధర్మసంపదాధారులును పరస్త్రీ పర
ధన పరాఙ్ముఖులును త్రిలోక పవిత్రచరిత్రులును గామార్థానపేక్షితులును
సర్వలోకమిత్రులును క్రోధ లోభాది శత్రులును జ్ఞాన వైరాగ్య
ప్రభావులును నగు నీ వైష్ణవులయందు దుష్టబుద్ధులగు మీ చేత వారి

---

1 ఎహా శతి

పితంబగు చోరత్వం బేను పరిహరించువాఁడనై నిశ్చింతంబగు నంతరంగం
బుతోఁ బ్రమాణం బొనర్చెద స్వామికార్యంబు కృత్యమునకుఁ గర్తవ్యం
బగుఁగదా యని పలికి సవిషంబును ఘోరంబునగు సర్పంబును స్వర్ణ
ఘటికం జొచ్చి ఘటాంతరంబునందు నిడి యప్పు డమ్మహీవల్లభుండు
సంపూర్ణహృదయుండగుచు [1]సుహృత్తులు రాజబంధువర్గంబులును బురో
హితులును సమస్త పౌరజనంబులను రావించి యిట్లనియె 46

తే.గీ. అఖిల జనులార నాదు వాక్యంబు వినుఁడు
సత్య మేను వచించెద శౌరి భక్తు
లలర లోకంబులందు నొకప్పుడేని
చౌర్య కర్మంబుఁ జేయ రుత్సాహ మగుట 47

క. క్షమ సత్యము సత్యము స
త్యము సత్యంబిదియె సంశయము లేదని య
ద్విమలాత్ముఁడు కులశేఖరుఁ
డమం మతిం జూచు వారి కందఱు కనుచున్ 48

వ. మహోఫణి ఫణా వ్యాప్తయుఁ గుంభాంతర్గత సంస్థితయునగు స్వర్ణ ఘటి
కరంబునంగొని తత్సర్పంబెత్తిన వాఁడయ్యె నిట్లమ్మహోరాజు గావించు
కర్మంబు నుద్దేశించి సకల విద్వజ్జనసంఘం బనుదెంచి యవి నమ్మహాత్ము
నవలోకించి తన్మహోద్భుత కృత్యంబుఁ బ్రశంసింపుచుఁ బుమంబులు
విస్మయంబు నొంది దుందుభులు మొరయింపుచుఁ బుష్ప వర్షంబులు
గురియింప నప్సరోగణంబు నృత్యంబు లాడెనని మహాయోగి మాహా

---

1 మహా స

త్కృష్ణంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో త్తర ఖండంబు నందలి యష్టాదశాధ్యాయంబు భక్త పరాయణంబగు నారాయణుండు నరునకుం జెప్పి మఱియు నిట్లనియె 49

ఉ. అంత సమస్తదేవ నికరార్చితుఁడున్ సకలేశ్వరుండు శ్రీ
కాంతుఁ డనాది పూరుషుఁడు గంధవహస్తుతుఁ డాశ్రిత ప్రియ
స్వాంతుఁడు రంగభర్త కరుణాంబుధి శ్రీ రఘురామమూర్తితో
నెంతయు దృష్టిగోచరత నింపెసలారె నృపాలు వెంగటన్ 60

సీ. భానుకోటిప్రభా భాసమానుని హరి
స్మృతిమేచకాంగు ననంతవీర్యుఁ
గరుణాపయోధి రాకాచంద్ర మండల
నలిన విరాజితానను మహాత్ము
హస్తి హస్తాయత హస్తుఁ దటిత్ప్రభ
వసను నపార వైభవు ప్రఫుల్ల
సితపద్మ పత్ర విస్తీర్ణాంత లోచను
నర్క చంద్ర విశాల [1]ఫాల భాగు

తే.గీ. ముదిత బాలేందురేఖా సమోర్ధ్వపుండ్ర
రమ్యమాణిక్య మకుటాంతరత్న నీల
కర్ణకుండల మండిత ఘనకపోలు
([2]విశద నీరేజసంస్పర్థి విపులనయను ) 61

---

1 మూ ఫాలు
2 మూ లేదు

సీ. వింశతిస్మరచాప విభ్రమభ్రూయుగుఁ
చంపక నాసు[1] నిశ్శ్వసన వలిత
గంధసమ్మోద సంగత చంచరీకు మ
హా హసుఁ బీనోన్నతాంసు దీర్ఘ
బర్హుని శ్రీవత్స కౌస్తుభ హారవ
ద్గురు మహోన్నతవక్షు గూఢ జత్రు
వరుణ ప్రవాళబింబాధర మందసుం
దరహాస స్ఫురిత కుందదంతపంక్తి

తే.గీ. కలిత ప్రహస్వశిరోజాంత కంబుకంఠు
నమిత హేమాండ భువనోదరాశ్రితాఖ్యు
యె స్ఫురదయభూత నాభిపయోజా నధిక
బహుమతి విభాసితోదర బంధనాభు 62

తే.గీ. అనమసంధ్యాభ్ర సమహేమ వసనలసిత
కాంచికాంచిత కటి భాగు ఘన సుసూక్ష్మ
కలిత మధ్యుని రోమరేఖావిభాసు
సురనదీరమ్య సైకత శ్రోణియుగళు 63

కుంతీధరునకు నారాయణుండు ప్రసన్నుఁ డగుట

క. స్మరలీలావన మధ్య
స్థిర రంభా సన్నిభోరు దీపితుని రమా
కరకమల రక్తరుచి భా
స్వరమణి కృత సురసేవ్యాంఘ్రి యుగళుఁ 64

---

1 మా. నిశ్వసన 2 ము. 'స' లేదు

ఉ సకల జగచ్ఛరణ్యుని విశాల శరద్వికచాబ్జ పాదయు
గ్మకుని మణిస్ఫురన్మకుట కాంతి విరాజిత సర్వదిక్తటున్
బ్రకట శరాసనాగ్రయుత బాణకరున్ గలితాస్య హస్త సా
యకు నిజపృష్ఠభాగగత హాటక రత్న నిషంగయుగ్మునిన్ 56

సీ వైజయంతి దివ్యవనమాలికోజ్జ్వల
మణికంకణాది భూషణ శుభాంగుఁ
గార్పూరకస్తూరికాగంధ చర్చితుఁ
గందర్ప శతకోటి సుందరాంగు
శంపాలతాభంగి జగదాకృతియు జగ
న్మాత దయాలోకనముఁజేసి
సకల భూతవ్రాత సంరక్షణముఁజేయ
జనకజతో నుండు సదయ హృదయు

ఆ వె వ్రగణమ్ము దాస్య మమపొందుచు సమాహి
తుఁ డగుచుండు లక్ష్మణుఁడు సపర్య
ననుదినంబు సలుపఁ దనరువిభుని లోక
పాలకుని మహానుభావు నమలు 58

చ అమృత పయోధి ఫేన రుచిత్రై మణిదండము చేత మించు బ్రో
ద్యమ మగు చామరంబున సమంచిత పూర్ణ సుధాంశు మండలో
పమ ధవళాతపత్రమున భాసిలు ధన్యు శచీపతేంద్ర వం
ద్యు మహిత చర్యు భక్తజనపోషకు నిస్తుల ముక్తిదాయకున్ 67

తే. గీ. అక్షయు ననంతు నవ్యక్తు నప్రమేయు
నఖిల జగదాకృతి పరేశు నాద్యు విశ్వ
సంభవ స్థితి లయ కారు సకలభర్తఁ
బరమఁ బరుషోత్తమునిఁ బరాత్పరుని విభుని 58

క. ఈ విధమున వెలుఁగొందెడు
నా వరదుని నవ్యయాత్ముఁడగు రామనృ నా
భూవరుఁడు గాంచి తా న
ద్భావంబై శిరసువేరఁ బ్రణమతిఁ జేసెన్ 59

తే. గీ. అతని సందర్శనమువల్ల నధిక సుఖ త
లాప్తియై పులకాంచితుఁడై ప్రహర్ష
బాష్ప చకితాక్షుఁడైన యప్పరమ భాగ
[1]వత వతంసుని రామభూవరుఁడు గాంచి 60

వ. తనకు దండ ప్రణామంబు గావించిన మహీమండలాఖండలు నెత్తికొని
కౌఁగిలించి కృపాకలన సహిత మధుర భణితి నిట్లనియె 61

### కులశేఖరుఁడు నారాయణుని స్తుతించుట

సీ. వైష్ణవోత్తంస భూవరశేఖరత్న క
ల్యాణగుణాఢ్య మహానుభావ
నాభక్తవరుఁడవు నాకంటె నధికులు
గాఁగ నెంచితి నదిగాన నేనుఁ

1 మూ. వతంసుని

క చరణ కమల సందార
స్ఫురితాళిం గహన విజయ భూరి విరాధా
సుర సంహారణ్యా నమ
ద్ధర దావానలం వినున్ వతుల్ సేతు మునిన్ 67

క కుహనా కురంగ రూపుని
మహిత భుజా శౌర్యధుర్యు మారీచుని దై
త్యు హరించిన నీ కోరిక
నహరహము, నుతించువాఁడ నతిశయ భక్తిన్ 68

క కని తిర్యగ్యోని జనిం
చిన పక్షి జటాయువునకుఁ జేకొని మోక్షం
బనుగొంద నిచ్చిన దయా
వన రాశికి నీకు మ్రొక్కువాఁడ మహాత్మా 69

తే.గీ. శబరి యనెడి తపస్విని సారభక్తి
స్వాదు ఫలములు గాఁజూచి సంగ్రహించి
యొసఁగిన భుజించి కరుణ నయ్యెడఁ బ్రోచి
నట్టి నీకు నమస్కార మాచరింతు 70

క లీలా విలోకనంబుం
[1]కోలిన్ వాలమ్ము వేసి యొక ప్రేటున నా
వాలిన్ నిర్మూలించిన
శ్రీలలితున కే నమస్కరించెద నీకున్ 71

---

1 మూ. కోలిన

క. అగ్రజు నిగ్రహ మొనరిచి
సుగ్రీవు ననుగ్రహించి సుందర రాజ్యా
నుగ్రహముఁ జేసిన కృపా
విగ్రహునకు నీకు నేను వినతి యొనర్తున్ 72

సీ. ముద్రాంకిత కపీంద్ర ముద్రికాభరణత్రిక
భద్రదాయక భక్త హృద్రదాత్మ
శరణార్థి లంకేశ శరణాభయ ప్రద
కరుణాభరణ దివ శరణ చరణ
యాదసాంబుధి బంధురాత మధ్యనిబద్ధ
సేతు విఖ్యాతి సంజాత మహిమ
లంకాపురీ కృతాలంకార హరణ ని
శ్శంకాచరిత సాహసాంక సమర

తే.గీ. సకలం దనుః దవానల । మున జలద
కుంభకర్ణాఖ్య మదకుంభి కుంభివైరి
భంజనోద్దండ రిపుభూతభంజన ప్ర
భంజన నమస్కరింతు నీ కంజలి గొని 73

క. కుంభిత దశకంఠ మహా
కుంభీరవ ఘోర ంఠ గణ దంభన సో
త్కంఠ శరధా[1]కృతిప యగు
కంఠేశు నుత నినుఁ గావింతు నతుల్ 74

---

1 పు ప్రతి పగు

క. హరవిధి శక్రముఖామర
చిర వినుత విభీషణాభిషేక ప్రసం
భరితానంద నిగుంభన
మతిమతి నీ కొలుతు నే నమస్కృతిఁ జేతున్ 75

క. నామాంకిత ముద్ర భాసిల
భూమీసుతతోడ నెక్కి పుష్పకమున స
త్ప్రామోదస్థితి వెలసిన
శ్రీమంతున కే నమస్కరింతును నీకున్ 76

సీ. సాకేతపురవాస జనమానసాంభోజ
తరుణార్క సౌఖ్యప్రదాననిపుణ
యసమాన దివ్య సింహాసనారూఢత
నిరవొందు సర్వలోకేశ్వరేశ
భరతాది నిజ సహోదర ధరిత చ్ఛత్ర
చామరాదిక పరిచ్ఛద విశేష
పవన నందన భానుతనయ[1] జాంబవదాది
రమణీయ సేవా విరాజమాన

తే.గీ. యఖిల రాజన్య నికరంబు లాశ్రయింపఁ
బరమ సామ్రాజ్య వైభవస్ఫురణ వెలయు
దేవతలు సన్నుతింపఁగఁ దేజరిల్లు
నీకు మ్రొక్కెదనయ్య లోకైకనాథ 77

1 మూ. సుగ్రీవాది

ఉత్సా: వందనంబు నీకు రాజవర్య జానకీవరా
వందనంబు నీకు భక్తవార సంతతాదరా
వందనంబు నీకు లోకవందితా కృపాకరా
వందనంబు నీకు రామభద్ర దేవ శ్రీకరా 78

చ: బ్రతుకును దేవతల్ వెదకి చూడ నగమ్యుఁడవైన నీవు ప్ర
స్తుతము మనుష్యమాత్రుఁడవు క్షుద్రుఁడవై తగువారు గోచర
స్థితిఁగనవైతి విప్పు డటుచేసి కృతార్థుఁడనైతి సత్కృపా
యతమతిఁ బ్రోవు నన్ను ధరరాగ్రణి శ్రీ రఘువంశశేఖరా 79

క: అని పల్కి నృపతి యారా
మ ననుగ్రహమునను దివ్యమును వేదాంతా
ర్థ నిరూఢ సంగ్రహంబును
దనరుఁ బ్రబంధంబు నపుడు దాఁ జేసె యోగిన్ 80

తే. గీ: దాని రాముని కర్పించి దద్విభుండు
భక్తిని గృతాంజలి యగుచుఁ బరమ మూర్తి
యైన యద్దేవుఁ గూర్చి యుదార వృత్తిఁ
బలికె సంతోష భరితుఁడై భవ్యమతిని 81

క: కరుణాకర దేవా నను
వర మడుగు మటంచు నీవు వచియింపుట నే
వర మేను గోరుదు సురే
శ్వర యంతయు మున్నె నా కొసంగుట కతనన్ 82

క. నీ యందలి సద్భక్తియుఁ
బాయక మీ భక్తులందుఁ బ్రాంచిత భక్తిన్
ధీయుక్తి నా కొసంగుము
శ్రీయుత కరుణాలవాల శ్రితజనపాలా 83

తే.గీ. ఇవ్వరము దక్కఁగ నితరం బేమి గోర
నీ సర్వేశ్వర యటంచు నిట్లు నృపతి
యెఱుఁగఁదో హరి సంతోష మావుఁదగుచు
నట్ల వరమిచ్చి నృపవర యనియె మఱియు 84

తే.గీ. ఖ్యాతి నీలాంగ జాతయౌ నీ తనూజ
నా కొసంగుము ధారుణీనాథ నీకు
నేను జామాత నయ్యెద నీవు నాకు
మామ వగుమని యా రంగధాముఁ డనిన 85

క. జనపతి యా హరి వాక్యము
విని నే ధన్యుండనైతి వెస నా జన్మం
బును గులము పవిత్రంబై
తనరారె మహాత్మ యని ముదంబు దలిర్పన్ 86

### నీలాంగజాతయగు కులశేఖర తనయను నారాయణుఁడు వివాహమాడుట

వ. అని ధరణీశ్వరుండు పురమంతయు సాంద్రసుగంధ దర్పనం
బున మణితోరణంబులను ముత్తెపు ముగ్గుల రత్నదీప ధా
మనములచే నలంకృతు లెనంగఁగ మంగళతూర్య ముఖ్య ని
స్వనములు భోరుకొల్పఁగ వివాహ విధుల్ సముహూర్తయుంతటన్ 87

సీ. సతికి మంగళ స్నానంబు గావించి
చారు దుకూల వస్త్రములు గట్టి
చెలువకుఁ గస్తూరి తిలకంబు గావించి
పవనజామోద గంధము లలంది
తరుణికి మణిహేమ తాటంక కంకణ
కంఠహారాద్యలంకారము లిడి
కలికికిఁ గన్నులఁ గాటుక ఘటియించి
చెలువంపుఁ బసుపున నలుఁగు పెట్టి

ఆ.వె. సకల సౌందర్యరసము సాక్షాత్కరించి
యా కుమారిక యయ్యె నా నింపుమీఱ
పరమ శోభనవతికి నా పద్మముఖికి
సఖులు శృంగార వైభవ మొనరించి 88

క. ఆదరమున నా నరపతి
వేదోక్త కృతాగ్ని హవన విధు లొనరంగా
నా దేవిని వైవాహిక
వేదికపై మునిచి దివ్య విభవము లమరన్ 89

క. ఆ రాజ కన్య నిచ్చెను
వారికి విధిపూర్వకముగ వైభవ కృతికిన్
శ్రీరంగపతికి భవ సుర
సిరుహ భవ ముఖ సురార్య సేవాదృతికిన్ 90

ఉ. అంతట రంగత్తురంగ విభవాంచితలీల మనోహరాంగి య
త్యంత విలాససంపదల యందము నందగు నవ్య ధారుణీ
కాంతుని పుత్రియై తగిన కన్యక ధన్యకలావళిని వ
[1]ల్లింతి వివాహమై శుభము లింపుగ నా రమణీ సమేతుఁడై 91

తే.గీ. ఆ నృపాలుండు మంగళాచార్యు సకల
భూరితర వస్తువు లొసంగి పూజసేయ
హరి ప్రవేశించి ప్రీతుఁడై సురలతోడఁ
బరమ మైనట్టి నిజ దివ్యభవనమునకు 92

సీ. అంత నా నృపమంత్రు లతి విస్మయావిష్ట
చేతస్కులై యా మహీతలేశు
నతుల ప్రభావంబు నారసి భూవరా
పరులెల్లఁ గైకొని వచ్చి యరిగి
ముందట నిడి భయంబున బ్రణామము చేసి
తమ యపరాధ మంతయును దెల్పి
యట కరజార్థులై యతియంబు వేడిన
నారాజు వారల కందఱకును

తే.గీ. దయ సభయ మిచ్చి రక్షించి తనతనూజు
ఘనఘను గుణవంతు బలవంతు వినయవంతు

---

1 మూ. ల్లెంత

రాజ్యమున నుండి తాను నిరంతరంబు
వెలయ వైష్ణవసేవఁ గావింపుచుండె ॥ 93

**కులశేఖరుఁడు రామాయణకథా శ్రవణంబునం జేసి**
**దశకంఠునిపైఁ గోపంబు వెట్టి లంకకుఁ జనుట**

వ. అనంతరం బమ్మహీకాంతుండు శ్రీమద్రామాయణ పారాయణుం డగుచు ననవరతంబు రామాయణ కథం గూర్చి మహాత్ముండగు రాఘవు సుఖ చర్యలయందు సుహృష్టుండును, దుఃఖ చర్యలయందు దుఃఖితుండును నగుచు రామునియందలి ప్రేమాతిరేకంబునఁ బరవశాంతఃకరణుం డగుచు నిర్విధంబున వసియించుచున్న రాజు నవలోకించి యటఁ బౌరాణికుం డిమ్మహానుభావుం డీ సీతాపహరణంబు సహింపఁడని చింతింపుచు మాయాసీతం గొనిపోయెనని యుగ్గడింపుచు నా వైష్ణవుం డుండె నంత నొక్కనాఁ డవ్విప్రప్రవర్యుండు గ్రామాంతరగతుం డగుట నతని పుత్రుం డనుత్తముండగు రామాయణంబుఁ జెప్పు నృపతి మనంబు గూర్చి దశకంధరుచేత నడువఁ బడని సీతాపహరణంబు నతనికి యథార్థంబుగ నెఱింగించిన [1]నారాజా భక్తి సంపూర్ణ హృదయుం డగుచు దాని విని ప్రత్యక్షంబు మాడ్కిఁ దెలిసి శోకరోష సమాకలితుం డగుచు మదీయజనని యగు జానకిన్ దుష్టాత్ముండెట్లు హరియించు నిప్పుడ యారక్కసు శిరంబులు కరవాల ధారం ద్రుంచి వైదేహిని పలికి ఖడ్గంబు గైకొని రవితురంగ సన్నిభంబగు తురంగరాజం బెక్కి లంకాభిముఖుఁడై పోవుచున్న యవసరంబున ॥ 94

---

1 వారాజా కుమారుండు

వ. మహీపాలా ! ని వియ్యుద్యమంబు వలన నరుగవలదని చెప్పి యాశ్రిత వత్సలుండగు సర్వేశ్వరుం డతనిఁ బుష్పకారూఢుం గావించి యవ్విమానంబుతోఁ గూడ నప్రాకృత జనాకీర్ణం[1]బగు వైకుంఠంబుఁ జేరె మహానుభావుండును హరిప్రియుండును నగు విక్రమ రాజు చరిత్రం బెవ్వ డనయంబు వినుచుం జదివించుచు లిఖియించుచు నుండువాఁ డైహికాముష్మిక సుఖంబులను [2]గాంచునని శ్రీమంతంబును నగు భార్గవపురాణోత్తర ఖండంబు నందలి యేకోన వింశాధ్యాయం బు భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుఁ జెప్పి వెండియు నిట్లనియె 88

ఉ. నర ! విను మేను జెప్పెద జనస్తుతమై తగి సర్వదేవతా
త్కర పరిరక్షణార్థముగ ధారుణిలో నవతీర్ణయయ్యె సా
దరమతి లక్ష్మి భక్తజన దైన్యమునన్ హరియింప నా రమా
చరితము నుత్తమం బఖిలపాతక తాపహరంబు వేడుకన్ 88

సీ. కల్యాణగుణపాళి కంజాత సంజాత
కటుజాతబాష్ప విక్షత సమేత
సరసీరుహాక్ష వక్షస్స్థలాలంకార
కీర్తి ప్రచార విస్ఫూర్తి సార
త్రిజగతీమాత వర్ధిత వైభవవ్రాత
నరకల్పవల్లి కాంతామతల్లి
సకలలోకేశ్వరి శాశ్వత శుభకరి
భక్త మన పద్మ [3]భవ్యసద్మ

---

1 మూ. యనువగు
2 మూ. లేదు
8 మూ. సద్మ

తే.గీ మహిని సంసార జలధి నిర్మగ్నులగుచు
స్రుక్కుచుండెడి జనములఁ జూచి వారి
నందఱను నుద్ధరించుట కాత్మ నెంచి
యవతరించిన సిరికళ యాలకింపు 100

## పద్మినీకన్యకోత్పత్తి

సీ ఝంకార షట్పదాలంకార సారస
శ్రేణికార పరివార సంకులంబు
మల్లికా జాతిమతల్లికా మాధవి
వల్లికా సముదాయ వేల్లితంబు
మందార తరు సుమ్మ దారర మరంద
సందోహ నిస్తులానందనంబు
కేకికా శారికా కీరికా పాళికా
నేక నిస్స్వన మాలికాకరంబు

తే.గీ మంజుతరకంబు సంతాత ఘుంజరంబు
చైత్ర సంక్రాంతి సౌరభాంతరంబు
సమత దివ్యతరంబు ప్రమదావగా ర
టాంక లక్ష్మీకరంబు పద్మాకరంబు 101

వ పెండియు నా సరోరుహాకరంబు సరోరుహాకర కారకం బగుట నమృతా
కరంబు రంబు విరంచింపుచు నిశాంబుపూర ప్రతిబింబితంబులగు
నంబురుహ మిత్రామిత్రబింబ ప్రముఖ గ్రహతారకా కదంబంబు నున్న

తే.గీ. అమరి ఫాల్గుణ మాసంబునందు శోభ
నంబయిన యుత్తరక్షంబునను సమస్త
లోకసేవిత స్మరమాత శ్రీకరాంగి
పాదమె నొక దివ్య కాంచనాంభోజమునను 103

సీ. సుందరగాత్రి పూర్ణేందు నిభ వదన
జలరుహపత్ర విశాలనయన
ఘన చతుర్భుజ పీతకౌశేయ శోభిత
కరయుగ కటిచ్ఛ కోకనదయుగళ
విద్యుత్ప్రభాన భామిని దీప్త సంతాన
రమ్య లావణ్య హిరణ్య వర్ణ
హరిణి పృథుశ్రోణి హరిమధ్య బింబోష్ఠి
పద్మ పాదతల్ప్రభాసమాన

తే.గీ. శ్రీయుత భ్రూలతాద్య చాంపేయనాస
నీలకుంచిత కుంతల నిమ్ననాభి
కరలు కంధర హార కంకణ కిరీట
కుండల లలాట భూషిత గుణ సమేత 104

తే.గీ. దివ్యచందన పరిలిప్త దివ్యపుష్ప
గంధ శోభిత సుకుమారి కమలహారి

నీవు సహస్రలోచనుఁడు నీవు సహస్ర శిరోధి ఖ్యాపితున్
నీవు సహస్ర పాదవును నీవు సహస్ర కరాంఘ్రి శాశ్వతున్
నీవు హిరణ్య వర్ణ్యుఁడవు నీవె హిరణ్మయ వాది లక్ష్మి విన్
నీవె సమస్తమాత హరిణీ నినుఁగూర్చి నమస్కరించెదన్ 110

క క్షమలోఁ జంద్రాహ్వయవై
రమణీయస్థిర సువర్ణ రజితస్రజవై
యమరి సకల సంపత్ప్రద
సుమహిమ గం నీ కొనర్తు శుభమతి వినతుల్ 111

క ఇం నీ కటాక్ష వీక్షణ
ముంచేఁ దగ నీ యనేక భువనంబులోగిన్
గలుగుచు వర్తింపుచు ను
జ్జ్వలతర సౌఖ్యంబు నొందు సమ్మదలీలన్ 112

మ హరివక్షఃస్థలవాస నీ దగు విలాసార్థంబు నీచేత నా
హరి సంప్రేరితుఁడౌచు నీ సకలలోకాలిన్ సృజించున్ మరిం
బరు రక్షాప్తినిఁ జేయు నిదియన నేత్రోదంచితస్ఫూర్జిత
స్థిరలీలన్ గద లోకపావనదవుల్ దిర్జ్యత్ప్రాదిసత్కథల్ 113

సీ. అసమ గంధర్వ్వారయును దురాధర్షయు
నిత్యపుష్టకరీషిణియు నటంచు
సర్వభూతేశ్వరి శౌరి దీర్ఘన పే
యనియని నిన్నుపాసనముఁ జేసి
యశమందు సర్వలోక విఖ్యాతులును ధనం
బును నశ్వముల గోవులను మహోత్క
టంబు లగు మాతంగ సంఘములఁ గౌశేయ వ
స్త్రములను వివిధ రత్న వ్రజముల

తే.గీ. భూమిని సమృద్ధి విభవంబు పుత్రపౌత్ర
సంతతిని నిగమంబుల శాస్త్రములను
బుణ్యలోకాదులను [1]జ్ఞానమును సద్బుద్ధి
నొందుదురు గాదె నీ దయఁ బొంది జనని 114

తే.గీ. అఖిలలోక శరణ్య కల్యాణ సుగుణ
జలధి శరణంబు గాంతు రేజనులు నిన్ను
వారు గాంతురు పుణ్యంబు వైష్ణవంబు
నవ్యయంబును శాశ్వతంబైన పదము. 115

---

1 ఘూ. జ్ఞానమయును

తే. గీ. తెందుదుర గాన వేడుకఁజేసి నన్ను
ధన్యునిగ నీదయారసాపాంగములను
వీక్షణము సేయు మరలితశ్రీ చెలంగ
నమరతతి విహంగ హరిసంగరాంతరంగ 121

తే. గీ. దైవవంచిత పాదపద్మముగ ధృతక
రాంబుజాతముగా నగదంచిరముగ
శ్రీధరుని పత్నిగా సరసీరుహాక్షిగ
శిష్ట నిముగ గొల్పి భూమి నింపెనంగ

పాండ్యరాజు శ్రీరంగంబున కరుగునెడఁ బద్మినీకన్యకను జూచుట

వ. అని యివ్విధంబున శ్రీదేవిం గొనియాడి ప్రీతమానసుం డగుచుఁ బ్రజా
పల్లి తదాజ్ఞఁ గైకొని రంగక్షేత్రంబున కరుదెంచి విశాల ఫలంబగు
శ్రీరంగనాథు నవలోకించి నమస్కరించి యథావిధిం బూజించి పొంది
వరించి యప్పురవరికి ంత్ముఖనసంబు విజ్ఞాపనంబు చేసె నత్యాగంబున
రాజునిష్ఠ సత్తముండగు పాండ్య ధరణీమండలాధిపతియందు రంగనాథ
సేవార్థంబు గాఁ బొవుచు మహాసైన్యంబుతో పద్మాకరంబు గసంగొని
విశ్వయంబునం బ్రి [2]కత్తిరంగఁ జేరవచ్చి యత్యుత్సాహంబునంపు 128

సీ. పుటపాక ధర్మ విస్ఫూర్తిఁ జెన్నగు మేని
కాంతి జగత్త్రయి కాంత మరుగఁ
బాలేందు మండలంబు హసించు వెన్నెమము
నరచకోరములు కానంద మొసఁగ

1 మూ. గొ
2 మూ. య

దళదరవింద సుందర విలోకనములు
ప్రీతి జనక దైన్య విచ్ఛిత్తి జేయ
సముదీర్ణ బాహు కాంచన కల్పలతికలు
ధన్య సంచయ వాంఛితం బొసంగ

తే.గీ. సరస సౌవర్ణ పంకజాంతరమునందు
బాలభావంబున వినోదకేళి సల్పు
చును భ్రమించు శ్రీదేవి శోభనాంగిఁ
గాంచి యారాజు విస్మయాక్రాంతుఁ డగుచు 124

తే.గీ. రూపలావణ్య కాంతుల రూఢిమించు
నమ్మహాదేవి ఎక్కుగా కరనియంత
నధిక సంతుష్టుఁడంచు గొనియాడి మ్రొక్కి
భక్తి తాత్పర్య హృదయ స్వభావుఁ డగుచు 125

మ. ఘన విజ్ఞానమయుండు భూమిభుఁడు నిత్యోత్కంఠయుగా బద్మమం
దిర లక్ష్మి న్నిఖిలోపచారముల నర్చించెన్ గావించి సుం
దరతం బొల్పగు నామెఁ గాంచన విమాన ప్రస్థితం జేసి మం
దిర సీమం గొనివచ్చె హర్షమతియై దివ్య ప్రభావాఢ్యుఁడై 126

క. పద్మమునఁ గలుగుటను నా
పద్మనిభేక్షణకు భూమిపాలుఁడు తగన్
పద్మిని యను పేరిడె వా
త్సద్మంబున నిండుకొనిన పరమ ప్రీతిన్ 127

పాండ్యరాజు పద్మినీకన్యను భార్య కొసంగి పుత్రీభావమునఁ బెంచుట

క. తన భార్యకుఁ దా నా
మనుజేశ్వరుఁ డక్కుమారి నప్పనదోసన్
దిన దినమును పోషింపఁగఁ
గనుఁగొన నల్లారుముద్దుగా నెసఁగు తటిన్ 128

మ. అమరన్ యౌవనపూర్ణిమోదయముగా నవ్యాకృతిన్ బాల్యమం
దమరున్ జారె ముఖేందు మండలము నుద్యల్లీల దీపించె దృ
క్కుముదంబుల్ వికసించెఁ గావలెనె వక్షోజాంకురం బారకో
ద్గమ రోమాంచిత మేర్పడన్ హసితరేఖాచంద్రికల్ రంజిలన్ 129

ఉ. సారసగంధి కొప్పు సురసస్థితిఁ జీఁకటుల్ హసించు వే
ణీలము మహేంద్రరత్నరుచి మండలిఁ గైకొను టేమి చిత్రమో
యారయ నెట్టివారికి [1]బంగారము లెక్కుడు [2]నాటఁగాదఁ జే
కూరిన చిత్ర వస్తువులు గోఁగనెత్తరె విప్రలాక్షులై 130

తే.గీ. విదితముగ బాల ఫాలంబు విదియచూచి
యమృతకరరేఖ సుమ్ముటు లనక యున్నఁ
దరళ మౌక్తిక తారకోదార దైవ
గాత్రమండలం సాంగత్య మంది యున్నె 131

---

1 మూ. పదా

2 మూ. నాకు బార

తే.గీ. నయనములు మీనములు రదనములు మౌక్తి
కములు కైశ్యంబు శైవాల సమితి నాఁగఁ
బొలిచి సౌందర్య రస సుధా స్ఫూర్తి నెసఁగి
సరసిజేక్షణ నవ [1]పయస్సరసి దనరె 144

క. నాళీక నాభియగు నా
నాళీక దళాక్షి యౌవనంబున నిటులా
నాళీకజ నవ సృష్టియు
నాళీకాస్త్రుని సొంపా నా నెసఁగు రతిన్ 145

పద్మినీకన్య రంగనాథుని భర్తగా వరించుట

క. ఆ మానిని లో మానని
ప్రేమాదరం ప్రసక్తి పెంపొంద మదిన్
వేమింటి తనకుఁ బతియని
కామించెన్ రంగనాథుఁ గమలానాథున్ 146

సీ. శ్రీరంగనిలయ మెంది గడించినంతనే
మదిఁ బ్రీతి నర్తింప మసలఁ దెనుచు
యతిరాయ యనుచు నేర్పడఁ జెప్పినంతనే
రోమ రేఖాంచితారూఢి నెసఁగుఁ
పద్మనాభుఁ డటంచు భాషించినంతనే
వీక్షణాబ్జం [2]చేత వేడ్కఁ జేయుఁ
పద్మాప్రియుఁ డటంచుఁ బల్కినయంతనే
అచ్యుతప్రియ నే నటంచుఁ దలఁచు

1 వ్రా. యవ 2 వ్రా. చే

తే గీ  హరియటంచు వచించు యంతిలోన
తాను బిమ్మని వనుచ సత్కర్షఁ దాను
రంగపతి మోహలగ్నాంతరంగ యగుచు
బాలికామణి యటుల విభ్రాంతి నెసఁగు  147

వ  మఱియును వయ్యంగనామణి రంగనాథ సమాశ్లిష్టాంతరంగయై తదీయ
దర్శనస్పర్శనాలింగనానంగ నానావిధ లీలావధాన సువిధాన విభ్రమ
సంభావనా గుంఫన వివశస్వాంతయు స్వాంతభవ [1]స్వ సముద్దండ
దోర్దండ కుండలీకృత కోదండ నిర్గళ త్కాండ ప్రకాండ పరంపరా
విపాట్యమానధైర్య కంకట వికంకట హృత్పుటయును ఘటపాక సీకర
వియోగ వేదనాతిశయాతి పాక సమాపాదిత పాండిమాది వివిధ వైవర్ణ్య
లక్షితావయవ లక్షణయును క్షణమాత్ర చలీకృత శయనాసనాద్యవస్థానయు
నగుచు వర్తింపుచు నతని యనంతకల్యాణ గుణంబులు గీర్తింపుచుఁ
జలితచిత్తయై తత్కృతులు పఠియింపుచుఁ దత్పరిచర్యలు రచియింపుచుఁ
దల్లీలా చరిత్రంబులు పఠియింపుచుఁ దదన్యప్రసంగంబుల హరింపుచుఁ
దద్రూపంబులం భావింపుచు నతని ధరియింపుచు నివ్విధంబున నిరంతర
తత్పరాయణయుఁ దదధీనానన్యధ్యాన విస్మారిత సర్వస్వయునై యుండి
యయ్యవసరంబున  148

సీ  ఉత్తరంపెరం సుదాత్తమౌ యనదుది
త్తము రంగనాథాశ్రితంబు గాఁగ
వహ్నింబుఁ బల్కుచ సంరెడు తనతిహ్వ
శౌరి చరోక్తి దానప్రదముగాఁగఁ

---

1 మూ స్వా  2 మూ ర్థ

జలసంయుతేశ భాసిలు తన చూడ్కి శ్రీ
హరిరూప దీప్తియం దిరవు గాఁగ
నిరత శబ్ద స్ఫూర్తి నెనయు మెఁదవ విన్కి
నలినాక్ష నామ పఠనం బు గాఁగ

తే. గీ. క్షిప్తి యక్షిప్తియును లేని క్షప్తిఁ జేసి
యచ్యుత ధ్యాన పరవశ యగుచు నింతి
విశ్వలల్లతిఁ జేష్టలన్నియును దక్కి
శివ మాత్రావశేషయై శీతిఁ దనర్చె 149

పద్మినీకన్య విరహము — సఖులచింత

క. ఈరీతి నుండు బాలాం
భోరత్నముఁ జూచి తోడి తరుణులు చింతా
భారంబునఁ దమలోఁ దా
మారూఢి వచించ రతులితాశ్చర్యమునన్ 150

చ. కనుఁగొనంగ ధరిత్రి నృప కన్యక లెందఱు లేరు ఇవ్వనం
బును మెయిఁ గల్గనేలఁ దమ [1]బొల్పువచింతురు గాన నిందు వ
ర్తనపడగాక్షి చిత్తమున వర్తిలు కోర్కి నొకప్పుడేని సూ
క్తిని గతియించి పల్కదు సఖీమణులార యిదేమిచిత్రమో 151

చ. పరవశమైనదో తరుణి భావము నొక్కని యందు లేక యు
త్కరముగ సిగ్గు లోఁ బాదముగా వదియించుటలేదా యింత నీ

---

1 మూ. హొత్రి

నరతి యెటువున్నదో తెలియఁగాంచు భామినులార పేఁద వె
త్తుఁ గగనో యటంచు బదరికనత వారల పల్కుసత్తిన్ 152

మ. దివస గ్రీష్మము కాంతిఁ జెందఁగను రాత్రి ప్రావృడుద్భూతిగా
రవి వారాయణుఁదోట నత్తటిని నిద్రాసక్తి సంధ్యాంబర
ప్రవృత లొప్పు[1] యపింప నేఁగె నన నిచ్చున్ వార్థిలోఁ జొచ్చెఁ దై
నవ మేఘంబు [2]లిసంగెనాఁ దగె భువిన్ గాఢాంధకారవ్యూహంబ్ 153

క. సాయం పురుషుఁడు రజనీ
ప్రేయసిఁ గంయునెద పేదు పేసలి మెఱుఁగో
నా యొప్పె నిరుల తర్షి
తాయత మల్లి సుమంబులవ నెరసె[3] సుదుల్ 154

సీ. విరహాంధకార భైర్య ధరణీధరంబుల
భేదింపవచ్చిన భిదుర మనఁగ
ఘన వియోగము గెల్చి విజయంబు గైకొన్న
గంధరాంతకుఁ డెత్తు ఖంభమనఁగ
అధిక సంఘము హృత్పంకజాతనాళ
మూలంబు లెత్తు మరాళ మనఁగ
కాంత జనంబులపై వేఁట వచ్చిన
యంధకారమ్ము సింహంబనంగ

---

1 మూ ప్రవ్ 2 మూ లొసంగె 3 మూ నదుల్

## శ్రీరంగభర్త పాండ్యనగరమున కేతెంచి పద్మినిని పరిణయమాడుట

సీ. బ్రహ్మసంభవునితో సకలదేవతలతో
 సనకాదులగు దివ్య మునులతోడ
వరుస ననంత విష్వక్సేన ముఖ్యులై
 తనరిన పరివార జనముతోడ
సమితానుభావులై యలరు కాసారాది
 పరమ మహాయోగి వరులతోడ
గరుడని నెక్కి రంగస్వామి సంతోష
 భరితుఁడై నిజనగరంబుఁ గూర్చి

తే.గీ. ఎత్తెఁ బరిణయ మగుట కుల్లాసి యగుచుఁ
చేరి సంతసఁ బాండ్య ధాత్రీశముఖుఁడు
భక్తి దనకాత్తఁగా జగత్కర్తఁ గూర్చి
యెదురుగా వచ్చి పదముల కెఱఁగి నంత 176

వ. అయ్యుర్వీశ్వరుండు దేవుని సర్వోపచారంబులన్ బూజించి బ్రహ్మపురోగ
ములగు సురలనుం గాసారాది యోగీశ్వరులనుం దక్షిణ సమస్తపరిష
త్సముదాయంబుఁ బురంబున కెదుర్కొని యథోపచారంబులఁ గావించి
యందు సుందరంబగు సువర్ణమణి బంధురంబగు నొక్క దివ్యమంది
రంబునన్ జగన్నాథుండగు రంగనాథు నునిచి నిస్తుల కస్తూరికా ఘనసార
చందన ప్రముఖ నిఖిల పరిమళ మిళిత సలిల చర్చిత ప్రతోళికా ప్రతి
నికేత ప్రాంగణ ప్రయుక్త ముక్తామణి రంగవల్లికా సంగతంబును
వియదృరత్నాకర ప్రకర గరుత్పరంపరా సంపత్సంపాదక హరిన్మణి
తోరణ నిబద్ధ ద్వార బంధంబును సుభయపార్శ్వ సంబంధ రంభా
స్తంభ సంభార సంభావిత వేదికాప్రదేశంబును రాజమార్గ నిరర్గళ సంచర
ద్విలాసినీనికర కర రాజీవ విరాజిత రత్న నీరాజన భాజనరాజంబును
సముత్తంభిత శాతకుంభ కుంభ సంభాసిత రమ్య హర్మ్య నిర్మిత
పతాకాభిరామంబును సుధాధవళ సౌధ వీథికా విపణ్యాదిక విసర

ఎనంబడు నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ
పురాణోత్తర ఖండంబు నందలి వింశతితమాధ్యాయంబు భక్త పరాయ
ణుండగు నారాయణుండు నరునకుం జెప్పిన 183

మ అవతారాంతర రాయతానుభవ లీలాధార సీతాపతి
ప్రవణప్రోక్త దళాక్ష వేదతర రోమప్రాప్త సాధుత్వ మా
ర్గ విగాహాద్భుతకృత్య కోలమగు క్ష్మాపాం సాహాల్యకృతి
ప్రవణ ప్రాపిత మోక్షసైభవ సదాభక్తాదర ప్రాభవా 184

క సురుచిర పాండ్యకుమారి
సరస మనోహరి దైత్య సంఘ విదారీ
కరుణా సుధాబ్ధి లహరీ
నిరుపమ భక్తానుసారి నిగమ విహారీ 185

భుజంగ ప్రయాతము
సురారిప్రభీతి వ్రాత సంభావ్యశీలా
కరారామ కాంతార కాలాగ్ని కీలా
హరాత్రస్త తాపత్రయ ప్రేష్య జాలా
మురారీ హరీ శౌరి గోపాలబాలా 186

గద్య: [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణాకటాక్ష వీక్షణలబ్ధ పాండిత్య ధుర్య
నవరతావనీ మండలాఖండ సామ్రాజ్య ధౌరేయ న్యక్కృతమర్దకాన్నత పటహ
ధణంధణారావ విపరీత పతత్రియా ఢిల్లికాధీశ దుందుభిధ్వాన కోలా

1 ము ఇది

వాల హనుమద్ధ్వజాంక కనక దండీకృత హీరకలశీకృత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కౌశలవం పయః పారావార రాకాసుధాకర సౌందర్యజిత సుమసాయకుం డహోబిల నాయక ప్రతీతంబైన శ్రీ మహా భార్గవ పురాణంబునందు కుంభేశ్వర ప్రాదుర్భావం బను రాజ మంత్రులు వైష్ణవుల యెడఁ శౌర్యంబు గల్పించుటయుఁ గుంభేశ్వరు శపథంబునుఁ దన్మహీపతికి నారాయణుండు ప్రసన్నుండగుటయు భగవద్గుణాను కీర్తనంబును వాని వివాహంబునుఁ గుంభకోణంబు రామాయణ శ్రవణం బునం జేసి దశరథంబునందుఁ గోవంబువెట్టి పొంకించిదపో మార్గమధ్యంబున వాసుదేవుండతనికిఁ బ్రసన్నుండై పుష్పకంబునఁ గుంభకోణ నిడకొని పంపదంబు గూర్చి చనుటయుఁ బద్మిని కన్యకోత్పత్తియు బ్రహ్మేం ద్రాది సురార్చరోగణములు లక్ష్మిం గీర్తించుటయుఁ బాండ్యరాజు శ్రీరంగంబున తిరుగునెడ సరసి మధ్యంబు వందలి కమలాకరంబున రమాంశ ధారయగు కన్నియం గొని పుత్రీభావంబునఁ దన భార్యకొసం గుటయుఁ బద్మినీ కన్యకా వర్ధనంబును శ్రీరంగ భర్త పితామహేంద్ర కాపాలయోగి ప్రభృతిగణ సహితుండగుచుఁ బాండ్యనగరంబున కేతెంచి పద్మినీ కన్యకం బాణిగ్రహణంబు చేయుటయు ననెడు నేతత్కథలం గల చతుర్థాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## పంచమాశ్వాసము

క. శ్రీకాంతానయనోత్పల
రాకా హిమధామ కోటిర విమలధామా
ప్రాకట వాగిన గిరి శా
ఠికరుణాశీల సురపురి గోపాలా 1

వ. ఆ సకలగుణనికర ప్రజ్ఞాధురంధరుం డగు నయుండు వివిధ విబుధోపలాలన పరాయణుండగు నారాయణుం గూర్చి యిట్లనియె 2

క. నారాయణ విబుధ జగ
త్కారణ కారుణ దయామృత పయోనిధి సం
సారాంబుధి తారణ ?
తైరవి సాష్టాంగ వినతిఁ గావింతు నిలన్ 3

క. ని వలన నేను వింటిని
శ్రీ వైష్ణవ భక్తి రతుఁడు చిరపుణ్య యశో
వైభవ యగు కులశేఖర
భూపాలకు చరిత సకలమును విదితముగాన్ 4

తే గీ అఖిల పాతక సముదాయ హరము నగుచు
మహిత కల్యాణ విభవ సంపాది యగుచు
దివ్యమైనట్టి పద్మినీదేవి కథయు
వింటి మదిలోన సంప్రీతి విస్తరిల్ల 5

ఉ ఏ యెడ నె విధంబున నే సమయంబుల నంతరాద్భుత
శ్రీ యుతులంచర్యులై యవతరించిరి యోగివరేణ్యు లాదినా
రాయణ పాదపంకజ పరాయణులై భగవత్ప్రదాప్తి సం
ధాయకులై మహాత్ము లిలఁ దన్మహితాత్ములఁ దెల్పవె తగన్ 6

## మునివాహని జననము

వ అను వరుం గూర్చి సమాదరంబుగా నారాయణ మౌని యిట్లనియె 7

క తమసా నదికిని దక్షిణ
మమునము రమణీయమై భవాస్పద మగు శ్రీ
రమునందు సర్వసంప
త్సమృద్ధిఁ దనరారి యఖిల జనమాన్యంబై 8

క మగరాం కేళిమిద్ధంఁ
బగరప్పు దారువులఁ గనక పంకజ రాగా
ద్యగ్గ్రహ నివహముల నిచుళా
నగరము పెన్పొందు నభ్రనగరం నిభంబై 9

---

1 వా మహాత్ము

ఆ వె. పరమ పావనంబు భవ నాశనమును
దివ్య భావనంబు సేవ్య మగుచు
నవ్య సౌరభంబు నవ్యయ పదమై
భ్యాతిఁ దనరు వన్నదీతటమున 13

సీ. అందు కార్తిక మాసమందలి రోహిణీ
నక్షత్రయుక్తమై పయనుగాంచు
శుభదినంబందుల సురుచిర లీలతో
హృదయంబు నందు రమేశుఁ దలఁచ
మునసి శ్రీ వత్సాంగమూన సైన్నవాంభోధి
చంద్రము స్ఫూర్తిచే సంభవించి
అన్య ప్రభృతి రంగశౌరి పాదాంబుజ
ధ్యాన యోగామృత[1]పాయి యగుచు

తే గీ. మనుదినమ్మును వర్ధమానాంగుఁ డగుచు
వరుసతో రోదనావ వర్జనంబుఁ
జేసి సహజ మహత్త్వ పెంపఁగ నతఁడు
[2]నఖిల జగములు విస్మయం బందుచుండ 14

---

1 మూ పాని

2 మూ జనములు

ఉ. అనుదిన మీ మహాస్వరుఁ డుదార గతిన్ రచియించు గీత మెం
పున వినువట్టి వారలకు భూరితరాచ్యుత సౌఖ్య సంపదం
దనరుట సత్య మిట్టిగతిఁ దామరసాక్ష కటాక్ష వీక్షణం
బునఁ జరియించునట్టి సంపూర్ణము వ్యర్థము గాఁ దనర్చునే 21

తే.గీ. ధన్యతరమైన విద్యాగాంధర్వగాను
మునను నా గాయకుఁడు మోదమునను నందు
ఈ ఘనమయ మధురసియించె దివ్యమతిని
యంబుజాక్ష పదాంబుజధ్యానుఁ డగుచు 22

తే.గీ. నిజతటంబున వసియించి నిష్ఠ నతఁడు
నవ్య మధురస్వరమున గానంబుఁ జేయఁ
దాని నాలించి కావేరి తన్మయతను
స్తంభి[1]తోదక యగుచు నిశ్చలత నిలిచె 23

సీ. అతి కఠోరంబైన యంబరాయ శిలల్
ద్రవియించి పీఠి వెల్లువలఁ బాఱె
బలు మనోహరము గాఁ బాదపశ్రేణుల
స్రవియించె మధువు సుస్వాదువగను
జెప్పలు దెప్పు లొగ్గి పరవశత్వచేతఁ
గనవు మేయక దస్పాందము లయ్యె
మొగి పక్షులాహారము లిడి తలయెత్తి
యనితర బుద్ధిచే వినఁ గడంగె

---

1 వ్రా. తో—త

తే.గీ. మతియును సమస్త జంతువుల్[1] మానసులను
దన్మయములుగఁ జేసెలు దక్కియుండె
నమ్మహాగాయకుఁడు చేయునట్టి దివ్య
పరమ భగవద్విషయగాన వైభవమున 24

ఉ. కృతయుగమందు ధ్యానమునఁ ద్రేతను యజ్ఞవిధానలీలం సం
తతము సమర్చనావిధుల ద్వాపరమందు నరుండు గాంచు నా
యతమతితోడ నేఫలము నాఫలమున్ గనుచుండు నార్య సం
గతమగు భక్తిలోఁ గలియుగంబున శ్రీహరి కీర్తనంబునన్ 25

మ. అని యా యర్థము సంస్మరించి మదిలో నా గాయకాగ్రేసరుం
డనుమోదంబున వల్లకిం గొనుచు దివ్యంబైన గానంబుచే
వనజాక్షునిఁ బాడుచుం బొగడుచున్ వర్తించి యా రీతి న
త్యనురక్తిన్ హరినామకీర్తనపరుండై యుండె నశ్రాంతమున్ 26

## రంగభర్త మునివాహనుని గానమును లక్ష్మీదేవికిఁ దెలిపి యాతని గానమును బ్రశంసించుట

శా. ఆరీతిన్ మధుర స్వరాంచితము దివ్యంబున్ మహాశ్చర్యదం
బారూఢ శ్రవణానురంజకము నౌ నద్గాన మాలించి యా
శ్రీరంగక్షితి భర్త హర్షపులకశ్రేణీ పరీతాంగుఁడున్
సారామోద భరాశ్రుమిశ్ర నయనాబ్జాతుండునై యెంతయున్ 27

తే.గీ. తన సమీపంబునందు సవినయమునను
జేరి సరసవిలాస విశేషములను
దెలుఁగు శ్రీదేవి మమ్ము వీక్షించి యిట్లు
లనియె నాశ్రితవత్సలుఁ డగుడు శౌరి 28

---

1 మూ. మానసులు

నీవు నిర్మలమూర్తి నిశ్చలస్థితిని భా
   నిను యోగదృష్టి వీక్షించువాఁడు
భవదీయ దివ్య శోభనగాన పరములు
   సొంపుగాఁ బాడుచు సొక్కువాఁడు
అలి నీ యనంత కల్యాణ గుణంబులు
   తివిరి యేవేళ నుతించువాఁడు

తే.గీ. నీ చరితగాథలు వినిఁ దలంచినవాఁడు
శమదమాదులచేత చెలంగువాఁడు
నీ కృపాదృష్టి పాత్రుఁడై నెఱయువాఁడు
నరుఁడు సామాన్యుఁడె జగతీశ్వరేశ 33

తే.గీ. అధిప మీ ప్రియగాయకుండైన నితని
నతట బాహ్యప్రదేశమునందు నునుచు
టుచితమె మీ సమీపమం దుండు నటులఁ
జేయఁగాఁ దగు మీ దయార్ద్రి దనర్చ 34

రంగభర్త లక్ష్మీదేవి పలుకులు విని మునివాహని
ద్వారదీర్ఘ వామఁడను సారంగముని నంపుట

క. అని యోగతి వినయోక్తుల
వనజాలయ విన్నవింప వనజాక్షుఁడు దా
విని సంతుష్టాంతరుఁడై
తన మనమున నిటుల జేయుతలఁపున నంతన్ 35

భాగ్యంబు సత్కార్యంబు గదా యని పేను ప్రియంబుగా నెన్నుకొని పల్కుచు నప్పుడి సమీపంబున కతిరయంబునఁ జని విధ్యుక్తంబుగా నతనిం బూజించి వాసవచనంబు విన్నవించి నిజమహాకోశంబునందు ప్రీతుం డగుచు నెలరని పలుకు సగ్గాయకు బలాత్కారంబునంజేసి గ్రహించి స్కంధంబునం దిడుకొని సారంగమునిపుంగవుండు రంగభర్త సన్నిధిం గొనివచ్చిన 38

తే. గీ. అని మొదలుకొని మునివాహనుఁ డనెడుపేరఁ
దనరి గాయకుఁ డంత నుదాత్తభక్తి
రంగవిభుఁ గాంచి ప్రణమిల్లి రమ్యమతిని
హర్ష రోమాంచ కంచుకితాంగుఁ డగుచు 39

## మునివాహనుఁడు హరిసకలావయవ మనన తత్పరుఁ డగుట

క. కర బద్ధాంజలి పుటుఁడై
పరమానంద ప్రవాహ భరితాత్మకుఁడై
యురుభక్తి నతఁడు దామో
దరు సకలావయవ మనన తత్పరుఁ డగుచున్ 40

క. వరుస మనో భృంగముచేఁ
బరమార్థ విశేషసాంద్ర పరిమళయుతమై
నిరతము మనోహరంబగు
హరి చరణాంబుజ మరంద మాస్వాదించెన్ 41

తే.గీ. వివిధ సద్రత్న ఖచితంబు విపులకటక
యుగళ మన్వేషణముఁ జేయ నొప్పఁ బాద్కి
యందు సురరాజమణి మాడ్కి నలరుచుండు
నంకదంష్ట్రనగందిత భ్రమర మనఁగ 42

ఉ. హాయిగ నాభిపూర్వము విధానత నున్నతమైన శౌరి జం
ఘా యుగళంబు సర్వజగదాధారము న్స్ఫురియించి భక్తి పెం
పై యమరారు చిత్రము నిరంతర వైభవ సౌఖ్య రూప సం
ధాయక మౌచు సంతత ముదార సమాధిగ నుండు నెక్కుడై 43

క. గరుడ స్కంధ విభూషణ
ముదయతర మూరుద్వయంబు నొప్పుటయందు
త్కరముగ నిల్పిన హృదయము
చింతానందామృతాంబునిధి సుఖియించున్ 44

తే.గీ. భవ్య పటపీత భర్మ విభ్రమము మాప
మెఱుగు భక్తజనమోహనం బగుచుఁ గోటి
భాస్కరద్యుతి యైన యంబరము నందు
దృష్టి గావించుచుంటి నా దివరుండు 45

క. సుందరతర కాంచీదామ
స్ఫురిత కటీతటమునందుఁ జూచిన యా శ్రీ
హరి చిత్తము మూర్తిగాఁగ
పరిపూర్ణ సుఖాబ్ధి నందుఁ బ్రాపించె నాగిన్ 46

సీ. లసదు నిర్మలకాంతి దళదిళా కామినీ
వదనాబ్జమంతయు దివాకరుఁడుగఁ
దవ సమున్నత సముద్యద్ద్యుతి ద్యోతిత
సౌవర్ణ గిరి శృంగ సరణి గాఁగఁ
దనయందుఁ గలిగిన వనమయూఖశ్రేణికి
నాధారమగు రోహణాద్రి గాఁగఁ
దనయందు దగు సుమ తారకాపాళి కు
ద్ధామమౌ సంధ్యాంబరంబు గాఁగఁ

తే.గీ. ప్రణత జన సంఘ మనకును మణినిధాన
కిరి యగు హరి రత్న కిరీటమునను
స్థిరముగా మానసముఁ జేర్చి ధీరుఁ డతఁడు
పరవశస్థితి నానంద భరితుఁ డయ్యె. 52

## మునివాహనుఁడు రంగభర్త సాయుజ్య మొందుట

వ. అవ్విధంబున యోగివర్యుం డగు మునివాహనుం డాపాదమస్తకాంతంబు నను
భవంబు చేయుచు సర్వేశ్వరుండును లక్ష్మీశ్వరుండును నగు శ్రీరంగేశ్వరు
నందు లయంబుఁ జెందె. ఇట్టి వైభవంబున నెవ్వరేని శ్రీధరగాయకుండును
మహాత్ముండును నగు నీ మునివాహనుని చరిత్రంబు నిత్యంబును వినుచుం
బఠియించుచుం గొనియాడుచుఁ జదివింపుచు నుందురు[1] వార లక్షయం
బగు వైష్ణవ పదంబుఁ బ్రాపింతురని మహాయోగి మాహాత్మ్యంబును
శ్రీమంతంబగు నీ భార్గవపురాణోత్తర ఖండంబునందలి యేకవింశాధ్యా
యంబు ముక్తిప్రదాయకంబు నగు నరునకుం జెప్పి వెండియు నిట్లనియె. 53

---

1 వు రు

శా. ఆ రాష్ట్రంబున నందు మండన సమాఖ్యం బొల్చు గ్రామంబు భా
శ్రీ రత్నోజ్జ్వల భూషణంబు మహి సందీప్తచ్ఛటా స్వర్గ సౌ
ధారామ ప్రచయాభిరామము రతీశాత్మచ్ఛిదాపావి భా
పౌరస్త్రీరయి సర్వభాగ్య మహిమం బుత్కృష్ట తేజస్థితిన్ 59

సీ. ఆ పురంబున నుండు వసనీసురోత్తము
లందఱు హరిపరాయణులు నిగమ
పారంగతులు దివ్యభావులు సకలశా
స్త్రవిశారదులు సదా సత్యశీలు
రానందవార్ధి మగ్నాంతరంగులు సత్కో
ర్కారగుణుల్ సమలోష్ట కాంచనాత్ము
మతులు సంతత శాంతియుతులు కృతీశ్వర
బ్రహ్మలోకాదిక భాగ్యరతులు

తే.గీ. సతత హరిచిహ్న చిహ్నితుల్ వితత యశులు
తపన తేజులు నిజవర్ణధర్మ నిరతు
లతిథి భాగవతార్చనాయత్త చిత్తు
లఖిల సమదర్శనులు వినయాభిరతులు 60

క. కలియుగ మందును వర్తిలు
కలి కల్మష నాశ నిపుణ గమలాధీశున్
లలితమతి భక్తి గొని ని
ర్మలులై భజియింతు రెపుడు సత్యస్ఫూర్తిన్ 61

తే.గీ. హరి సమర్చన యత్నంబు లాచరించు
చును జితేంద్రియుండగుట నుత్సుకత మించి
ధర్మమున ముఖ్య నిష్ఠగాఁ దనరు వారి
లో నొకండు మహాత్ముఁ డనూన గుణుఁడు 62

క. నిగమాంతజ్ఞాన పరుం
డగణిత గుణసంపన్నుం డమలాత్మకుఁడౌ
జగతీసురవర్యున కిం
పుగ పత్నిలు ధర్మపత్ని పుణ్యమనీషన్ 63

విప్ర నారాయణ జననము

తే.గీ. సాధ్వి యంతట మార్గశీర్షమున జ్యేష్ఠ
యందు కర్కలగ్నమున శుభమగు దివమునఁ
గాంచె వనమాలికాంశ సముదితాత్ము
ధన్య గుణయుతుఁ దనయు సంభావ్య చరితు 64

తే.గీ. సూతకాంతమునందు విఖ్యాతిఁ గాఁగ
నవని నారాయణుం డను నాహ్వయంబు
సుతున కొసరించె జనకుండు సుస్థిరముగ
నిర్మలానంద చిత్తుఁడై నియతి మించి 65

వ. అంత 66

క. పంచమ సంవత్సరమున
నంచిత మతియైన సుతున కత్యుత్సవమున్
మించగ నుపనయనము గా
వించెన్ జనకుండు విప్ర విసరము లెస్సన్ 67

## విప్రనారాయణుండు విరాగియగుట

క. నారాయణాభి ధానుం
డై రంతులు నిమ్మహాత్ముఁ డఖిలాత్మకుఁడౌ
శౌరి యెడారం గరుణన్
గారవమున నధికభక్తి గం—ఁ డగుచున్ 68

సీ. ఘనుఁడప్పు హేతుకం బగు దుస్తర మగు
సంసారమందు నసారమైన
దృష్టి గావించి శౌరి పదారవిందంబు
విమల నిజమనోరవింద సీమ
[1]మోము దారేంబు వృత్తేసంబు ధరేన
నాయలో విషయంబు లన్నియు విడి
చిదచిదీశ్వర తత్త్వ నైశిత్య మనసౌంకి
శౌరిఁ బారతంత్ర్యప్రప త్తి గాంచి

తే.గీ. యంతరింద్రియ బాహ్యేంద్రియములు నెల్ల
గెలిచి వైరాగ్య బోధ సంకీర్ణుఁ డగుచు
నిత్య నిరుపాధిక సుభక్తి నియతి నుండె
నద్భుత ప్రాయుండు నారాయణుండు 69

## విప్రనారాయణుండు శ్రీరంగమునకు వచ్చి రంగేశుని సేవించుచుండుట

తే.గీ. అంత నా భూమిసుర వర్యుఁ డతులభక్తి
జ్ఞానవంతుఁ డగుచు దయాసార జలధి
యైన శ్రీరంగనాయకు నధికతేజ
క్షేత్రమున కేఁగుదెంచి యచ్చటమతిని 70

1 మూ మొనపి

మ. కనియెన్ విప్రవరుండు కాంచనమణి ప్రాగ్వైక సప్తావృత
స్థవ దుద్భాసి శుక పిక నికర భాస్వద్వన్నందనోపేత స
హ్యనగోద్భూత నదీ పరీత వింశా ప్రాసాద వైకుంఠ దీ
ప్ర విరాంత ప్రతిభానుషంగ విభవాంగము శ్రీరంగమున్ 71

తే.గీ. రంగభర్తను గాంచి యుత్తుంగ భక్తి
నహరహం బిమ్ము హెచ్చ సమర్చఁ జేయు
చుండి భూతంబులందు దయారసంబుఁ
గలిగి యాక్షేత్రమునను వర్తిలి యతండు 72

క. నిరతంబు భక్తి రంగే
శ్వర భక్తారాధనంబు సలుపుచు సత్క
ర్మ్యరతను దత్కైంకర్యముఁ
గడపుచు నచ్యుతపదానుగత చిత్తుండై 73

విప్రనారాయణుఁడు భక్తాంఘ్రిరేణువను పేరందుట

క. భగవద్భక్త [1]గృహంబులఁ
దగు మధుకర వృత్తిఁ గొనుచు ధరణిస్థలి నా
జగతీసురవర్యుఁడు సొం
పగు మతి భక్తాంఘ్రిరేణు వను పేరొందెన్ 74

సీ. అంల గోవింద భక్తాంఘ్రిరేణు సమాఖ్య
భాసిలునట్టి యా భూసురుండు
రమణీయముగను శ్రీరంగేశ్వరునకు స
మస్తకైంకర్యములందు నెట్టి

---

1 మూ. గృహంబున

తే.గీ. ప్రౌఢతర మేలుకొని విప్రపుంగవుండు
మొనసి విధ్యుక్తముగ స్నానమును రచించి
మంత్రరాజస్మరణము నియమమునఁ జేసి
యవలఁ దులసీవనంబున కరుగుదెంచి ౭౯

క. హరి వల్లభయగుఁ దులసిని
బరిపూర్ణ నిజాత్మ భక్తి భావించుచు ని
ర్భరముగ సంస్తుతించె
నరయం గొనియాడి నిరుపమానందుండై ౮౦

సీ. అయాధి బ్రహ్మేంద్రదియములకు సోఁకినఁ
దాశరథయాదికాపోప మణఁచు
ముత్తమాంగమున సమున్నతిఁ దాల్చినఁ
బంచమహాపాపపటలిఁ బాపు
బ్రహ్మ భాగమున భూషణముగా ధరియించ
నమరపదం బధిక భాగ్యంబు గలుగు
నింపిరేఁ పదారవింద తీర్థయుతంబు
గా గ్రహియింప మోక్షము నొసంగు

తే.గీ. తులసిఁ దన్నెవరేని భక్తిని దలంచి
రేని వారల కతుల సుధానుభూతి
చేయఁగాలేదె యీ తులసీమతల్లి
యనుచుఁ గొనియాడి విప్రవరాయణుండు ౮౧

తే. గీ. హారకోటీర కౌస్తుభహార కంక
ణాంగదాది విభూషాప్త కలరుచాఢ్యు
శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ హస్త
పద్మముల వాని శ్రీరంగభర్తఁ గాంచి 85

తే. గీ. భక్తినిఁ బ్రదక్షిణంబుఁ జేసి ప్రణతి సల్పి
యంత నుత్తమములగు వేదాంత సంస్త
వంబులను సంస్తుతించి మోదం ( గాంచె
సందితస్ఫూర్తి నా యోగిచక్రవర్తి 86

శా. నానా వర్ణవిచిత్రమై పరిమళానంద ద్విరేఫాళియై
సూనశ్రీతులసీదళాంచితయుతై సొంపొందు నమ్మాలికన్
శ్రీనారాయణు పాదపద్మములఁ బ్రీతిన్ దా సమర్పించి త
ద్ధ్యానానూన సమాహితాత్ముఁడయి సత్యప్రాభవోపేతుఁడై 87

వ. వండియు నవ్విప్రపుంగవుండు దామోదరుం గూర్చి చని పరమానంద
పూరితుం డగుచు నయ్యరంగేశ మందిరంబు వెడలి నియతుం డగుచు
శ్రీవైష్ణవుల గృహంబులయందు మధుకరవృత్తిం జేసి యన్నంబు
సంగ్రహించుకొని నిజాశ్రమంబున కేతెంచి యందు 88

భక్తాంఘ్రిరేణువు నిరంతరము హరిసేవా తత్పరుం డగుట

క. పరమాత్ముఁడైన హరికై
పరసుతుఁ డన్నము నివేదనము సేసి సము
త్కరుఁడగుచుఁ బిదప భోజన
ము రచించుఁ దదీయ భక్తిపూరిత మతియై 89

ఆ.వె. అమ్మృదూక్తి పంకజాయత విని సక్త
భావనాఢ్య యగుచు ననవరతము
సేవక ప్రియుండగు శ్రీవల్లభునిఁ గూర్చి
కడు వినోదమైన నుడువు నుడివె 101

సీ. క్షితియందు నమ్మునిశ్రేష్ఠుండు నీ మాయ
పరిగమించినవాఁడు వ్యాధ సుతుండు
మహనీయమూర్తి నీ మాయాకరంబు నెం
దఁడు భవద్భక్తుండు నారదుఁ డంటఁ
దరి ప్రియాంగన పల్కె నా దేవదేవుండు
భక్తమందారుండు భవహరుండు
భార్గవిని గుఱించి పల్కె నోపద్మాక్షి
విను మదిదుస్తరంబగు నామ

తే.గీ. మాయ బ్రహ్మానంద ముఖ విశేష
పాకశాసన నిర్జర ప్రముఖ వినుత
కఠినముగా నుండు నరి శరోత్కర మెఱిఁగ
చెప్పి కౌతుకి యగుచు లక్ష్మివిభుండు 102

నారాయణానుమతంబున నారదుఁ డప్సరోవేశ్యాకులంబున
దేవ దేవిగా నుద్భవించుట

క. పలుకులు తేనియలుంగాఁ
గలువలరాయండు మోముగా మానినినం
బున్నైన [1]డీలు పలవం
గలిగిన సౌందర్య పటిమ గాంచిన దానిన్ 103

---

1 మా. దీట

వ. అందు 109

సీ. ఆహ్లాదతర నిర్మలాంతఃకరణమున
శ్రీధర ధ్యానంబు సేయువాని
సరసమౌ వాక్కున సరసిజాక్షుని నామ
సంకీర్తనంబులు సలుపువాని
భక్తి తత్పరమైన భావంబు గొని కాయ
కమున నచ్యుత సేవ గలుపువాని
హరి మూర్తికా తిరవార్థంబు దన కర్మ
ములు నిత్యమై నొనర్చు చలయువాని

తే.గీ. భక్తి నితాంతనైక భాగవత వ
యో పదారానుషక్తత నుండువాని
విప్రకులవర్యుఁ బరమపవిత్రచర్యు
వాని నారాయణాఖ్యు నయ్యతివ గాంచె 110

దేవదేవి తనయగ్రజతోఁ బందెము వైచుట

ఆ.వె. భగినిఁ గూర్చి యిట్లు పలికె విలాసిని
యగుచుఁ బంకజాక్షి యన్మదీయ
రూపరేఖఁ జూచి రాధిగా నెవరేని
మోహపడరె హృదయములఁ గలంగ 111

ఉ. ఈ మునిరాజశేఖరుఁ దహీనతపోనిధి సంస్థితాత్ముఁ డు
ద్దామగుణుం డకాముఁడుఁ దుదారకుఁ డింద్రియ నిగ్రహంబునందు వి
ద్యామహితాత్ముఁ డార్యజనతానుత పద్మ చరిత్రశాలి ల
క్ష్మీ మహిళావరాంఘ్రి సరసీజ మరంద మిళింద మున్నతిన్ 112

మ. అని యవ్వారవధూటు లిట్లు ఒమలో నన్యోన్య మెంతే వృథ
ర్య నిరూఢిన్ శపథంబులాడికొని యంతన్ ప్రేమతోడన్ సఖీ
జనక న్నిల్పియు దేవదేవి ముని నెచ్చున్ మోహితుం జేయఁగా
మనమం దొక్క యుపాయముం దలఁచి సమ్యక్చాతురీ యుక్తయై 118

దేవదేవి భక్తాంఘ్రిరేణువు పర్ణశాలకు వచ్చుట

సీ. వరహేమ భూషణ వ్రాతంబు లెడలించి
తులసీ మణీ మాలికలు ధరించి
తీరుగా మృగనాభి తిలకంబు పెట్టక
నవ్య సితోర్ధ్వ పుండ్రంబు దిద్ది
చీనాంబర శ్రేణులు విడవించి
ధాతుకాషాయ వస్త్రంబు గట్టి
శృంగార గాఢ విశేషముల్ దాలించి
హరినామ కీర్తనాయత్త యగుచు

తే.గీ. తనరు భక్తిని వైష్ణవదాస్యమునకు
నుచితమగు వేషము వహించి మఱియు నమ్ర
భావమును గల్గి నదియునై యతిమృదూక్తిఁ
దేనియల్ చిల్క వైరాగ్యమూని యగుచు 119

క. మునిపతిని సమీపంబున
కనుఁగొందఁగ నేఁగుదెంచి యతని యడుగులం
దను ప్రాలి యార్త దీనా
ననయై వగలొందు నంగనం గని కరుణన్ 120

తే.గీ. కులము గోత్రంబు జనసంబు దెలియ నడుగ
విప్రవర్యున కంతయు విన్నవించె
నతని మోహింపఁజేయఁగా నెంచి
కపట వేషంబుతోడ దా కింజ నయన 121

ఆ.వె. అంత నమ్మునీంద్రుఁ డయ్యింతి లాలించి
కరము ప్రీతిఁ దపసితా పసంబు
సేచనం బొనర్చి పెట్టుఁ బాదులు
సేయు మనుచు దాన్ని సేయుగాయును 122

తే.గీ. అంతవాన్ని మునివచనానురక్తి
నా శ్రమస్థం సమ్మార్జనాదికములు
నయు హరతాది శుశ్రూష లాచరించు
గ్రాంత యయ్యును విడువక సంతతంబు 123

క. ఆముని భుజించు పిదప ద
యామతి [1]నిజభుక్తశేషముగు నన్న మిడన్
నేమంబున భుజియించుచుఁ
గామిని వత్సరము నతనికడ సేవించెన్ 124

ఉ. అంత మునీంద్రుడు చిత్తము లవాంశమునైనఁ జలింపకున్న దా
కాంత కటియసంగతికి గాఢ నిరాశపహించి దుఃఖిత
స్వాంతమునం బునర్గమనవాంఛ యొనర్చుచు నుండె నాట్కగే
హాంతికసీమ కయ్యెడం దాక్క వింక్షితయౌచు నెంతయున్ 125

1 వు నిజశేష

ఉ. అప్పుడు రంగధర్త్రి కరుణాంబుధి దేవశిఖావతంస మా
కప్పురగంధి స్వప్నమునఁ గన్పడి యో చెలి యింతలోనె నీ
యిప్పుడు యీ ప్రతిజ్ఞ ఫలియింపఁగఁ గల్గుట సంశయంబు లే
దెప్పుడు నట్ల నిందు వసియింపుము ప్రీతి వహింపఁ జెప్పినన్ 126

క. అంతటను మేలుకొని య
య్యింతియు నా నాద్రిశౌరి హిత సూక్తులకున్
సంతసిలుచుఁ గైకొని కుం
భాంతరమున దాఁచియున్న యాభరణంబుఁ 127

క. మిసమిసమను నిగనిగలు గం
యనదృశమగు వతతు సుమము లంపదు మెలమిన్
బిసరుహలోచన యవయవ
విసరంబునకు భూషణములు వెస నుంచెన్ 128

సీ. కంతుని బాణసంగతి మీఱు పన్నుం
కతకల ఘనుచిత్రములు గలఁప
శరదిందుచంద్రికా సన్నిభమందహా
సంబు ప్రాణేశుకు మోదంబు గూర్పఁ
బాదంబు మెట్టిన పద్మంపుఁ దావిగా
నికరదంబంబు లెల్లాడఁ దొరఁగ
[1]మధురతఁ జిల్కుడు మాటలు గారికా
సమితికి వింతగాఁ జదువుఁ జెప్పఁ

1 మూ మధురంబు

తే.గీ. అంత దైవ వశమున నుదాత్తుఁడగుచు
నిదురమేల్కాని వాకిట నిలిచి సాంద్ర
కందరంబులఁ జీఁకటి గ్రమ్మికొనఁగ
నఖిల దిక్కులు పరికించు యవనిసురుఁడు 183

ఉ. అంతట వానచేఁ దడిసి యార్తి గడంగుచు వర్షశాలికా
ప్రాంత ధరాతలంబునను రంతులు రావిమహీజ మూల మ
త్యంతము తావుకొన్న కమలాయతలోచనఁ గాంచి [1]తాపిత
స్వాంతుఁడు చేసి లోపలికి నయ్యెడఁ దోకొని వచ్చె వేడుకన్ 184

దేవదేవికి ధర్మాంఘ్రిరేణువు వశుఁడగుట

సీ. ఆటమునందున కడుగుదెంచిన యప్పు
పానిసీరత్నంబు పాని చేరి
చలి నెపంబున మునిచంద్రు పాదంబుల
పట్టినే యొక వింత పలుకుఁజేసి
యంసినా రసుచుఁ దదంఘ్రులు దన తొడ
నిడుకొని యొత్తుచుఁ గడు నివురుచు
బ్రాహ్మణోత్తము నాడు పయ్యెద దడిసిన
దని ఆడియకరము నందుఁజేర్చి

తే.గీ. హావ భావాభినయమందు హాసరుచులు
గులుకఁ జిలిబిలి చిఱునల పలుకుఁ దేనెఁ
చిలుక నాగసులు దొలఁక వా కలికి వ్రిప
పుంగవుని మానసంబు గరఁగఁ జేయ 185

---

1 మూ. తాపిత

ధన మిప్పఁ డాల కిట మా
తినయను గిలలార రతి నుదారతఁ బెనఁగన్
జనదు పయిఁడిమ్ము లేకు
వ్న నిపుడు వేగమె నికేలన ౦ వెడలు మోగిన్, 141

క. అని యిట్లాడిన నాగ్రహ
మును వెడలి ద్విజాండు చింతవొదమిన మునితా
పను దాహ్య వేదికాంతర
ము స నధివసియించె దైన్యమున నా రాత్రిన్. 142

సీ. ఆ సమయంబున నఖిల లోకాధ్యక్షుఁ
డును భక్తవత్సలుండును దయాళుఁ
డుమ నను రంగేశుఁ డనుమోదమున జగ
జ్జననియౌ తన ప్రియసతినిఁ జూచి
నవ్వెన నక్తతి నాథుని హసనంబుఁ
గాంచి యిట్లనియె నా కమలం పాణి
స్వామి యూరకయ హాసముఁ జేయఁ బనియేమి
వివరింపు మనిన నా విభుఁడు పల్కు

తే గీ. సాంద్ర విజ్ఞాన పరుఁడు జితేంద్రియుండు
భవ్య వైరాగ్య పరుఁడు మద్భక్తుఁడైన
యిట్టి నక్తాంఘ్రిరేణుఁడ యొదను సర్వ
దీయమాయా వశంగత స్థితిఁ గలంగె 143

క. వెలఁదాతి కాంత వపువుం
వలఁగొని మోహమున దాని వాకిలి దైటన్
దలఁచిన చేరక మిఁదన్
నెంకొని యున్నాఁడు నేఁడు నిరతగంధీ 144

క. అతనిఁ గనుంగొని సచ్చరి
నతిగా యపుడేను నిన్ను నమ్మునిఁ గను మం
చితమతి యని వానూక్తులఁ
బటి చెప్పిన విని ప్రమోద భరితాంతరయై 145

తే.గీ. వారకాంతా గృహాంగణ వాటి యందు
వాలి విరహార్తి దీనుఁడై యున్నవాని
మునివరునిఁ గాంచి యా జగన్మోహిని గరుణఁ
బ్రాంజలి యొనర్చి హరిఁగూర్చి పలికె నిటుల 146

సీ. తనయుండు భవదీయమైన సత్కార్యంబుఁ
జేయు చుండెడి ధర్మశీల దనవు
విజితేంద్రియుఁ మునీంద్రుఁ వీతరాగుని ఘను
నేకాంత భక్తి దాస్యైక భోగి
కావున పాదపద్మసుధారసాస్వాద
దాయత్త చిత్తుఁడై యలరు నిట్టి
మానుషోత్తము ముని కామితుఁ జేయ నేటికిఁ
బంకరుహాక్ష కృపాపయోధి

ఆ. వె. వ్యక్తపరద ముద్దు లెన్ని యుండెడి నాదు
వాక్యమునను విప్రవర్య నిటులఁ
జేసితివి దయయుఁ జేకొను నా విధి
కర్థి దగుచు యమ్మహామహుండు 147

క. నీ మాయా జలధిఁ గడవ
నే మహాత్ములగు యోగు లెవరు దగుదు రీ
రాపురసకాండములు చిర
కామాదుల నైరంతశక్తి గలిగిన వారే 148

ఉ. తావక పాదనావఁ గొని తథ్యముగా భవదాశ్రితుల్ సదా
భావిత మైన మాయ యను వార్ధిఁ దరింతురు గాన సర్వర
క్షావహ నీదు భక్తు వలికల్పకు నీ మునివర్యుఁ బ్రేమచేఁ
బ్రోవుము దేవదేవ సురపూజిత విగ్రహ కల్మషాపహా 149

క. అని పలికెడు రసుయం దా
వనజ దళాక్షుండు లోకభర్త ప్రియముఁ జే
సి నిరుపమోక్తి వచించెన్
జనతర సంతోష వార్ధి గరలు కొనంగన్ 150

శ్రీరంగవిభుఁడు నారాయణమునికొఱకు దేవదేవికి రత్నదనకంబిచ్చుట

ఆ. వె. అకిప నేను చేయునన్న దంతయును వి
లాసమునకుఁ గాఁ దలంప వలయు
మహి మదేకభోగ్య మద్భక్తుఁడగు నిమ్మ
హాత్ముఁ బొంద దగము నవ్వదేమి 151

రంగేశుఁడు ప్రత్యక్షమై నారాయణమునిపై నిందను లోకాద్భుత

వ. అంతఁ బురాణపురుషోత్తముండును దిరస్కృత సింహీసూత కోమల శ్యామంతనుండును సుందరసితారవింద ప్రభాభాసుర లోచనుండును శతకోటి సూర్యబింబ భ్రాజమాన దివ్యతేజోవిరాజితుండును సంపూ ప్రభా సంయుక్త్రిదంబరారుణాంబరా పదాంబరుండును వికసితకోకనదభ్రాయా సమంచిత పంకజయుగళుండును శ్రీవత్స కౌస్తుభ విస్తుల వక్షస్థలుండును చందన చర్చితాంగుండును వైజయంతీ వనమాలాలంకృతుండును కోటీర హారకేయూర కంకణాంగదాది భూషణ భూషితుండును శంఖ చక్ర కౌమోదకీ నందక శార్ఙ్గ ప్రముఖాయుధ శోభితుండును సముత్తుంగ విహంగ పుంగవతురంగుండును సంభోగసంభవ సంపూర్ణాంబరి ప్రభృతి సురవిసర సేవితుండును జగత్పతియు నగు శ్రీరంగభర్త లక్ష్మీ సహితుండై యట ప్రాదుర్భవించి యా రాజుం గూర్చి యిట్లనియె 158

ఆ. ఈ మహామహుఁడు మామకభక్తుండు
పరమిదియందు నేను పూజ్యుఁ దనఁగఁ
బోల్చ నీ క్షేత్రమందు పూజనీయుం డగు
వస్తు దక్షుఁడై చింతనాత్ముఁ డగుట 159

క. [1]మాత్రర్ధము దాఁటితివ
పాత్ర మొనఁగి తిరిగి కొలువు బరమప్రీతిన్
ధాత్రీశ్వర యా పంక్తి
నెత్రులు నిరి మహిం దివ్య నియతిం గనుమీ 160

---

1 మూ మాత్రమునకు తల్లికి అనునర్థమువచ్చెను మాత్రర్థము అని దిద్దుకొనిన మాతృతల్లి కొఱ కను నర్థము పొసగును ఛందోభంగము నుండదు

తే.గీ. నన్నుఁ బాలించు మాత్రుని సంవరేణ్య
మ్రత్రియుం దగు నిధరామును సపర్య
ఏనుదినము సల్పి ఒగరిఁ బ్రఖ్యాతిఁగాంచి
భవ్యతర సంపదావాప్త వరుఁడ వగుమి 181

క. అని నృపునిఁ బల్కి యా మా
ని గరపంకజముచేం దివిరి యరసి హృ
ద్యానందమునఁ బ్రసోంతము
వనతాపుఁడు పక్ష్మతాన సాయుపొఁడై 182

## నృపాలుఁడు సంతుష్టుఁడై భక్తాంఘ్రిరేణువును గౌరవించుట

సీ. అంత నమ్మహిపాలుఁ డధిక సంతుష్టుఁడై
యా యోగి పద్య సమోసులావు
నాఁడోలికాంతరాధ్యాసీనుఁ గావించి
స్వర్ణయానంబుఁ బహించి సత్వరమున
[1]సత్సంత నిష్ఠాకమున్విరుంటుగను మం
గళతూర్య ఘోషసంఘంబులతోఁ దఁ
బట్టణం బేఁగించి భక్తితో దాతని
పదముఁ బూజించె న్నామతిని

తే.గీ. వవం బా విప్రవరుఁడు హృష్టాంతరంగుఁ
డగుచు శ్రీరంగనాథు ననంతశాయి
నంబుజాక్షుని గూర్చి దండంబు వెట్ట
వినతు లొనరించి యాలగర్విఖుని గనియె 183

---

1 మూ తనిష్ఠా

క. అనుదినము నీకొసఁగిన
ఘనతులసీ కుసుమ మాలికా కైంకర్యం
బున నే సంతుష్టుఁడ నై
విని సత్కృంతం బగాఁగ ధీరవరేణ్యా! 107

ఆ.వె. నీ కభీష్ట మిచ్చి నేఁడు కద్వరమును
నేఁడు నిత్తు నీకు విప్రవర!
యనిన రంగధూర్లాధిపు వాక్యంబు
విని నితాంత హర్షమున నతఁడు 108

భక్తాంఘ్రిరేణువు ప్రాబోధకీ గీతములతో వారిని స్తుతించుట

తే.గీ. శ్రీవధూనాథ భక్తాంఘ్రిరేణు వనెడు
పేర నత్యంబు సేయుము ప్రేమ నాకు
నిడియె పరమగు వరమగు నింతకన్న
నవ్యమును లేదు నేనని యాతఁ డనిన 109

సీ. ఆ దేవుఁ డాఁగాక యని యభీప్సిత వరం
బొసఁగిన నంత నయ్యోగివరుఁడు
భక్తాంఘ్రిరేణుండు పరితుష్ట చిత్తుఁడై
సామృతపదంబులై యతిశయమునఁ
తెలుఁగు[1] ప్రాబోధకీ శ్రీమాలికను పేరఁ
దనరు దివ్యప్రబంధము లనంత
వేదాన్వయ ప్రతిపాదకంబులు గాఁగఁ
గడు మనోహరములుగా గాన్పి

---

1 తిరుపళ్ళి యెళుచ్చి, తిరుమాలై

పంచచామరము

రమా ముఖాంబుజాత మిత్ర రామతీర్థ విగ్రహా
శమాది షట్క సంపదార్య సారమానసాంతరా
యమేయ ధామ దివ్యనామ మాత్రతామసద్రుమా
క్షమా సఖీ విపద్విదారి సర్వరక్షకా హరీ 174

గద్య. [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష లక్షణాబ్ధ పాండిత్య ధురా సవరకాచలీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ స్వనమర్థభాగ్యత పటహ ధణంధణారవ విసరీత పతనక్రియా ఝల్లరికాది దుందుభి ధ్వాన కోలాహల హాహాముద్ధవాంత కనకదండాభ్రర హార కలి కృతసందీపిత ప్రతాప కీర్తి ప్రతాప కోసలమం పయః పారావార రాకాసుధాకర సౌందర్య శీత కుసుమ సాయక బహిరి పామనాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబు నందు మునివా ల ఒననంటున వతంయు కావేరీ తటంబునందు మనోహ రంబుగా గానంబు సేయుచుండు లక్ష్మీదాశిబు సనంతను రంగభర్త యువిహాచు రప్పించి సాయుజ్యం బొసంగుటయు భక్తాంఘ్రిరేణు కామ్యం బును వమ్మహాత్ముని గాత్రరాగ్యంబును లక్ష్మీనారాయణ సంవాదంబును నారాయణానుమతంబునం జేసి వేశ్యకుంబునందు దేవదేవి యుద్భ వించుటయు దేవిదేవి నారాయణమునితో రమించుటయు శ్రీ రంగవిభుండు నారాయణమునికొలకు దేవదేవికి రత్నకవచం బిచ్చుటయు ముని నిందాపహరణంబును హరిస్తోత్రంబును నన్నది పంచమాశ్వాసము సంపూర్ణము

---

1 మూ ఇతి

# భార్గవ పురాణము

## షష్ఠాశ్వాసము

క. శ్రీనీళా మహిళా హృద
యానంద విధాయి పన్నగాధిపశాయీ
మానిత వాగీశగిరి శౌ
రీ నిరుపమ సురపురీ గోపాలా. 1

వ. అవధరింపుము సకల గుణనికర ప్రజ్ఞాధురంధరుం డగు వరుండు
నారాయణున కిట్లనియె 2

సీ. పుణ్యాంబు నిధము సంపూర్ణంబు నగు హరి
భక్తాంఘ్రిరేణువి భవ్య కథయు
నానతిచ్చితి వె మహాత్మ పరమ పదా
వాపాపహార ముద్భాసిగాను
ప్రకటింపుచుండ మోక్షదములౌ విష్ణుని
లాంఛ సర్వజ్ఞులు కలిని కలుష
హరంబులగు చరిత్ర లత్యంత ముదమున
వింటిని నీవు విందుగాగ

తే.గీ. లోక గురుండవు సద్వృత్తలోక సముద
యతులిత జ్ఞాన నిశ్చలాయత్తమతివి
నిర్జరనుతాంఘ్రి కమలుండ పూర్ణకామ్యుఁ
డవు చిరంతన మునినాథ భవవిభేద 3

క. అని నరుఁడు పల్కు వాక్యము
విని ధర్మపరాయణుండు వివిధ నిగమ సం
మనిరూఢుఁడు నారాయణుఁ
డనఘుండు వచించె నిస్తులానందుండై 4

తే.గీ. విష్ణు వందు[1] వ్యస్తమౌ వృత్తిగల్గి
కలన లోకంబునందుఁ బ్రఖ్యాతిఁగాంచె
విష్ణుచిత్తుం డనెడు పేర విమల మతిని
నిఖిల ధర్మంబ యంచు నిర్దేశ యగుచు 5

క. హరిసర్వస్థిరుండును
ధరణీసురుఁ డిలఁ గాత్రతతు లాగమముల్
పురహరునివలన నెఱపెన్
వారి మహాత్మ్యంబు దక్క భూస్థలమందున్ 6

క. హరి కరుణఁజేసి యతులం
బరుదగు నైశ్వర్య మిందు ననువందుచుఁ దాఁ
బరమ పదముఁ బ్రాపించెన్
స్థిరతరమతి నంతిముందు శ్రీపతిపద్మఁ దాగెన్ 7

క. వినుము నర యొక్క చరిత్రం
బును గలిగిన వాఁడ నగుచుఁ బుణ్యం బగు వి
మ్మునివర్య విష్ణుచిత్తుని
ననుపమ సూక్తిని వచింతు నాహ్లాదముగన్ 8

1 మూ ం

విష్ణుచిత్తుఁడు గరుడారూఢుఁడై చనించుట

క. ఆవారణము హైమ వార్క్షి ని
వహములు సహకారవన నివాసి ంతరవా
సవాములు మహా౯ం ంతై
మహియెం దలరారు పాండ్యమండలమందున్ 9

మ. అరవిందోత్పల పుంజ మందిర మిళిందానంద పద్మాకరో
త్కరమై యావరణంబు శృంగములఁ బ్రఖ్యాతంబుగా బ్రాలి వి
స్ఫురణంగాంచు సమస్తతార నిచయంబుల్ రేలు తద్వప్ర ర
[1]త్నరుచుల్గా ఁగనస్థలిం దవరు నీ ధన్యపురం బున్నదిన్ 10

సీ. ఏ వీటఁగల్గు నవీన రత్నాంచిత
సౌధంబు ౯ంగేకి స్థాన మయ్యె
నే యూరఁగల గభీరాయత [2]ఖేయంబు
పాతాళ సతుఁ వో పదము నయ్యె
నె ప్రాంతసాలంబొందు నింతుం జెలువంబు
లచ్చరపాటుం హెచ్చు లడిపె
నె పురిఁ బ్రాపించు గోపురపాళులు
గోపురి తేపగు దావ లయ్యె

తే.గీ. ధర్మసౌధ వృతా పరిభ్రాజమాన
బంధుర ఎతాకికా సమూర్ప్రద్యమాన
పగన చలిత ఘనాఘన భావ్యమాన
విస్తు తౌన్నలఁ భరము ధన్యీపురంబు 11

1 మూ ర్త్న 2 మూ ఖ్రే

క. దివ్యంబై సకలజన
స్తవ్యంబై భవ్యమగుచు స్వర్గోపమమై
శ్రావ్యంబై వైష్ణవ గణ
సేవ్యంబై ధర్మపురము చెలువొందు మహిన్ 12

క. ఆ పురమున దీపింతున్
శ్రీపతి వటపత్రశాయి శ్రీరి ఘన మూర్తి
ప్రాపకుఁడు సంతలోక
వ్యాపకుఁ డఖిలామరర్షి వరసేవితుఁడై 13

సీ. వేద వేదాంగ సంవిజ్ఞానపారగులు
ధ్యాన పారాయణ తత్పరులును
స్నాన సంధ్యాద్యనుష్ఠాన నిష్ఠా గరి
ష్ఠ ప్రతిష్ఠా జ్ఞాన సంయుతులును
సకల స్మృతీతిహాస పురాణ శాస్త్రాలి
చయ వాక్యార్థ విచక్షణులును
సమలోష్ట కాంచనాశ్మమణి ప్రసక్త వై
రాగ్య వార్ధైక విరాజులును

తే.గీ. అహరహము యజ్ఞశీలురై[1] యఖిల భాగ
వత సమర్చనావర్యులఁ బరగుచుంద
రందు శతసంఖ్యలాగను సహస్రసంఖ్య
లగను హరిభక్తులగు ద్విజులే [2]దగుచుమంత 14

1 మూ రే 2 మూ దగుదురందు

## విష్ణుచిత్తుఁడు స్వామికిఁ బుష్పమాలికా కైంకర్యము సేయుట

ఆ.వె. ఆతఁడు విష్ణుచిత్తుఁడను నామము వహించి
జనము భట్టనాథుఁడని వచింప
సమరసంబు విష్ణునందుఁ జిత్తము వ్రాల
యెపుడు నితరవృత్తి నెఱుఁగకుండు 18

సీ. పరిమళం బలర దిగ్భాగంబుఁ బర్వఁగా
దివ్యంబులైన ధూపములచేత
సుజన కంచయ రమ స్త్రీమంబు డాలింపఁ
బ్రబలిన యుక్తి దీపములచేత
సురుచిర శాల్యన్న సూపాజ్య భక్ష్యాది
షడ్రస నైవేద్య సమితిచేత
హరికిఁ జిత్తంబునం దానందము నావర్వ
నమరిన నృత్తగీతములచేఁ

తే.గీ. సుప్రదక్షిణ వందన స్తుతులచేత
భవన మార్జన [1]సాధ లేపములచేత
నవ్యకరదీపికారోపణములచేత
విష్ణు నారాధనము చేయు విప్రవరుఁడు 19

వ. వెండియు నతండు సార్థంబులగు దీర్ఘయానంబు విశాలంబులగు కల రంబులను నికర[2]సాధితంబులగు తులసీ వనమాలికాదులను దదృత్తి సముపార్జిత ప్రకారంబులగు చతుర్విధాద్యాలంకారంబులను హరిం దృష్టిం జేసి యంతటం గుసుమపరిపూరిత మహీరుహంబులను దుస్సిద్రుమంబు

1 మూ. శోధ 2 మూ. పా

లను బరిరంభించు వరంబు గావించి దానికిన్ జలసేచనం బొనరింపుచు
విద్రుత మాలికా ధారణంబులను దీక్షితావరణంబులను శ్రీవైష్ణవ పూజా
చరణంబులను ననవరతంబు సమాహితుఁడై యుండె నంత 20

సీ. విరతియు నింద్రియ నిగ్రహంబునఁ జేసి
 మరహరి పరిచర్య ముఖ్య మనుచు
భావించిన నెఱింగి భట్టనాథుఁడు బహు
 చేష్టాకరణముల స్థిరము గాంచు
కైంకర్యమును నమస్కారముగాఁ జేయుచు
 బలిమి త్రివర్గంబులను దొలంగి
శేషశేషిత్వ విశేష విజ్ఞాన సం
 చిత భగవద్ధ్యాన్య జీవముఁడుగ

తే.గీ. దాని [1]దాస్యక్రియోపాయ దానమునను
హరిని లోకాధిపతిని సమాశ్రయించి
యమ్మహామూర్తియందు సన్న్యస్తభరము
నెనసి తత్త్వనివేశిత హృదయుఁ డగుచు 21

తే.గీ. నిరత మాత్మభరణమున నిర్భయుఁడుగ
నిర్భరుఁడుగ దృఢవ్రత నిశ్చయుఁడుగ
సమయ మిట్టులఁ గడపుచు సరసిజాక్ష
సేవ యందుఁ బరాయణస్థితిఁ గడంగి 22

---

1 మూ దానపా

మ. సరసత్వంబున యోగివర్యుఁడు మహేంద్రారాధనసంతుష్టుఁడై
హరి పాదాబ్జ మరందపాన మధుపాయత్తాత్ముఁడై యందు వ
ర్తతి ధీయం బగు పాండ్యరాజ మధురాస్థానంబుఁ బాలింపుచున్
ధర వర్తిల్లను గీర్తిసంపదం బత్యుత్తముండై వేడుకన్ 23

## పాండ్యధరావరు వర్ణనము

సీ. ధర్మ విఖ్యాతుండు [1]తత్త్వశిక్షాస్వా
తత్త్వజ్ఞ సేవన తత్పరుండు
ప్రాలేయగిరి సీమ పర్యంత కీర్తి రం
గా వ్యాపకస్ఫూర్తిఁ దనరువాఁడు
సంతత షడ్గుణైశ్వర్య సంపన్న ప్ర
భావ మహత్త్వ విభ్రాజితుండు
సకల భూత దయారస ప్రాభవ స్ఫూర్తి
నిజకటాక్షమున గణించు విభుఁడు

తే.గీ. గరిమఁ గలదైన బలిశిలోంతని మనుండు
దుస్తరారి వితానంబు ద్రుంచు వీరుఁ
డఖిలలోక ప్రసిద్ధ విద్యాధనుండు
రాజ మాత్రుండె పాండ్యధరావరుండు 24

తే.గీ. శ్రితిని దత్త్వ సుఖాకాంక్షఁ జేసి తత్త్వ
విదులఁ బాలింపుచును బ్రతిపి పరుండు
దనరు నవ్వుడు దీక్ష యాత్రావరుండు
భూసురాగ్రణి యొక్కఁడు బుధ్యతముఁడు 25

---

1 మూ తత్త్వశిక్షానందు

తే.గీ. నేను యత్నంబుఁ జేసెద నిపుణమతిఁ బ
రార్థ మైన యైహిక సుఖంబు వ్యర్థమగుట
సాధనం బొనరించెద శాశ్వత మగు
బ్రహ్మపదపు బ్రహ్మాది దుర్లభపు సుఖము 81

క. ఇహపరరహిత కాముఁడవై
మహిఁ దనరిన యట్టి నిన్ను మాకు గురుఁడ వౌ
మహితాత్మ పలుకుము కథా
మహితమపాయంబు నేరువటుల సమయముగాన్ 82

క. అని యిట్లు పలుకు భూమీ
శుని వాక్యము విని ద్విజుండు సుగుణాంచితుఁ డం
తనఁ బ్రతి వాక్యము నుడివెను
మనమున సంతోష మంది మహితప్రౌఢిన్ 83

తే.గీ. అవనిపాలక యీ సమయంబునందు
నీకు నీ బుద్ధి యుదితంబుగా నెగడుఁ గాని
నిందు జనియించు పురుషుల కెట్టి మఱియుఁ
గాదు నేరదు విజ్ఞానమును దలంప 84

సీ. నిగమాంత విజ్ఞాన నిపుణులందే సుసా
ధనముఁ జేయఁబడిన మనుని విధునిఁ
బరుని దైవతము సుపాసించి దుర్లభ
[1]యగు ముక్తిఁ జెందు నీ వనఘ యనఁడు

---

1 మా. యముక్తి

దా మహాత్మునిఁ గూర్చి యాగాన మతియుఁ గృ
తాంజలి యగుచు సాష్టాంగ వినతి
గావించి పల్కె నో కరుణాపయోనిధీ
వేదాంత వేత్తలే విమలుఁ గూర్చి

తే గీ ధ్యాన మొనరింతు రఖిలాగమాంతవేద్యుఁ
[1](డాది మధ్యాంతరహితుం డనంతుఁ డెవ్వ)
డే మహాముఁడు పరాపరేశ్వరుఁడు పు
రాణ పురుషోత్తముఁ డెవండు రమ్య చరిత 95

తే గీ సరవి నెవ్వని భ్రూవిలాసమునఁ జేసి
సరసిజ భవాండభాండములు దిరుగుచుండు
డెవ్వఁ డెవ్వాఁడు ఎకం సుధీమతుండు
సంతతాహ్లాదయుతుఁడు ప్రజ్ఞాన ఘనుఁడు 96

క సంసిద్ధవ రుద్రార్క్యమ
సరసిజరిపు శక్రవహ్ని సమయ సమీరా
ద్యమర నిర్జరులు తన్నియముఁ
గర మెవ్వని యాజ్ఞ వశగులగా వర్తింతున్ 97

తే గీ ఎవఁడు పరతత్త్వ మనుపేర నెసఁగువాఁడు
నిత్యుఁ డీశ్వరుఁ డెవ్వాఁడు నిగమపారుఁ
డెవనిఁ దెంచి జనులు పాప మెనయకుండు
రమ్మహాత్మునిఁ బల్కె నిశ్చయముఁ జేసి 98

---

1 మూ ఈ పాదము లేదు

పాండ్యధరావరుఁడు తత్త్వనిశ్చయమునకై యుత్కంఠఁ గట్టుట

క. అని విని పలుమా ఱాలో
చనఁ జేసి ద్విజులఁ బిల్చి సంపదగుంటాఁ
డనఘుండు విష్ణుదేవుం
డనుపొందుట నిందు సంశయము లేదనుచున్ 39

సీ. అమ్మహాత్ముఁడు పరంబైన తత్త్వంబు నా
మ్నాధిపుఁ డఖిల లోకాధినాథుఁ
డందురు తాత్త్వికంబగు పదంబని కొంద
ఱట్లు దత్పుత్రపౌత్రాది జనము
వది నిమిత్తముఁ జేసి యవనిస్థంబు గల్గు
మహావేదవేదాంత పారగులను
రావించి తత్సమస్తావనీసురులచే
నెద్ది సత్యత నిశ్చయింపఁబడును

తే.గీ. నట్టి తత్త్వంబు నీవు సమాశ్రయించి
భక్తిఁ గైకొని సాధింపు పరమ పదము
ననిన మతిమంతుఁ డగు విభుఁ డధిక ముదము
నలరెడు పురోహితుని వాక్య మాలకించి 40

చ. అంత వసంత సంభ్రమం గం యట్ట ధవం బనుపొందు పక్కము
ల్కలమలి యైన యా నృపతి పర్యాయదు సుమ్మత తోపఱం బసం
డుంఁ గంయంగఁ గట్టి పరితోషకుఁడై జగతీతలం బనన్
గం నిగమార్థ కోవిదనికాయమునన్ గుతియించి యుక్తితోన్ 41

క ఘనులార (¹రెండు తత్త్వం)
యను నిశ్చయముగ నొసర్చి భువి నీ పల్కం
బును గొమరని చాటింపం
బనిచె సకలంక మౌని నృపాలుఁడు ప్రమునన్ 42

తె గీ అంత నది విని వేదవేదాంతవేత్త
లైన భూసురు లంద ఱత్యాదరమున
శతసహస్రాధికములగు (²సంఖ్యలొప్ప
రమ్య) తరమైన మధురాపురముఁ జేరి 43

వ అందు రాజసభాభవనముఁ బ్రవేశించి యా క్షితిపతి చేతం బ్రపూజితులై తమతమ సిద్ధాంత వ్యక్తులం జేసి పరస్పరముగా సంవాదముఁ జేసి రట్లు వారివిధ ³(శాస్త్రవాదం) బొనర్చుచు బ్రాహ్మణోత్తము లవియ పరంబగు తత్త్వంబని నిర్ణయింపకుండుటం జేసి యమ్మహీపాలుండు నం యాత్మం దైన్యయుండె నా మహాభాగ మహోత్కృష్టయుత ప్రమంతం బను నగు భార్గవపురాణోత్తర ఖండంబు నందలి చతుర్వింశతి తమాధ్యాయంబు భక్తిపరాయణుండగు నారాయణుండు నయనకుం జెప్పి వెండియు నిట్లనియె 44

వటపత్రశాయి విష్ణుభక్తుని మాంధాతరాజు వద్ద కరుగు మని
ప్రోత్సహించుట

సీ అప్పుడు ధన్వి పురాధీశ్వరుఁడు హా⁴[రి]
వటపత్రశాయి శ్రీ⁵(వా)మమందు
రమణీయ గుణ సదారాధన తత్పరు
విమల మనీషిని విష్ణుభక్తు

1 మూ లేదు 2 మూ లేదు 3 మూ లేదు
4 మూ లేదు 5 మూ లేదు

యోగివర్యుని( గాంచి యోగి విలాసార్థమై
కృపదేల నా జగదీశు( డనియెం(
దాంధ్రభూపాలు నత్తకు( డోయి బ్రాహ్మణ
పుంగవుం డా నీవు పూర్ణ మతిని

తే గీ. రహిని మహాప్రియోక్తుల నుత్పరత్వ తత్త్వ
మును బ్రశంసించ( జేసి ప్రమోదమునను
దల్కుమ గ్రహింపు మనుచు విష్ణ్వార్తి నెల్లు
నయతరోక్తిని దిండిరానాథు( డనగ 45

క. కరము( బ్రియవృత్తియై భూ
సురు(డు కరంబులు మోడ్చి సురనుతు(డౌ యా
హరికోటకు విన్నవించెను
గురుతరముగ దనకు మదిని గోర్కె యనంగాన్ 46

సీ. స్వామి శ్రీప్రాసాద సమ్మార్జనమొ కాక
యభిషేక జల ఘటాద్యాహరణమొ
మధుర సౌరభవనమాలికా కరణమో
సౌవర్ణ పల్యంకికావరణమొ
గరుడభూషిత పతాకాపరిగ్రహణమో
ధర్మ రత్నకర్పూరాక ప్రవృత్తియొ
దివ్యమంగళ కరదీపికారోపమో
తత సిలప్యజనాది ధారణంబొ

1 మా. లేదు 2 మూ. మత్పరత్వంబు

సీ. యోగీంద్ర నాకుం యూహింప నిదియె మ
 హాద్భుత గైకొను మిప్పు డతిశయముగ
సర్వాగమంబులు శాస్త్రంబులును నీ కా
 సంగెద భూసుర సంతసమున
దావక మానస తామరసంబున
 వారాధి [1]నుండి భయంబు నిత్తు
నీ కులంబున నీ వేగము శ్రీమతం
 గైకొని పాండ్యభూపాలుం సభకు

తే.గీ. నేను నీ యెడ నీవెంట నేఁగుదెంతు
గోవు వత్సంబును గుఱించి పోవు పగిది
నమచు వటుపత్రశాయి యట్లాడి నపుడు
విష్ణుచిత్తుండు సంతోష వివశుఁ డగుచు 52

విష్ణుచిత్తుఁడు మొదట నిరాకరించినను స్వామి ప్రోద్బలమునఁ
పాండ్యరాజు సభలో వాదించుట కంగీకరించుట

తే.గీ. అమ్మతునిఁ గూర్చి ఓన్నమ యని ద్విజుండు
రమ్యతరమైన మధురాపురంబుఁ గూర్చి
వచ్చిదో మధ్యమున వేగవతిని దాఁటి
రహిఁ బ్రవేశించెఁ బాండ్యేశు రాజధాని 53

క. ఆలి విద్వజ్జన కోలా
హలం యగు నారాజ సభ క[2]యత్నమతి న్ని
శ్చలుఁ డగుచు సంతరాత్మన్
వెలయఁగ నిశ్చింతముగఁ బ్రవిష్టుం డగుచున్ 54

---

1 మూ నూడి 2 మూ [illegible] 3 మూ లక,

క. ధరణీశ్వరుఁ డా మనునకు
ముదమునఁ బ్రణమిల్లి కేలుమోడ్చి వినయుఁడై
కరము సపురోహితుండై
స్థిరసూక్తి వచించెఁ దత్త్వవిజ్ఞానుండై 58

తే.గీ. మహిత నిగమార్థ విద్యార మౌనివర్య
భక్తవత్సల సంతత భవ్యచరిత
దివ్యమతి పరతత్త్వమౌ దేవుఁ డెవ్వఁ
డమరవంద్యుఁడు మూఁడు వేదముల యందు. 59

### విష్ణుచిత్తుఁడు పాండ్యరాజు సభలో నారాయణపరతత్త్వమును చాటుట

క. అను దద్వాక్యము వినుం
విని విప్రవరుండు హృదయ విమలాంబుజ నా
సుని శ్రీధరుని జగత్పతి
వినుతించి వచించె లోకవిభు సత్కృతునిన్ 60

క. నారాయణు పరము పరుఁడు
నారాయణుఁ డవ్యయుండు నారాయణుఁడా
నారాయణుండు పరముఁడు
నారాయణుం బరుఁడు ధాత్రి నానార్థములన్ 61

---

1 మూ. సు

క. ఆరూఢిఁ బరబ్రహ్మము
నారాయణుఁ డవ్యయుండు నాతఁడు భవ్యా
కారుఁడు తత్త్వము పరమో
దారుఁడు దేవాదిదేవుఁ డమృతప్రదుఁడౌ ౬౨

తే.గీ. ఇతని నామంబు సంతతం బతిశయంబు
దనరి జీవతతులకుఁ బ్రధానము నగు
హేతు వంతర్బహి[1]స్ఫురద్దై యేఁపు మీఱ
యంతటను నిండి యుండు నారాయణుండు ౬౩

తే.గీ. అతఁడె విశ్వంబునకుఁ బతి యాత్మ విభుఁడు
సర్వశేషియుఁ బరమాత్మ సర్వగతుఁడు
వహ్ని నేత్రుండు సర్వజ్ఞుఁ డవ్యయుండు
సర్వగుఁడు సర్వవిభవుండు సర్వమయుఁడు ౬౪

సీ. ఒక్క విభుండు విలక్షణుం డాద్యంత
రహితుండు శాశ్వతుఁ డహిశయుండు
పురుషోత్తముఁడు గుణపూర్ణుఁ డనంతుఁ డా
తఁడు పరమంబగుఁ దత్త్వ మరయ
సత్యంబు సత్యంబు సంశయంబును లేదు
నారాయణునికంటె వేఱు గాంచ
పరమగు దైవం బభావంబు భావంబు
విశ్వంభరాధీశ విప్రవర్య

---

1 మూ స్ఫుర్రై

ఆ వె యిరియ యిటియఁజూడ వెంచి సర్వంబు నే
ర్పంబు గాఁగ నే నుదారసూక్తిఁ
బలికినాఁడ ననుచుఁ బరమవ్రతుం డిట్టు
హరి గుణించి ముదుపు నవసరమున 65

## పాండ్యరాజు సభలోఁ గట్టిన శుల్కము తెగిపడుట

క లలితమతి విష్ణుచిత్తుఁడు
పలికినదొ పలికియుండఁ బరఁగి సువర్ణో
జ్జ్వల శుల్కము తెగిపడుటయు
నల పుష్పల వృష్టి గురిసె నాకమున పయిన్ 66

మ దివి సురదుందుభుల్ మొరసె దివ్యసతుల్ నటియించి రప్పుడున్
భువిని సమస్త మానవులు భూషణఁ జేసిరి సర్వదేవతా
వివహమునన్న శ్రీధరుఁడు నీరజనాభుఁడు లోకపాలకుం
డవిరళముత్రి యెక్కఁడని యానఘుఁ బెక్కు సుదాత్తవృత్తిన్ 67

## పాండ్యరాజు విష్ణుచిత్తుని సమ్మానించుట

తే గీ అప్పు డారాజు నిస్తులాహ్లాద నిర్భ
రుం డగుచుఁ దచ్చరణ పంకరుహములందు
నాగరిక భక్తిఁజేసి సాష్టాంగ [1]మెఱఁగి
యతిశయస్తోత్రములఁ గొనియాడి మఱియు 68

వ మహోజ్జ్వలంబు లగు భూషణ వస్త్ర గంధ పుష్పమాలికాదులచేత మునీశ్వరు నలంకృతుంగావించి యౌపవాహ్యంబగు మదనాగంబునం దధిరోహణంబుఁ జేయించి సముత్తుంగ మంగళతూర్య ఘోష సహితంబుగాఁ బురరంగ బలంబులతోఁగూడఁ బరిపర్యటనం బొనరించునప్పుడు సర్వేశ్వరుండును

1 మా. దిగి

కోటికందర్పసుందరుండును మహానుభావుండునగు శ్రీవిష్ణుదేవుండు లక్ష్మీ సహితుండగుచుఁ బ్రదయాకరుండగు పతగేంద్రు నారోహించి పద్మభవ భవేంద్రాది సురముని పరి[1]వృతుండగుచుఁ దక్షణంబున గజస్కంధాధి రూఢుండగు నమ్మునిఁ గనుంగొనుట కివృగింపుచు మహాభాగవతాగ్రభా గంబు నందలి యంతరిక్షంబునందు ప్రాదుర్భవించిన సద్దేవుం గాంచి భక్తి సుహృష్ట హృదయుండగుచుఁ దదీయసౌందర్యామృతంబు గ్రోలి తన్మయా కృతచేతస్కుండగుచు నీరజాక్షుని దైవత సౌందర్యాతిశయ వేషంబులకు దృష్టిదోషంబయ్యెదునని చింతింపుచుఁ దన్నిరాసార్థంబుగా నతని మంగళాశాసనంబుఁ జేయుటకై యుద్యుక్తమంతు డగుచు గళగండంబు నందుఁ దారంబు గావించి యానంద సంభృతుండగుచు సామగానస్వరంబు నంజేసి యిట్లనియె ౬౯

## విష్ణుచిత్తుఁ డొనరించిన మంగళాశాసనము

సీ. మంగళం బచ్యుత మధుకైటభ విదారి
మంగళం బీశ్వర మదన జనక
మంగళం బంతరాత్మక లోకనాయక
మంగళంబు రమానుషంగ పక్ష
మంగళం బాశ్రితోత్తుంగ మూర్తిప్రద
మంగళం బబ్జ భవామరమతాంగ
మంగళంబు సుపర్వమందార సమరూప
మంగళం బఖిలాంతరంగ నిలయ

తే. మంగళంబు మహాపాపభంగ చరిత
మంగళంబు సువర్ణపతంగ గమన
మంగళంబు దయారసాపాంగ విభవ
మంగళము దైత్యనాశ పతంగవాహ 70

---

1 ము. ప్ర 2 మూ. హ

ఆ వె అనుచు నిట్టు పలుకు నధికసంతుష్టుఁడై
కరుణచేత నతనిఁ గాంచి శౌరి
యాత్మ పద్మ కర్ణికాగ్ర స్థలంబున
దానిఁ జేసె భక్తవత్సలుండు 76

విష్ణుచిత్తుఁడు మహావైభవముతో ధన్విపురముఁ జేరుట

తే గీ అంత బహువస్తువులఁ జేసి యధిపుచేతఁ
బూజితుండయి యమ్ముని పుంగవుండు
తదనుమతిఁ గొని వేడ్కచే ధన్విపురముఁ
జేరెఁ బరివృతుఁ డగుచు సుదారలీల 77

క పురమును నందము చూచి
సుర వైభవ మాలకించి సుస్థిర మతుఁడై
పురవర మమలాకృతి గని
హరి నాతని సేవఁ జేయఁ బురి వెడలి రాగన్ 78

క ఆ పురజన పూజితుఁడై
యాపృథ్వీసురుఁడు గజ సమారూఢ గతిన్
దీపింపఁ జొచ్చె నాపుర
మేపున భగవద్దయానమేత హృదయుఁడై 79

తే గీ శార్ఙ్గ ధన్వాది పదయుక్తమాయి యుండి
దనరఁ బ్రవేశించి యమ్మునిరాయఁ డర్హ
యుని బరంధాము సద్భక్త సర్వరక్షుఁ
గూర్చి ప్రణమిల్లి తనమది గోర్కు లలర 80

వ. అంత సత్యాంబిరానాథునకు భట్టనాథుండు తదాసీతంబగు ధనంబును
బ్రాకారంబగు హస్త్యంబరంబును సమర్పించి యథాప్రకారంబున
దత్తైంకర్య ప్రతుండునుం దదారాధనాపరుండునునై యుండెనని మహా
యోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవపురాణోత్తర
ఖండంబు నందలి పంచవింశాధ్యాయంబు భక్తపరాయణంబగు నారాయ
ణుండు సనకునకు వెల్లడించి వెండియు నిట్లనియె ౮౧

తే.గీ. ఇట్లు కైంకర్య పరుఁడై యెసఁగు విష్ణు
చిత్తుఁడు హరి ప్రియుండు ధీసత యతండు
ననుదినం బింద్రియ కృతార్థతను దలంగి
ధాత్రిఁ గృత కృత్యుఁడగుచు నుదార కీర్తి ౮౨

తే.గీ. కంధిశాయికా నవ్యగానపు కర్మ
మునను బెంచిండి యాత్మీయమునగు గరిమ
మూలఁ గృతార్థతఁ జేయఁగాఁ దలఁచి యచ్యు
తాంఘ్రి పంకేరుహధ్యానమున రగుచు నుండి ౮౩

విష్ణుచిత్తునకుఁ దులసీవనంబున భూదేవి గదాస్వరూపంబునఁ
గన్యకయై కాన్పించుట

చ. స్థిరమతి నొక్కనాం డతఁ డులసీవన సీమకు నేఁగి యందు ని
ర్భరతర భూమియున్ రుచివిభాసిత విస్ఫురణంబుతో ధరా
పరమపువన్ ఘటింపఁ దనివారఁగ మతిన్ హృదయాబ్జపీఠికాం
తరమున శౌరి మూర్తి విదితస్థితిఁ గాంచుచు పల్లెన్ భువిన్ ౮౪

తే.గీ. సాల మూలంబునం దతఁ డాలవాల
ములు రచింపుచు నానామములు వ్యక్తియ
పుత్రకుని మాడ్కిఁ గ్రైకొని పోషణంబు
సల్పు చందము వసియించె నంతనమున ౮౫

## విష్ణుచిత్తుఁ డా కన్యను గృహంబునకుఁ గొని చని భార్యా సహితుఁడై పోషించుట

తే.గీ. ఈ కుమారిక గుణశాలి నీవు కరుణఁ
బోషణము చేయు మనఘ సంపూర్ణ మగుచు
దివ్యమగు పరమస్థాన మవ్యయంబుఁ
జెందగల ముక్తి నిఖిల సంసిద్ధి గలిగి ౯౭

క. అని పన్నాడిన వాక్యము
విని సంతోషంబుఁ జెంది విప్రేంద్రుం డా
త్మ నిశాంతముఁ జేరి ముదం
బున కథయగు పుత్రిఁ దనదు పొలఁతి కొసంగెన్. ౯౮

తే.గీ. ఇంత నా సతి వృత్తాంత మవనిసురుఁడు
పల్కుచో నప్పయోజాస్య పద్మ పగిదిఁ
దనరు పద్మాక్షి యగునట్టి తనయ పోష
ణంబు గావించెఁ బరమ హర్షంబు జెంది ౯౯

తే.గీ. సుతని గోదాభిధానంబుఁ జేసెఁ దండ్రి
యప్పయోజాస్య యతులితాహ్లాద చిత్తుఁ
డగుచు నాలేమ సంవర్ధితాంగ యగుచు
రూపలావణ్యగుణ్యానురూధి మించె 100

## గోదాదేవీసౌందర్య వర్ణనము

క. విమలరుచి పూత వానన
కమలము చనుకట్టులు ప్రకాశించె మహో
ద్యమమయ్యెఁ గుంతలాళులు
రమణికి యౌవన మనియెడు రవి యుదయింపన్ 101

ఉ వెన్నెల కాఁతకున్ మరుని వేదనకున్ మలయంపు గాలికిన్
గన్నియ చిత్తమందుఁ బరితాపము నొందుచు రంగనాయకున్
బన్నగశాయి కీర్తన మహారస సామృత మాధురీ ధురీం
బన్నెడు గానము[1]ంగొని సహిష్ణుత నల్పి సుదంతి తోర్వఁగన్ 113

క ఆటలఁ బాటల మాటల
నేటులఁ బరిపాటిఁ జేసి నీరజనేత్రం
దోఁచి గానియాడుచును దన
తోడి సఖుల కరవి మహిత దొరకొని పలుకున్ 114

తే గీ అమిత సౌశీల్య ముఖ్య గుణాఢ్యయగుచు
[2]యౌవన వారంధ విగ్రహమైన యామె
నిరత మాధుర తర మధురములైన
[3]హరి గుణము లెన్ను జరకుని తరణి ధరణి 115

మ సరసీజాక్షునియందు లీనతరమౌ స్వాంతంబు రంజిల్లి యా
యరవిందాయతనేత్ర హర్ష పరిపూర్ణాక్షియై తద్గతో
త్కరమౌ గానము చేయుచున్ హృదయ పద్మంబందుఁ దన్మూర్తి నిసు
స్థిరవృత్తిన్ దిసియింపుచున్ సతత మక్కాం ప్రమావాద్యయౌ 116

---

1 మూ. మనం 2 మూ. యవ్వ 3 మూ. హరి కథగుణ

క. ఆరామ చంద్రికతో వన
మారాధిం జేరి పుష్పవలి సంఖ్యలుగాఁ
గూరిమిఁ [1]గాని నిరతంబు మ
రారినిఁ బూజించు విష్ణులాయత మతియై 117

క. నానా విధంబులు వా
సూనంబులచేత గౌరి శుభకారిణి ని
త్యానందవిధిని భక్తిని
దానక్రమమతిన్ సహస్య వందించు నొగిన్ 118

సీ. [2]తన తండ్రి సద్భక్తిఁ దలకొని పతిరాజ
రయన పూజార్థమై సంతతమున
మానితంబగు పుష్పమాలిక లొసరించ
వాని గోదాహ్వయ వనజపాళి
యింద్రనీలాభ్యాయ తెన యగు నిజకేశ
తంబున ధరియించి మురతపించి
సుతరమైన వసీన ముకురమ్ము వంక దాక్ష
రేఖ విలోకించి హృదయ జనిత

తే.గీ. తోషితాయత్తయై ఫలితోన మగుడఁ
బెట్టియంచ చెప్పి నిస్తులప్రియముఁ జేసి
కంజనేత్రుని యవతార కథనములు స
భక్తిఁ బాటలు పాడు పత్రపదముగ 119

---

1 మూ. గానిరతంబు

2 మూ. తమ

చ. అనయము( జక్రపాణికొఱకై యనఘుం డొనరించు మాలికల్
మునుకొని తా ధరించుకొని మోదము( జెందుచు మందిరాంతరం
బున( జరియింపుచున్ ముకురమం దవలోకింపుచు నవ్వుచున్ మనం
బున( గమలేశు సంస్మరణమున్ రచియించు వధూటి వేడుకన్( 120

చ. తరమతి( గవ్వకామతి మదంబున( దాల్చిన పుష్పమాలికా
తతి(గొని చక్రపాణికి సుదారత సర్పణ చేయు భక్తిసం
గతి గని భట్టనాథు(డు పవిత్రత విష్ణుపదాంబుజార్చ సం
గతి(గొను చిత్తముం గలిగి కౌతుకవృత్తి నొసంగు నెయ్యెడన్ 121

క. మాలిక దాల్చిన యా సుత
మాలిక లా విభు( దొసంగ మోనిర తయటా
కాలిక గుణ శీలిక వన
మాలికి( బ్రియ మయ్యె వనిత మహితస్ఫూర్తిన్ 122

క. తరము సుత సేయు కృత్యం
బెఱు(గక సద్భక్తిచే మహీసుర వరు(డా
హరికి( బరిభుక్త మాలిక
లరయ నొసంగ( గొన్ని దినము లరిగిన పిదపన్ 123

రంగనాథు(డు గోదాదేవి పరిభుక్త పుష్పమాలికనా గోరుట

చ. సరసిజగంధి యొక్క దివసంబున నిర్మల పుష్పమాలికో
త్కరము ధరింపనట్టితఱి( దక్షిణమందగు భట్టనాథు(డా
దరమున వచ్చి కాంచి వితతస్థితి( జింత యొనర్చి తల్లి యా
తెఱ(గు నొనర్చు టేమిటికి దేవునియందలి భక్తి గల్గకన్ 124

క. అని యా సరములు విడి యా
ఘమఁ దితరములైన మాలికలు చేసి ముదం
బునఁ జక్రపాణి కొసఁగెను
మునిజత భక్తిరసోద సుస్థిర మతియై 125

సీ. ఆరూఢి గోదాపదాంబుజాసన చేత
నుత్తము[1]లైనట్టి పూల సరులు
ర్పటియించు భక్తవాత్సల్య మునీశ్వరుం గూర్చి
నవ్విభు మదమున నలినసేత్రుఁ
డిపను నీ ప్రీతి యనురాగమునఁ దాల్చి
కుసుమమాలికలు మా కొసగు మనుచు
యాచించునప్పు దయ్యచ్యుతునకు నమ
స్కారంబు చేసి యాశ్చర్య మంది

ఆ. వె. యతఁడు భక్తిచేత నా పుష్పహారంబు
లాత్మకన్యకను మురారి కర్పి
తంబుఁ జేయఁ దోషలం బంది యద్దేవుఁ
డవనిసురుని తోడ ననియెఁ బ్రీతి 126

చ. తరవరమూర్తియై రుచిరతం గాను నీ యరవిందగంధి నం
దితమతి నే వివాహమును జేసికొనంగల వాఁడఁ బ్రేమ నో
షితిసుర యంతసేపు పరికింప భవద్గృహసీమ దీని ను
ద్ధతి వసియింపఁజేయు మని తండ్రదనాభుఁడు పల్కె నేరుతన్ 127

1 మూ లే గొన్నట్ట

క. తరుణీ పరిభుక్తములగు
సరములు హరి దాల్చికొని విదశులఁ దగు భూ
సురునిఁ గనుంగొని యా సతి
ధరణి [1]ధరణ్యంగ గాఁగఁ దలఁపుము మదిలోన్ 128

తే.గీ. ఏను జెండ్లాడు నందాక నీ వయస్య
యున్మదీయ గృహంబు[2] (న) నుండని మ్మ
టంచు సంతోష లోచనుఁ డాజ్ఞ మొసఁగ
నమ్మహాత్ముండు తోషితస్వాంతుఁ డగుచు 129

క. [3]అనయము దేవేశుం గని
మౌని వరుఁ డాతనికి మ్రొక్కి మోదము తోడన్
దనయను దోఁకొని తనగృహ
మునకుఁ జనియె నఖిలలోకము గొనియాడన్ 130

గోదాదేవి తన తండ్రిని యర్చావతారస్వరూపంబు లడుగుట

క. ఒక నాఁడా గోదాసతి
ప్రకటిత భక్తిని జనకుం బద తత్పరయై
సుకర మతిఁ దత్కథాశ్రవ
ణ కుతూహల యగుచు నుండి నయతర లీలన్ 131

తే.గీ. అ జనకు మునినాయకు నమిత భక్తిఁ
జేరి ప్రణమిల్లి సంతోష చిత్త యగుచు
నంత నాముక్తమాల్యద యతనిఁ జూచి
పల్కె నిట్లు మృదూక్తిని భవ్యమతిని 132

---

1 మూ ధరణ్యాంశ గాఁదల 2 మూ నుండ
3 ఈ మూ అందేవేశుండాగిన పూర్వపద్యము నందలి వాక్యముతో నన్వయించు లేదు

సీ దివిజవంద్యుండును దేవదేవుండునౌ
వరవిందనేత్రు పరాత్పరాకార
ము ఈ భువనంబునఁ గల వసంఖ్యంబులౌ
గా మానవులకుఁ బ్రఖ్యాతి గాఁగ
సర్వాధికము లోట సకలంబు గుంభంబు
వలన ముక్తిదమూర్తి పొలుచు దాని
యందుఁబ్రసిద్ధంబులై ఇర్వసౌఖ్యంబు
లొసఁగు [1]వాణిలో వనూన వృత్తి

తే.గీ. బ్రవణ మంత్రంబువేతనే సకల జనులు
ముక్తిఁ బొందుదు రటులిలాపోదులగుచు
దాని వరియింప నను గూర్చి భవ్యమతిని
జనక హరిభక్తి దాయక సాధురింక 133

క. అని యిట్లు ప్రశ్నఁ జేసెను
వనితామణి నా కుమారి వరికించి ముదం
బున మృదు వచోరి వచించెన్
జనకుఁడు బహువాక్యములఁ బ్రశంస నలుపుచున్ 134

వ. లోకంబునందు గుహ్యతమంబగు నీ [2]యర్వాక్య వ్యూహంబు సూక్తమగుట
బ్రవణంబు వలన ముక్తి దాయకంబగు దాని వరియించెద మాకర్ణింపు
మని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో
త్తర ఖండంబునందలి షడ్వింశాధ్యాయంబు భక్త పరాయణంబగు నానా
యణుండు నరునకుం జెప్పి వెండియు నిట్లనియె 135

1 మూ వాణులలో
2 వ్రా యర్వా

తే.గీ. అఖిలలోక శిరోమణి యైనయట్టి
సత్యలోకంబు నందుల సంతతంబు
నలరు నానందమయ మూర్తులగు ముక్తు
లనుసరింప మహావిష్ణు వధివసించు 141

మ. అరయన్ భాస్కర మండలాంతరమునం దావాసియై ద్వాదశా
క్షరమంత్రార్థాలు సన్నుతింప సురలోకావహుండు లక్ష్మీయుతుం
డరవిందాక్షుఁడు భక్తరక్షకుఁడు సత్యస్వాంతుఁ డొప్పారు భా
సుర సౌవర్ణ కిరీట కుండల కటీ సూత్రాద్యలంకారియై 142

క. [1]అమృతాంబుధి నడుమ భుజం
గమ ఫణి మంటపమునఁ గంజదళాక్షుం
డమరున్ భగవంతుఁడు హరి
యమరవరుఁడు శేషశాయి యవ్యయుఁ డజుఁడున్ 143

తే.గీ. అల యనంతాది నిత్యముక్తులగు సూరు
లధిక భక్తి సేవింప నందుఁ దనరు
విష్ణుఁడు సనాతనుండు వర్ణింపఁ ద[2]రిమిం
భూషణాలంకరిష్ణుం డశేషగుణుఁడు 144

సీ. బ్రహ్మాది నిర్జర ప్రవర ప్రభావుండు
నారద సనక సనంద వాక్య

---

1 మూ. అమృతంబునిధి 2 మూ. రమిం

మానినమ్మతుఁడు శ్రీమంతుండు కాంతుండు
సంతత నిగమాంత సంచరుండు
సగుణుండు నిర్గుణుం డగణిత మహిమయుఁ
డసురమర్దనుఁడు జనార్దనుండు
కాంచనకంకణాంగద హారకేయూర
రత్నకోటీర విరాజమానుఁ

తే.గీ. డప్రమేయుం డనంతుం డపారతుండు
శార్ఙ్గధన్వుండు భువనరక్షణచణుండు
భక్తపాలుండు తారకబ్రహ్మసంజ్ఞుఁ
డధివసించు శ్వేతద్వీపమందు నెపుడు 146

సీ. పావనంబైనట్టి బదరికాశ్రమ సీమ
నధివసియించు నరాగ్రజుండు
సనకాది మునిరాజ సంసేవ్యమానుండు
నారదప్రభృతి సన్నుత పదుండు
సంతత నిర్జర సంస్తూయమానుండు
యోగవర్య మతుం డనూన గుణుఁడు
ప్రోత్రిత జ్ఞానవహార్ద బోధకుఁ డని
వార్యతేజుఁడు భక్తవత్సలుండు

తే.గీ. విష్ణుమూర్తి చిదచిద్విశిష్టమూర్తి
గురుతరం బ్రాభవుఁడు సత్యలోకమందు
సకల విద్యా వినోది తత్సృష్ట విధికి
యమిత లీలాచణుండు నారాయణుండు 148

క. పరమక్షేత్రంబై వి
స్ఫురణంబగు నైమిశమున ముక్తిదుఁ డగుచున్
హరి దగు సల్లక్షితువున
హరి శౌనక ముఖ్య పరమముని పూజితుఁడై 147

తే.గీ. ఇతి మహాపుణ్యమగు హరి క్షేత్రసీమ
రూఢి పీఠ సాలగ్రామ రూపియగుచుఁ
వెలుఁగు దార్క్ష్యాధిపేశరంబు సేవనంబు
జనమునకుఁ బరమపదం బొసంగు నెపుడు 148

క. మహి మతికర్ణికయందుం
రహి గంధ[1]చ్ఛాదితసంశ్లి రంబున హరి దా
మహిత స్ఫూర్తిం గైకొని
యహరహమును భక్తకోటి కభయప్రదుఁడై 149

ఉ. అంత నయోధ్య యందు మహా మహుఁడై యనుజన్మయుక్తుఁడై
చింతిత మూర్తియైన పృథివీసుతతోడ సమస్తలోక సం
తత విచారపద్ధతిఁ బ్రశాంతుఁడై భవమోక్షకారియై
యుల పరమాత్ముఁ డౌ జలరుహాక్షుఁడు రాముఁ డుదారకీర్తియై 150

తే.గీ. ధన్యమతి దాతఁడు సత్కృత ప్రపన్న జనుల
రక్షణ మొనర్చు దీక్షగాఁ బ్రబలువాఁడు
శ్రీకరుఁడు రఘురాముఁ డస్తోక మూర్తి
స్మరణమున ముక్తి ఫలము నొసంగువాఁడు 151

---

1 మూ. చ్ఛాదిత

తే గీ ద్వారవతియందు హరియు నవ్యయుఁడు పరుఁడు
యాదవేంద్రుండు లోకరక్షా పరుండు
సర్వలోక పరయ్యుండు సకలభక్త
వందితుఁడు శరణాగత వత్సలుండు 157

క. సంవత్సరమున యదుపతి
సుందర విగ్రహుఁడు భక్తసులభుఁడు గోపీ
బృందముతో విహరించు ము
కుందుఁడు కృష్ణుండు గోపగోయుతుఁ డెప్పుడున్ 158

తే గీ ధర మనోహరమైన బృందావనమున
నంద సూనుండు దనరు నానందముగను
నలరఁ దచ్చిత్తులను దత్పరాయణులు మ
హాత్ములగు భక్తవరులు సమర్చ సేయ 159

క. అనుదినము గాళియహ్రద
మున గోవిందుండు దనరు ముని ధ్యాధ్యేయుం
డనుపమ మూర్తి మహామహుఁ
డనవద్యుం డప్రమేయుఁ డవ్యయుఁ డగుచున్ 160

క. గోవర్ధనగిరి వరముగ
భావింపగ గోపవేషధరుఁడై హరి ల
క్ష్మీవరుఁడు దనరు సేవను
సేవకులం బ్రోవద్రు నరక సింధువు గడవన్ 161

చ. ఇలకథవిన్నమందు స్మరియించిన మర్త్యులొనర్చు పాపముం
దొలియఁగఁజేయు నచ్యుతుఁడు దురితపాపహరమూర్తి భక్తవ
త్సలుఁడు దయాళు సంస్తుతుఁడు సర్వశరీరయుఁ బ్రోచు సంతతో
జ్జ్వలుఁడు మహర్షి సేవితుఁడు సత్య విహారుఁడు ముక్తిదాయియై 162

క. హరి నారాయణ నిర్జర
గురుతర పోషయమాన గోమంత మహీ
ధరమున భగవంతుఁడు హరి
సరసిజ నయనుఁడు మురారి శౌరి దనర్చున్ 163

తే.గీ. ఇల మహాపుణ్యము వరంబు కలుషహరము
నగు హరిద్వారమందుఁ బ్రఖ్యాతి నుండు
సంతతంబు జగత్పతి సకలభక్త
జనము లర్థి నుపాసింప సంతసమున 164

సీ. అలరు సితాసితంబులగు మహానది
ప్రవహంబు లచ్చటఁ గలసియుండుఁ
బరమ పావనమునై [1]పరఁగునట్టి ప్రయాగ
మందును మాధవాద్యఖిల సురలు
వినయంబు సేవింపఁ దనరు మాధవుఁడు లో
కములకుఁ [2]దన దర్శనము వలనను
పరమపదం బిచ్చుఁ బరమాత్మ యంతఁ బ
విత్రంబయిన గయాక్షేత్రమందు

---

1 మూ. ధరగు  2 మూ. దనదు దర్శనముపలన

తే. గీ. సకలలోకాధికుఁడు మహామహుండు
శర్వ[1]మిత్రుఁడు గదాధరస్వామి గయయు
లక్షణాఢ్యుండు సర్వవరప్రదుండు
భావితాత్ముండు నిఖిలలోకావహుండు. 165

క. జగతిని గంగాసాగర
మగుఁ బుణ్యక్షేత్రవరమునందు నిఖిల యో
గిగణ సుపూజితుఁ డగుచున్
జగదధిపతి విష్ణుఁ డలరు జనము శ్రీదుఁడై 166

సీ. శ్రీకరోన్నతములై చిత్రంబులగు మహా
శృంగంబులను బ్రకాశించు చఖిం
పక్షమ్మగానేక పరికీర్ణమై వివి
ధాతు శోభితంబైన చిత్ర
కూటశైలంబునఁ గోదండ దీక్షా గు
రుండు రాముఁడు దోర్వ్యాముండు లక్ష్మ
ణాన్వితుఁడగుచు శ్రితాభయప్రదుఁడుగా
నహిత భయంకరుఁ డగుచు మోక్ష

తే. గీ. [2]దాతయు జగత్పతియు నౌచు ధన్యచిత్తు
లైన వాల్మీకిముఖులచే ననుదినంబుఁ
బూజ్యుఁడగు [3](మ) మహీజాత పుణ్యమాత
యయిన సీతను గూడి విఖ్యాత లీల 167

---

1 మూ శర్వ 2 మూ. జాత 3 మూ లేదు

క. వితత జనానంద సమం
చిత నందిగ్రామ సీమ్ని శత సత్తరికిన్
గతియైన రాఘవప్పుడు
సతతము జపాభక్త మౌని సముపాసితుఁడై 168

ఆ. విశ్వభావనుఁడు విశ్వ రాశియు విశ్వ
రూపుఁడైన శౌరి రూఢి గాంచి
భక్త సేవితంబు భాసురంబునగుఁ బ్రం
భాన తీర్థమందుఁ బరగుచుండు 169

క. శ్రీకర పుణ్య సరోవర
మై కమనీయంబు నగుచు నవమాశ్రయమౌ
శ్రీ కూర్మంబన వర్తిల్లు
శ్రీ కూర్మాకృతి ధరుండు శ్రీధరుఁ డక్షిన్ 170

సీ. దైవర్షి యక్ష గంధర్వ కిన్నర సము
ద్యానరాళింతో పావనంబు
నగుచు వర్తిల్లు సింహాచల క్షేత్రంబు
నందుఁ బూజ్యుండు మహామహుండు
భాసిల్లు నా జంఘద్ర సుభద్రలం
తోఁ గూడి నిత్య సంతోషి యగుచుఁ
బురుషోత్తముఁడు దయాంభోధి శ్రీమంతుఁడు
పతిత పావనుఁడు సుభద్రదాయి

తే.గీ. భవ్యమతి సేవచేతను స్వప్రసాద
మునకుఁ బాత్రతగను జనమ్ములకు ముక్తి
నొసఁగుచు నపార కీర్తి సమున్నతాత్ముఁ
డగుచు నిస్తుల మహిమ నపాయి యగుచు. 171

తే.గీ. సింహ శార్దూల సంగతాశ్రమ పుణ్య
తీర్థ పరిశోభితంబుగాఁ దేజరిల్లు
సింహగిరి యందు శ్రీ నరసింహమూర్తి
యమరు నమర నికాయంబు లభినుతింప. 172

క. అతఁ డఖిలాత్మకుఁడు నం
తతము నిఖిలలోక కర్త దైవత పరివ
న్నుత పదుఁడు శ్రీకరుం డం
చితమోక్ష ప్రదుఁడు నారసింహత మింపన్ 173

తే.గీ. ధారుణిని దివ్యగంధ మనోరమంబు
నైన తులసీ వనంబునం దలరుచుండు
గది సమాఖ్యుండు పంకజేక్షణుఁడు శౌరి
యవ్యయాత్ముండు భగవంతుఁ డచ్యుతుండు 174

క. తులసిని మహా పుణ్యంబగుఁ
గృత శౌచమునందు నిందిరేశుఁడు హరి దై
వతనుతుఁడు పాపహరుఁడవ
న్నుతుఁడగు లోకంబునందు ప్రీతిన తనిచేన్ 175

చ. అనవరతంబు ¹స్తోత్రగిరి యందు వసించు నృసింహమూర్తి పెం
పొనరు మనంబు గైకొని గుడోదక పానము సేయుచున్ మురం
బునను సమస్త మర్త్యులకు భుక్తియు ముక్తియు నిచ్చుచున్ దన
ర్చును బుధవంద్యమాన పరిశుద్ధపదాంబుజ యుగ్మ్యుఁడై యిలన్

తే.గీ. పారమార్థ్య మహాక్షేత్ర వాసియగుచు
భక్త జనపాల కెల్ల సత్ఫలం బొసంగు
నఖిల లోకైక కర్త రమాధినాథుఁ
డమరవంద్యుఁడు సాక్షినారాయణుండు 177

క. శ్రీ గోదావరి తటమున
శ్రీ గాంచిన ధర్మపురిని స్థిరతరలీలన్
యోగానంద నృసింహుం
డాగమవేద్యుండు దనరు నాశ్రితభరిత్రై 178

తే.గీ. దివ్యమగు కృష్ణవేణీ నదీ తటమున
నుండు శ్రీకాకుళంబున నంధ్రనాయ
కుండు దనుఁగొల్చు వారలకును ముదమున
భుక్తిముక్తులఁ గూర్చు సంపూర్ణమతిని 179

ఆ.వె. గాయత్ర్యాద్రి సంజ్ఞ గల్గిన శోభిల్లు
మున హిరణ్యకశిపుఁ బొరియఁ జేసి
నట్టి శ్రీ నృసింహుఁ డత్యుగ్రతర రూపుఁ
డమరుఁ బరమపావనాహ్వయుండు 180

---

1 మంగళగిరి

సీ. అమర చిత్తచకోర సముదయమ్ములకుఁ బ్రే
మము గూర్చు ముఖచంద్రమండలంబు
కరుణారస మరందఝర గారవమ్ముగఁ
దనరారు నేత్రపద్మద్వయంబు
భక్తచయాశాంత పరిపూర్తి సల్పు న
నల్పంబులగు బాహుకల్పలతలు
భరత సౌమిత్రి భాసుర విలోచనములకు
కాంక్షితార్థ సంపదంఘ్రి యుగము

తే.గీ. సమర లోకైక కర్త దైత్యాధినాథ
రావణ విరోధిహర్త సీతావధూ మ
నోంబుజాకర భాస్కరుం[1]డును దనర్చు
రామచంద్రుఁ డుదయాద్రి రాముఁడుండు 181

చ. జాతకవాది నిర్జరులు సన్నుతిఁ జేయఁ దనర్చు పాదముల్
గలిగి పవిత్ర నీరము చెలంగిన భీమరథీనది తటి
న్నెలకొని పుండరీకుని వినిర్మలుఁ గొల్చిన పాండురంగ వి
ఠ్ఠలపతి సత్యమూర్తి ప్రకటప్రతిభాకృతిఁ గొల్పు నిచ్చలున్ 182

సీ. ఘనతర భాగరుకావహ మహాధూమ త
దంబ కుఘుంగ ధూతాంబరంబు
భక్తి మకరంప్రతికాశ్రమ [2]దూర్ధ్వ ప్ర
సారితగారుత్మ తోరణంబు

---

1 మూ. డుడు
2 మ. లోర్ధ్వ

గగన సంగత తారకా నికాయా యుత
తత మహీరుహసంతాన ప్రకరంబు
కలహంససారస కారండవముఖ వి
హంగ విహారపద్మాకరంబు

తే.గీ. తత్కృపాప్తి భరద్వాజ[1] గౌతమభృగు
కౌశిక వసిష్ఠ సిద్ధ ప్రకాశితంబు
దివ్య తీర్థ ప్రభావ దేదీప్యమాన
పుణ్య నికరంబు వేంకట భూధరంబు. ॥183

తే.గీ. పరమ నష్టోత్తర సహస్ర పుణ్యతీర్థ
సంగతమ్మగు నమ్మహాశైలం సీమ
వెలయు దాస్వామిపుష్కరిణీ తటమున
వెలయు లక్ష్మీసమన్వితుం డచ్యుతుండు ॥184

ఆ.వె. ఘనతరుం డనంత కల్యాణ గుణపతి
పూర్ణ కలశరాశి పుణ్యమూర్తి
సౌరి నరాళ వికట పురుషుల కెప్పు డమ్మ
తం బొసం గభీష్ట దాయి యగుచు 185

మ. సరసీ నాథుఁడు శ్రీనివాసుఁడు మహోత్సాహుండు బృందారకో
త్కర సంస్తుత్య పదారవిందుఁడు కృపాకారుండు శ్రీశేషభూ
ధర సంచారుఁడు వేంకటేశ్వరుఁడు సత్పాపాళిఁ బేతుఁడై
సరసీజాలయతోఁ గ్రీడ గాని తద్వైభవంబున నుండు నా 186

---

1 మూ. గౌతమాత్రి కౌశికభృగుప్రసిద్ధ

వ అని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో
త్తర ఖండంబు నందలి సప్తవింశాధ్యాయంబు భక్తపరాయణుండగు
నారాయణుండు నరునకుం జెప్పె వెండియు నిట్లనియె 187

క వసుధాతిని కరుణా రస
మున నార్ద్రమైన హృదయమున్ గల్గా యశో
ధనులైన భట్టనాథులు
తనయను వినయను గుణుండి నాసెనె మహియున్ 188

క తనయా యాదవశైలం
బున కీశ్వరులైన యట్టి పురుషోత్తము డుం
డును నారాయణుడను నం
ద్రి నంరి నంతతము భక్తనమపాసితులై 189

క మరిరాచలంవానీ నృహరి
మరిరా మాత్రంబు సేవ గైకొని భక్త్యు
త్కట మతులగు మానవులకు
పటిమ నొసగు ముక్తి భక్తవత్సలు దగుచున్ 190

సీ పుణ్యంబు నతిరమ్యమును నగు వేగవ
తి మహా నిర్ఝరి [1]తీరమందు
వెలయు యె గీంద్ర సేవితమగు శ్రీహస్తి
ధరణీ ధర శిఖరాంతరమునందు

---

1 మూ రటము

భగవంతుఁ డచ్యుతుండు భక్తమందారుండు
ధన్యుండు శ్రిత వర దాయకుండు
కరుణాసముద్రుండు కంజాత నేత్రుండు
దివ్య స్వరూపుండు దేవరాజ

తే. గీ. సకల లోకేశ్వరుఁడు ప్రణతార్తి హరుఁడు
వార్ధిజా సహితుఁడు భక్తవత్సలుండు
వరదుఁడు వరేణ్యుఁ డవ్యయుఁ డతి విశేష
యలరు మోక్షప్రదుండు నారాయణుండు 141

తే. గీ. దివ్యమగు నప్పురమునందుఁ దేజరిల్లుఁ
గమలలోచనుఁ డవ్యయుఁ డమరనుతుఁడు
భక్త పరిపాలకుండు యథోక్తకారి
హరి ఫణీంద్ర శయానుఁ డనంతమూర్తి 142

వ. ఇట్టి పరమేశ పురాశ్రయుండును కాంతవదాతయు నృసింహుండును
త్రివిక్రముండును ప్రకాశవర్ణుండగు దీపప్రకాశస్వామియు వెండియు
నష్టభుజసంస్థితుండును నగు హరి యందుఁ దనరుచు నని యుండెనయ 143

క. ప్రస్తుతమగు శ్రీగృధ్రస
రస్తీరమునందు విజయ రాఘవుఁ డుండున్
నిస్తులతర విగ్రహుఁడు స
మస్త జనార్చిత పదాబ్జుఁ డగుచు నిరతమున్ 144

క. ధరణిఁ బవిత్రంబగు బలి
పురమందు మహాబలుండు పొలుచు సమస్తా
మరపూజిత విగ్రహుఁడై
సరస భవప్రచయ ముక్తి సంధాయకుఁడై 198

తే.గీ. భక్తిసార మహాక్షేత్ర వాసియగు భ
ార్గవుండు జగత్పతి యచ్యుతుండు
సజ్జన నుతుండు దేవతా చక్రవర్తి
యాత్రిక పరాయణుండు నారాయణుండు 199

క. ఇంద్ర క్షేత్రంబు నను మ
హేంద్ర ప్రముఖామరులు రహిం బూజింపన్
సాంద్రదయావంతుఁడు నిత్యు ని
స్తంద్ర కలుషహారి దైవతప్రభుఁ డెందున్ 200

క. వ్యాపిత మూర్తి మహాత్ముఁడు
గోపపురమునందుఁ దనరు గోప పతి సుర
ప్రాపకుఁడు ముక్తిదాయకుఁ
డాపద్విచ్ఛేదకుఁడు కృపాంబుధి యగుచున్ 201

క. శ్రీమంతంబై సద్భక్తి
కామోదంబై మహత్త్వమై వెలసెడు నా
శ్రీముష్ణంబున శౌరి మ
హామహుఁడు వరాహరూపమై విలసిల్లున్ 202

క విమలతరంబగు మహితా
ఖ్య మహా స్థానంబునందు నలరారు మహో
ద్యమ మూర్తి పద్మలోచనుఁ
డమర ముని ప్రముఖ వందితాంఘ్రి యుగళుఁడై 20౨

సీ. ఆ వని కవేరకన్యా మహనీయ మ
ధ్యద్వీపమున సముదార మగుచు
శ్రీరంగ మనుపేరఁ జెన్నొందు క్షేత్రంబు
క్షేత్రోత్తమంబు లెక్కకరంబు
పరమ పావనము భాసుర పుణ్య మహితంబో
త్తర మంగళము నద్భుత మగుట
నందు పవిత్రంబు ప్రణవాకారమును రత్న
మయమును గర్మ నశయమా పధిక

తే.గీ. రమ్యమును వేద శృంగార [1]రాజితంబు
నవ్యయము నున్నతంబును నగు విమాన
మధ్యమునఁ దనరెడు భుజంగమ వరాంగ
తల్పమధ్యమునందు సుఖాస్పదుఁ డగుచు 20౪

క కామిత ఫలప్రదుఁడు హరి
శ్రీమంతుం డఖిలలోక చింతామణి శ్రీ
భూమి నీళా సహితుం
డై మహిత సుఖాప్తినుండు నతిశయలీలన్ 20౫

---

1 పా. విరాజి

/

క  కరుణాకర సామ్రాజ్యాంబుధి
పరమాత్ముఁడు విభుఁడు రంగపతి శ్రీ వనజా
కరుఁ డరవింద దళాక్షుఁడు
హరుకుఁ దిక్కైన వరదుఁ డచ్యుతుఁ డంచున్ 206

తే గీ  అతఁడు సాక్షాత్పరబ్రహ్మ మఖిల భువన
నాథుఁడు బరాత్పరుండు సనాతనుండు
యోగి యోగి హృత్కంజమం దాగమాంత
రూపి దీనావనాలి తద్రూపధారి 207

క  అతఁడె పరబ్రహ్మం బా
కృతియె పరమపదము దీప్తిఁ జెందెడు [1]విలా
కృతిగా నాతావెవియు
సతతం బందరుఁ గల్గు విదాశిసగాన్ 208

తే గీ  అవని మోక్షార్థ సుప్రభవ్య నైవేద్యమనుఁడు
తిరము వైకుంఠ[2]మనఁదగు నరణి ధరణి
నిమ్మహాక్షేత్రమున వసియింప వలయు
భక్తి పరిపూరితాత్ముఁ డౌచుఁ దగుచు 209

ఉ  శ్రీమంతమాయ దివ్యము
నై మను పరపటమునందు నభ్యుదయుఁడు సి
తా మహిళా రమణుండు ద
యా మూర్తి స్మరింపఁదగు సుధారనుతుఁడై 210

---

1 ము విరిగా
2 మూ మన్దగు

తే.గీ. సత్యతరమగు నాశాశ నగర మందు
నధివసించు నధోక్షజుం డచ్యుతుండు
సర్వలావర్తకీ క్షేత్ర మొందు శౌరి
విశ్వమయుండు మహాత్ముండు శాశ్వతుండు 216

తే.గీ. దివ్యతరమగు మణికోటి తీర్థమునఁ ద
నర్చును మహాప్రభుండు సనాతనుండు
విశ్రుతంబుగఁ ద్వష్టాఖ్య వెలయు పురిని
నందు శౌరి మహాకృష్ణుఁ డనెడు పేర 217

క. విమలంబగు విష్ణుస్థా
నమునందుఁ దనర్చు సత్యనంతుఁడు హరి వి
శ్వమయుండు భక్తవరదుఁ డు
కమలాసన వినుత పాదకమల యుగుండై 218

క. అనుపమమగు విష్ణుపదం
బున వర్తిల నచ్యుతుండు పురుహూతనుతుం
డనఘుఁడు లక్ష్మీ వారా
యణుఁడన విఖ్యాతి గాంచి యతులిత లీలన్ 219

క. నలువగు శ్వేత ద్వీపమున
నలరారును శాంతమూర్తి యని జనులను వి
ఖ్యాతి హరి సురప్రియుండుగాఁ
బలుకంబడ నగ్నిహోత్ర పట్టణ సీమన్ 220

క. ఘనమగు భర్గస్థానం
బున భార్గవ సంజ్ఞఁ దగుచుఁ బుణ్యాత్మకులా
జనులు భజియింపఁ దనరును
వనజాక్షుఁడు శౌరి భక్తవత్సలం డతియై 221

తే.గీ. స్థిరను వైకుంఠమను మహాక్షేత్రసీమ
సాధులచే మాధవుఁడు హరి పూజ్యుఁ డగుచు
నుండు గరిమయైనగు పురుషోత్తమమున
శ్రీకరుఁడు భక్తవరదుఁడు వాసిల్లు నెపుడు 222

తే.గీ. చక్ర తీర్థమునందు సుబ్రాహ్మణుఁ
దనరును జనార్దనుండు సుదర్శనాఖ్యుఁ
దగుచు భక్తజనంబు కరుణాకరువు
పగిది కైవల్యదాయియై జగతియందు 223

చ. విమలము కల్మషాపహము విశ్రుత పుణ్యమునైన కుంభఘో
ణమునఁ దనర్చు పద్మతటిఁ దనారతుఁ డాద్యుఁడు చక్రపాణి వా
సమున ధరాతలంబున సమస్త శరీరుల కెప్డు మోక్షము
ల్సమత ఘటింపఁజున్ భవసుతస్వపదాంబుజుఁ డౌచు నిచ్చలున్ 224

క. భూతి కరంబై తనరెడు
భూరి స్థానమున గార్గి పొందుపొందు దయా
న్వితుఁడు ప్రభు పద్మాక్షుఁడు
పాతక హరుఁ డుండు భక్త పోషకుఁ డగుచున్ 225

గురుతరంబగు కృష్ణకోటయందలి మధు
రైరివత్తుని ...పెరుంచేతఁ
భాసింపబడు నందపురమునఁ దగు మహా
నందుండు భైరవానందమూర్తి

తే.గీ. బ్రహ్మముఖ్యార్చితుండుగాఁ బ్రబలుచుండు
వృద్ధపురియందు విలసిల్లు విష్ణుదేవుఁ
డచ్యుతుఁడు భగవంతుఁ డింపారుఁ దావ
షా[1](మా)ఖ్యుఁ దగుచుఁ గరుణాబ్ధి యగుచు ౨౮౦

తే.గీ. తవఁగ నుత్తమ సంగమ గ్రామసీమ
నలత నారాయణుఁడు సంగమాభిదానుఁ
డగుచు భక్తులచేఁ గొనియాడఁబడియెఁ
దత్త్వకోవిదనికరమందారుఁ డగుచు ౨౮౧

క. క్షమ నుత్తమ శరణ్యగ్రా
మమునందలి యచ్యుతుఁడు రమానాథుఁడు వై
భవమునీంద్ర సేవితుఁడు హరి
రమణీయాంగుండుఁ దగు శరణ్యాఖ్యుండై ౨౮౨

క. హౌరి సిద్ధసేవితంబై
స్థిరసంపద గఖ్యాతి సింహక్షేత్ర
స్థిరయందు మహాసింహుఁడు
పరఁగు సుజనవంద్యమాన పదపంకజుఁడై ౨౮౩

1 మా లేదు

క. జనరంగ మతిమంటపమున
ఘనులై మల్లాది సంజ్ఞ గలవారై య
వ్వనజాక్షుఁడు రంజిల స
జ్జ్ఞాన మూర్తియుఁ దగుచు సంభూతవ విభవుఁడై 284

క. నిబిడాఖ్య మహాస్థలమున
నిబిడాకారాభిధాన వియతిని హరి దు
ష్టబల విదారుఁ డుదారుఁడు
ప్రబలుఁ డనంతుండు భక్తపాలకుఁ డగుచున్ 285

తే.గీ. శ్రీని ధామస్థ ధర్మదక్షేత్రమందు
నలరు జగదీశ్వరుండు మురాంతకుండు
నట మనోహర మోహరంబందు దేవుఁ
డమరు శ్రీహరి కాంచేశాహ్వయుండు 286

తే.గీ. శ్రేష్ఠమగు మధురాపురి క్షేత్రమందు
సుందరుండు మహాత్ముండు సుజన వినుతుఁ
డద్భుతుండు జనార్దనుఁ డాదిదేవుఁ
డమరు జన రక్షణుండు నారాయణుండు 287

క. గణ్యంబై సుభదంబై
పుణ్యంబగు వృషభగిరిసఁ బొలుచు సుకృత నై
పుణ్య స్థితి గల స్వామి
రణ్యుఁడు భక్తులకు [1]ప్రకృతిగిరా వర్ణ్యుండై 288

1 మూ. స్ఫురిగిరా వర్ణ్యుండై

క. పంచ పవిత్రము శ్రీ మ
ద్వర గుణ సుక్షేత్ర సీమఁ బొంగును హరి శ్రీ
కర గుణుఁడు నాథ సంజ్ఞుఁడు
పరమాత్ముఁడు నిత్య భక్త పరిసేవ్యుండై 239

క. కురు రాజ్యం దనరు మహా
పురియందు రమాసఖుండు పొలుపొందు సదా
దురితాటవి పవన సఖుఁడు
పరిపోషిత శరణముఖుండు భక్త సుముఖుఁడై 240

క. శ్రేష్ఠ తరంబై తగు నా
గోష్ఠీపురమందు వెలయు గురుతర మతుఁడై
గోష్ఠీపతి ముని హృదయా
ధిష్ఠితుఁడు సువర్ణ గణ మతి పద్మాంకుండై 241

సీ. అవయవంబు పావనంబగు ధర్మ్యయనంబు
నందు రాఘవుఁడు శ్రీయామునుఁ దనరు
ధన్వి మంగళకర స్థలాన్వితుఁడగు శౌరి
పద్మ నేత్రుఁడు జగత్పతి దనర్చు
సమర శ్రీమంతంబు నగు శ్రమర స్థలి
ప్రభుఁడు బలాఢ్యుండు పరిఢవిల్లు
నల లోకమంగళంబగు కుంభఘోణమునందుఁ
శార్ఙ్గెంద వదనుండు పూర్తిఁ దాల్పు

మ. ఇర సర్వాకృతి విష్ణుభక్తులు ప్రసగ్గంధాంబరాలంక్రియల్
ధరియింపంగఁ దదర్పితాన్నము భుజింపంగల్గుఁ బుణ్యాత్మకుల్
దురతిక్రాంతమునైన మాయ నెటులం దోడ్తోన నిర్జించి త
త్పరమ స్థానము యోగి దుర్లభ మొగిన్ బ్రాపింతు రత్యంతమున్ 245

క. ఏదే స్థానంబుల కు
ధ్యాయతి సర్వాకృతులను సర్పింపఁగ నౌ
నా యా స్థానమె పరమం
బై యొప్పును సతఁడె పరము నగు విష్ణుఁ డగున్ 246

తే.గీ. అరయ సర్వ స్వరూపియై యలరు హరికిఁ
బరమధామావిభక్తయై పరఁగు హరికి
సూ న్సరాధిక్యభేద మింతైన లేదు
సరల సిద్ధాద్రి వక్షాలవాద్రి పుత్రి 247

మ. సులభత్వ స్థితి మోక్షదున్ సకల చక్షుష్యు సర్వాకృతిం
గల విష్ణున్ విభు నెవ్వఁడే నిలఁ దిరస్కారంబు గావించు వాఁ
డల ధర్మంబును సర్వమున్ మఱియుఁ గామాదుల్ దగం బొందకన్
బుం వృత్తిన్ నరకంబు నొందు నిది విఖ్యాతంబు లోకంబునన్

వ. కావున సర్వ స్వరూపియును వాత్సల్యశాలియునగు హరికి నొనర్చిన
కైంకర్యంబు సద్యో మోక్ష ఫలసాధనం బని [1]దుస్తరంబగు సంసారసాగ
రంబు లనఁ దరియింప నిచ్చయించు బుధులు సర్వ స్వరూపియగు హరి
నర్చింతురు భార్గవ విష్ణు జ్ఞానాధికుండును మహాత్ముండును విశ్వ సృష్టి

---

1 మూ దుస్తరలగు

౬ వేడి వృత తారాంతర
గోదావిరచిత ముక్త కుసుమ సముదయ
శ్రీ దామ సమాలంకృతి
మోదాన్వితహృదయ భక్తముక్తికరదయా 251

తోటకం శరణాగత సాదర చక్రకరా
కరుణారస సాగర కంసహరా
చరణాబ్జ నమత్సుర శైలధరా
కరుణాకరదయాకర గోపవరా 252

గద్య [1] ఇది శ్రీ రంగగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ పాండిత్య ధుర్యానవరలావణ్యమండలాభంపు సామ్రా ధౌరేయ స్వసమర్థ కాకృత పటహ ధణంధణారావ విపరీత పతనదిల్లీకాధీశ దండ విధ్వాన కోలాహల హయామద్యదాంత కనకదండీకృత హింకలీ ఘాత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కోసలవంశపయః పారావార రాకాసుధాకర పీతాంబరనాయక పౌత్ర రమణభూపాలక పుత్ర లక్ష్మమాంబా గర్భ శుక్తి ముక్తాఫల రాఘవ భూ నాయకాభిధాన సౌందర్య జిత సుమబాణ బహిరిపామనాయక ప్రణీతంబైన భార్గవ పురాణంబునందు విష్ణుచిత్తు జననంబును నతండు దారామ రక్షణంబు నంజేసి స్వామికిఁ బుష్పమాలికా కైంకర్యంబు సేయుటయును విష్ణు చిత్తులకుఁ దులసీవనమందు భూదేవి గోదా స్వరూపంబునఁ గన్యకయై ప్రాదుర్భవించి ప్రసన్నయగుటయు నతండు గృహంబునకుం గొని చని యా కన్యకను భార్యాసహితుండై పోషించుటయును నా యమ రంగస్వామియందుఁ బ్రీతిం జేసి యర్చాస్వరూపంబు నడిగిన నతండు నతం క్షేత్రంబులయందు నెలకొన్న విష్ణు నామంబులను దివ్యమాహా త్మ్యంబును తెప్పుటయును నను కథలుం గల షష్ఠాశ్వాసంబు సంపూర్ణము

---

1 మూ ఇది

తే.గీ. వాని యా రీతి శ్రీరంగనాథు రావ
సంపదం రీతి వినియున్కి నాఁడు ప్రీతిఁ
బాదినట్లయి తోఁచు నా సూచనలకుఁ
గలఁతఁ జెందుచు నిజముగాఁ గొరయున్న 7

వ. మఱియును 8

సీ. వలపుచే హరిమీఁది తలఁపుచే దనలోని
చెలులతో నాడదు కలువకంటి
బాళిచే మదిలోని జాలిచేఁ బెంపుడు
రాచిల్కఁ బిలువదు రాజవదన
భ్రాంతిచే మోహవిభ్రాంతిచేఁ గెరలాడు
హంసలఁ గూడదు హంసయాన
కూర్మిచేఁ దాపంబు పేర్మిచే సరస స
ల్లాపముల్ సేయదు లతాంగి

తే.గీ. యంతరంగ తరంగితాత్యంత రంగ
రమణ సాంగత్య వాంఛాపరంపరలను
దనరఁ జెలువంపు దీవి నెత్తావిత్రోవి
యైన గోదామహాదేవి యతివరివి 9

క. పలుకదు పిలిచినఁ దన దయఁ
చిలుకయు చెలిమీఁద వింతశృంగారమున్

తే. గీ. కువలయాంగణఁ గువలయగుణ నికరుఁ
గువలయేశుఁ గూడి సఖులు వినోద
వాదరించెదఁ గరమంచు సేదఁ దేర్చి
నే సనెడు రీతిఁ గువలయహితుఁడు దోఁచె 14

క. అంతట వియె గవేదన
నెంతయుఁ బరితాపమందు నింతిని సకియల్
గాంత లతాంత నితాంత వ
నాంతమునకుఁ దోడుకొని రయంబున నరుగన్ 15

చ. మరునికి నంతకాంతిక సమీహరి గంధవహోత్క మండ నం
చరునికి నవ్వనస్థలి నెసంగుచు హెంపుల నేఁచుచుండ్ర పె
మరునికి నెంతయేన్ గుమద మార్గముఁ బెంపు ఘటింపు వా నిశా
చరునికి రీతిఁ జెంది సతి సంధియ మందగఁ గాంచి యంతటన్ 16

మ. విమలోద్యాన వనంబుఁ జేరి సతితోఁ బెంపొందఁగా నాఁడు త
త్కమలాస్యల్ చెలి మోహనంబు దెలిసి యాకంతార నేత్రున్ మహో
ద్యము నారాయణు రంగభర్తను సముద్యల్లీల దివ్యప్రభం
ధమునం బాడిరి తచ్చరిత్రములు చిత్రస్ఫూర్తి పేర్వెలుఁగన్ 17

క. శ్రీరంగవరుఁడు రక్షిత
సారంగ వరుండు ప్రోచు సంగతి నిన్నే
సారంగ నయన మది చే
సారంగను వలదటంచు సదయుండు సుమీ! 18

సీ. అనపాయినిగఁ జేసె నప్పు లోకేశ్వరి
నాఁడె లక్ష్మిని హృదయమునఁ ¹దాల్చె
భార్యయౌ భూదేవిఁ బ్రాయార్థి చేర్చి
యుచిత సౌఖ్యార్థ ముద్ధరించె
సీతకై జలరాశి సేతువు గట్టించి
యింద్రుకై తన్యం హరించి పంక్తి నేల
గోపాల ముఖ్యం ²శిక్షించి నందేశ
మొనరించి రుక్మిణిఁ గని గ్రహించె

తే.గీ. మఱియు జాంబవతి ముఖ్య యాదవతులఁ
బెక్కు సాహసములు సేసి పెండ్లియాడె
నట్టి యారంగ శౌరి దయావిహారి
నిన్ను వరియించఁడే లేదు నిరతాక్షి 19

క. నరకాసురుఁ ద్రుంచి తనం
బరిణాంక యౌవన్ల సుగుణమాన్యుల ధరణీ
శ్వర కన్యలఁ బరిణయ వి
స్ఫురణన్ బదియారువేలఁ బ్రోవఁడె ప్రీతిన్ 20

ఉ. గోపిక భార్య లయ్యెఁ దనుఁగోరిన పల్లవ పల్లవాధరల్
దెపిత కామ సౌఖ్యములఁ దృప్తినిఁ జెందఁ గలిందనందినీ
ప్రాపిత కుంజ పుంజములఁ బాటిలఁ దే పరకీయలందె నేఁ
జేపున స్వీయవృత్తిన నిను చేఁదె రంగవిహారి యంగనా 21

---

1 మూ. తెల్పె 2 మూ. సిక్షించి

సీ. ప్రేమచె మును సత్యభామకు వరుఁడయి
ధరణిని బారిజాతంబు తేఁడె
మత్స్యయంత్రము నేసి మహిపాలుర జయించి
లక్షణఁ దేఁడె సులక్షణముగఁ
గాళిందితటియందుఁ గమలాప్త నందనఁ
గాంచి మోహింపఁ గాంచఁ డయ్యెడె
పుంగవావలి నృపపుంగవావలిఁ దోలి
యం సుదంతను వివాహంబు గాఁడె

తే.గీ. పరఁగి రాధిక చెప్పిన పనులు చేసి
యొసఁగ మే నత్త మేనత్త సేయుకొండె
వారి కిటు లోలఁడైనట్టి వాఁడు నేఁడు
రామ వరియింపఁదే నిన్ను రంగరాం 22

క. ఉల్లాలుగ నేంఁడె మో
హోల్లాసం బెసఁగ సముదితోత్తుం జేరన్
ఫుల్లసలిం గుసుమశరుని
భల్లగతిన్ పొందు దానిఁ బ్రార్థనతోడన్ 23

చ. అలయిల విట్టుఁ డెంతటి సమర్థుఁడు చందురుఁ డెంతవాఁడు పి
క్కిలి చలిగాలి యెంతటిది కేవలమున్ రొదసేయుఁ దిక్కు గుం
పుల బలమెంత పేర్కఁ బరిపూర్ణ మనస్థితిఁజేసి నిన్ను నీ
జలరుహ లోచనుండు సరసస్థితి భామినిఁగాఁగ నెంచినన్ 24

ఉ. అమ్మహితాత్మ సుందరత నాతనిపై భరి వా ప్రభావమున్
సమ్మతిఁ జేసె యే పురుష సంతతికైన గన్గఁడా ఘనం
బిమ్మహి నిన్ను భామినిగ నేలిన నీదు పురాకృతైక పు
ణ్యమ్ము గణింప శక్యమె సమస్త జగంబులయందు సుందరీ 25

క. తరుణీ పురుషులలోపల
సరసిరుహాక్షుండు రుచిరసౌఖ్యం బగుటన్
వరియింపఁగ నాతండు నినుఁ
బరిణయమై గనుటకన్న భాగ్యము గలదే 26

ఉ. చక్కనివాఁడు సర్వజనసంఘములోపలఁ గారుణార్తిఁ జెం
పెక్కనివాఁడు నా ఘనుఁ డహంపమతిన్ విరహార్తిఁ జేసినన్
మక్కువతోడులన్ దనరు మానినిగాఁగ వరించినప్పుడే
చక్కఁదనమ్ము నీ సుకృత సౌఖ్యము నెన్నఁగ శక్యమానతే 27

క. ఆ మహిలో రంగేశం
బ్రేమముతో భర్తగాఁగఁ జేర్కొని యుంటన్
యామతి నెఱుఁగుదు మో క
వా మాతోఁ దెల్పరాదె యవ్విధి చెక్కన్ 28

గోదాదేవి రంగనాథుని నిందాపూర్వకముగా స్తుతించుట

మ. అని రంగేశ్వరు దివ్యమంగళ చరిత్రానేకముల్ దెల్పఁగన్
విని గోదాంగన యంతరంగమున నానిర్వార సమ్మోద య
య్యును నిందాస్తుతి పూర్వకంబుగను మోహోద్రేకయై రంగరా
ఘుని నానా గుణముల్ సఖుల్ వినఁగ నెంతో వింతగా నిట్లనెన్ 29

క. రంగేశు చర్యలను మీ
రింగిత గతి నెన్నెదరు సఖి(?) హీనముగా
నంగనల దాఘనుం డే
సంగతి రక్షించినాఁడు కరిముఖులారా 80

చ. రహి ననపాయమైన తపరాను రమామణి న్ ఏరోహిలా
సహగతిచే విశంరపురి వంచసఁ జేయఁడె యప్పుడా మీ
రహరహ మీ ప్రబంధముల నద్భుతలీల నన్నుతింపఁగా
విహితము వందితాత్మకులఁ జేర్చెను వారల నేమనం దగున్ 81

మ. హరచాపంబు హరించి సీతను శుభఖ్యాతన్ గుణోపేత సు
స్థిర యత్నంబున నెండ్ల యాతి వనధాత్రీ భాగసంచార వి
స్ఫురితం బాపెనుఁ గూర్చినట్టి కఠిన మూర్తిన్ విడంబించు నా
హరి మీ రందఱు సుందరీ సదయుఁగా నాతన్ రహిన్ బాడియె 82

క. ఆ రుక్మిణి సఖిమణిఁ
గేరడములు పల్కి వెతలఁ గీలించిన యా
వారిజలోచను ప్రైభరి
గారుడ చర్యాప్తి గాదె కామినులారా 83

సీ. బాల్యమున బాలలీలత్వమును మీఱ
వారి వారికిఁ గొంత మరులు గొలిపి
చిత్ర వస్త్రా హార మిత్రతన్యాపర
సైకతంబులఁ జాలఁ జిన్నె చేసి

రాపించ చేతస సొంపొందిత నికుంజ
పుంజంబులమునఁ గూడి వ్యాపించి
రాసకేళికి రసోల్లాస పాణి తీరా
ధ్యానంబు గావించి దాసలిచ్చి

తే గీ పతునఁ గదల్చి దోసి రము దాసి రతుల దాసె
మహిత మతి సతుల సమ్మద మరంది
మధుర కరుగఁడె తార్తి యా మధువిరోధి
సాధువని చెప్పఁగా నెం దానలార 94

వ అటియుసుం గాక 95

క తనుతాత చేదవుచ్చే
దనుఁజేరఁగ ననుం తోర దనుతాది యనుజున్
దనుతాత చేదంబెట్టె
తమఁ జేర ఖండింపఁ జేసెఁ దద్వ్యముంతగాన్ 96

సీ తిమిరూపమై జంధి వసించు మత్స్యకాం
తం మోహపెట్టఁడె తత్క్షణమున
సిరిఁ దాసి యొక్కెడ గిరిక్రిందుగా దాఁగి
రాత్రు మూనఁడె కమఠముగుచు
భూదేవి దనతో చౌందుగోరుటయు భూ
దారత గాంచఁడె ధర్మ మొడిగి
కలిమి తొయ్యలికి భీకర వృత్తి దోఁపఁగా
వికృతత్వ మందఁడె విశ్రుతముగఁ

తే. గీ. యుద్ధమున బ్రహ్మచర్యాప్తిఁ బొలుపెసంగ
రాజకాంతలఁ గప్పిరు రనఁ బొలంగఁ
జేసి మునిపల్లె సతి నివసింపఁ దనరు
ఎవరుబోదరు నమ్మఁగా నేరమె మనకు 37

శా. కాంతారత్నమటంచు నెంచక మహోగ్రస్ఫూర్తి [1]సింహయుతో
సంతంతన్ యమునం గలంచి తదుపప్రియ్యాల్ చేసి హాలామదా
త్యంతస్వైర విహారముల్ సలుపఁడే తాలాంకుఁడై మున్న దా
నెంతే నీ కమలేక్షణుండు హరి రంగేశుండు సామాన్యుఁడే 38

మ. యమునా తీర నికుంజ పుంజముల రమ్యస్ఫూర్తితో సంగరా
వము గావింపఁ దడీయ గానవశుఁడై వాంఛించి యెంతేని సు
త్రము గోపాంగనలన్ భ్రమింపుటకు నంతర్ధానుఁడై వరలన్
సుమబాణా ప్రథసాలు సేయఁడె రమేశుం డీతఁ డత్యున్నతిన్ 39

క. పరమతులన్ మోహావృతి
పరిభూతులం జేసి బుద్ధభావంబున దా
నరుగఁ దుదన్ గురురథులన్
బురసతులం జేరి మానమున్ మూలఁ గొనఁడే 40

తే. గీ. అతనుశరముల వారించి యతఁ డున్న
ఖలుల శిక్షింపనె కాని కల్కి యాయెఁ
దతఁడు నేరము వారించి యతఁడు సృష్టి
నెలవు లొప్పింప గలఁడె యోగులకు నెల్ల 41

---

1 మూ. శిరంయు

సీ. అలయిక చందనం బలఁదరె నెమ్మేన
ఫణివేణులార యీ యర్ధకచకు
పరసుమగయ్యఁ జంపకనాస మంచరే
భ్రమర విభ్రమ సదపాంగలార
రాజువేణికిది నేత్రములందు నుంచరో
రాకాస్యలార కైరవ నిచయ
రామాభిరామ కామచ్ఛదమ్మునం బు
రాణింపరే పిక వాణులారా

తే.గీ. యనిన నొకయింతి కందాయఁగొనియె నొక్క
కొమ్మ కన్గవ చేఁ గప్పుకొనియె నొక్క
సకియ వక్త్రంబుఁ జపక నవ్వు గిల్ల
నవ్వుకొక యింతి దా మాటలాడదయ్యె 48

చ. అనుచుఁ బరస్పరోక్తుల సమంచిత పేలల నింతు లాడ న
స్పదిరలు నూరకున్న [1]యెడ దారిజలోచని మన్మథార్తి చేఁ
గనలుటఁ గాంచి కొందఱుగుణాంతలు చెంతను జేరి యామెతో
ననిరి వయస్య నీ హృదయమందలి మర్మము దెప్పరాదటే 49

క. బాలా యీ విరహంబు నీ
కేలా శ్రీలా సహాయుఁ దేలుకొనెదు నిన్
లీలా విహారుఁడై యే
మేలాయె నటంచు పంచి [2]మెంతలు దమలోన్ 50

---

1 మూ యడ 2 మూ చెంతలు

చ సరసిజ గంధి మన్మథ విషాదము చిత్తమునందు నాఁటినన్
విరహ తపన్నమాధిఁ గొని విప్రలంబ కీర్తి ధురంధరున్ సఖీ
త్కర మతి యైన రంగవిభుఁ దప్పుడుగాఁ దన నాథుఁగాఁగ వే
మఱుఁ దలపోయుచుండెను సమస్తము చిత్తవేళ వృత్తిగాన్ 64

మ వనమాలంబిలయందు పూసెను ద్విరేఫవ్రాత మింతార ని
స్వనముల్ పిమ్ముఁ బొచ్చి కుట్టుకుఁ బ్రభాతం బాది కన్పట్టఁ బె
ల్లి నిశ్వాసోత్రప వాపులన్ దొరఁగె వేర్చెన్ నిండుకాఁ బ్రాణ పేఁ
పున నిల్చెన్ సతి తద్భృతం బాదవ సంపూర్ణైక మోహ స్థితిన్ 65

## విష్ణుచిత్తుఁడు రంగనాథునికి గోదాదేవిస్థితిఁ దెలుప శ్రీరంగమున కరుగుట

క అంతటఁ గాంత లతాంత శ
రాంతక హృత మానసయై యంతరము మదిలో
వెంతయుఁ గోరిన దని విని
చింతిలి యవ్వేళ విష్ణుచిత్తుఁడు మదిలోన్ 66

సీ శృంగారమును రీతి కెఱుఁగు లక్ష్మీదేవి
పక్షంబునం జేర్చి పలుకువాఁడు
రసమునఁ దగు దీవి రత్నగర్భాదేవి
పిఱుఁదు కరియించి వెలయువాఁడు
లీలాసుగుణపేటి నీలావధూటిని
వంకవరి చూడంబి యేలువాఁడు
మోహించు దేవకాంతాకోటులు లింకఁ బట్టి
వారితోఁ గూడ నింపారువాఁడు

స. శ్రీరంగపురి కంబహోర లీలఁ దనర్చు
  సుభయకావేరికాభ్యుదయ మొంది
రంగభర్తకు విహార వనంబునాఁ దగు
  మహనీయ కన్యాశ్రమంబు గాంచి
కలువ హారంబులై కావేరిలో నుండు
  దశ మహా పుణ్య తీర్థములుఁ జూచి
శ్రీ నిధానంబు విమాన సంజ్ఞకమైన
  యా క్షేత్రమునకుఁ బ్రదక్షిణించి

తే.గీ. సప్త భువనాళి రాజ్య రక్షణకుఁ బ్రాల్చు
సప్త దుర్గంబులను బోలె జగతి నొసఁగు
సప్త ప్రాకారంబుల దాఁటి సన్నుతించి
విష్ణుచిత్తుండు భక్తివర్ధిష్ణుఁ డగును 68

చ. ఘనతర రత్నకుట్టిమ నికాయ వితర్దికందు రంగ నా
థుని మణిహేమ సౌధములు దోఁప నటం బ్రతిగేహ సీమలం
దనయము దమ్మికుందుఁడు నికాయయ్ పంక్తులతోడ నింట నిం
టను గనుపట్టు వేడుక ననందగు వీథు లసర్గకంబులై 64

సీ. విరజానది ప్రవాహ నిరసించు ధవళోర్మి
  పుండ్రముల్ నుదుట విస్ఫూర్తి మించ
వరయామాని యఘంబు హరియించు భూషణం
  బగు శంఖ చక్ర చిహ్నంబులలర

వ	అక్కగు నమ్మహానుభావుం గూర్చి యమ్మహీసురుండు నిగమ నిగమాంత సూత్రంబు గానియాడి నిటలతట ఘటితాంజలియగుచు మఱియును 73

## విష్ణుచిత్తుఁడు రంగనాథునిఁ బ్రార్థించుట

క	నరసింహరంగ రంగా
నిరుపమకరధృతరథాంగ నీలఘనాంగా
గరుడతరపక్షతురంగా
కరుణాకూపారతరంగ కలుషవిభంగా 74

క	అని యద్దేవుని నెన్నుచు
మనుఁ దాభూసురుఁడు పల్కెఁ గంజదళాక్షా
వినుఁ బ్రార్థించెద నా మన
విని విని నను బ్రోవుమయ్య విశ్వాత్మకయా 75

చ	పలువుగ నా కుమారిక యొనర్చుతపం బది యెట్టిదో కదా
తెలియఁగరాదు మాకు బహువిధమ్ములైన ప్రబంధ సూత్రమున్
జలజదళాక్ష నిన్ను నరసస్థితిఁ జేర్చిన నమ్మికింపుచున్
బలుకుమనందు నామెదగు భావము నీ కెఱుంగ నేర్తువే

క	మా యోగములందుల లే
దే యోగము కాని పంకజేక్షణ యాం
డ్యాయతలోచన దలఁకొని
రా దెద స్మరియించు నిన్ను నిల్పనుగతిన్ 77

సీ. నలినాక్షదామ మున్నతి వేము ధరియింపఁ
దాఁ బద్మహారంబు దాల్చుచుండు
నే మూర్ధ్ని చంద్రరేఖఁ బ్రాముకొనుటయుఁ దాఁ
గరిమఁ గస్తూరి తిలకంబుఁ దీర్చు
నవయంబు మేము దివ్యప్రబంధోక్తిని
నిను బల్కఁ దానిన్ను నిందసేయు
నాయ్యన మే[1]ముత్తరియ్యఁ గయ్యఁ గొనుటఁ
బరికింపఁ దాఁ గవ్వపాన్పుఁ జెందు

తే.గీ. మేము దృఢతర తనువులమై మెలంగఁ
దాఁ గృశాంగిగ నుండు మద్దామ వృత్తి
నమ్ముగాత్రి రచించు నె గానుభూతి
మాకుఁ దెలియంగరాదు లోకైకనాథ 78

మ. ఆ కాంతామణి యందు యోగమున కో యబ్జాక్ష యేనాఁటికిన్
వీకేమో దయరాదు గాన నిక నిర్హేతుత్వముం బూని య
స్తోక స్ఫూర్తిని దానిఁ బ్రోవుము మహోత్కృష్టత్వముం బాడ్పఁగా
లోకంబందుల నీ సమానులగు వేల్పుల్ లేరుగాఁ జూడఁగాన్ 79

క. మును నీ వొసఁగిన వాక్యం
బును జేసి నిరంతరంబు పూఁబోఁడి నినున్
మనమునఁ దలఁచుని యోగం
బున నున్నది భక్తిఁగొని సమున్నత మతియై 80

---

1 'ఉత్తరియ్య' మసాధువు, కాని ప్రాసయతియందుఁ బ్రయుక్తము 'ఉత్తరీయ' శబ్దము సాధువు

చ. అని తన ఛాందసోక్తిఁ దెలియంగ వచించిన విప్రుఁగాంచి య
వ్వనజదళాక్షుఁ డిట్లనియె భామిని పూనిన యాగ మే నెఱుం
గని దిసుమంత యేనిఁ గలుగంగఁ దనుప్రద గాన నీమనం
బునఁగలయట్ల నయ్యెడు సమున్నతిగా ధరణీసురోత్తమా 81

తే.గీ. వసుధ మను నీ కొసంగిన దాక్షిణ్యరతి
సత్య వేమ రచింతు నుత్సాహాళి
ఏపు చూ మున్న తో రంగనెత వల్క
నాలకించి ద్విజుఁడు సమాహ్లాదుఁ డగుచు 82

క. వనితామణి నాజ్ఞ గైకొని
ఘనుఁ డగు నవ్విప్రుఁ డంతఁ గల్గిన శేషా
శనముఖుల యనుమతింగాఁ
జనియెన్ నిజనగరమునకు సత్వరలీలన్ 83

ఆ.వె. అందుఁ దొంటిరీతి నవ్విప్రచిత్తుండు
మాధవునకుఁ బువ్వు మాలికలు స
మర్పణంబు సేయ చలువతో గోదా స
తీలలామ దేవదేవుఁ దలఁచి 84

క. అనుదినము మోహవారిధి
మునిఁగిన దౌతుమ వయస్య మురవైరినిఁ గాం
తునిఁ గాఁగ నెన్నికొని యుం
డెను మదనజ్వరము మది గదింపఁ గంకగాన్ 85

## రంగనాథుఁడు సపరివారంబుగా ధన్విపురంబున కేఁగి గోదాదేవిని పరిణయ మాడుట

క. ఈ రీతిని గోదా క
న్యారత్నం బెన్నుచో ననంతుఁడు భువనా
ధారుఁడు సముదారుఁడు తా
వేరీ నిలయుండు రంగవిభుఁడు ముదమునన్ 86

సీ. అనుదినంబు మహాత్ములగు నిత్యయుక్తులు
బ్రహ్మరుద్రాది నిర్జరచయములు
బ్రహ్మర్షులును సిద్ధపన్నగ చారణ
గంధర్వు లప్సరోగణము లర్థి
సేవింప సంతోషచిత్తుఁడై వంది సం
స్తూయమానుఁ డగుచుఁ దోరములగు
మహితాతపత్ర చామరములఁ దోడుతఁ
బరిశోభితుఁ డగుచు బరిఢవిల్లి

తే.గీ. వైనతేయునిపై నెక్కి పంకధాప
కారి తూర్య స్వనములఁ బొల్పార నతిశ
యంబయిన ధన్విపురమున కరుగుదెంచె
నవని గోదాసతిఁ బెండ్లియాడుకొఱకు 87

చ. ఘనతర దేవదుందుభి నికాయ నినాదము బ్రహ్మాండమేఁ
పునఁ బరవంగ సర్వబలంబులుం గొలువంగ నుర్వి సెలంగ సొం
పున దనరంగ రంగపతి మోదముతోఁ దన కన్యకై రయం
బునఁ జనుదేరఁగా సరసపూరిత భూరితరానురాగుఁడై 88

క   ఘనుఁడు మహాయోగీంద్రుం
డనుపమమతి విష్ణుచిత్తుఁ డప్పుడు శౌరిన్
దనుఁ గొలువంగ నెదురుగాఁ
గని పలుమరు నతి యొనర్చె సంహృష్టుండై ౪౧

వ   అంత ౪౨

చ   ఘనతరు భక్తవత్సలునిఁ గమలదళాక్షుని దివ్యసత్కథా
ధ్యుని రమణీయ వైభవ సముజ్జ్వల గాత్రుని రంగభర్తఁ దా
వినయము చేసి తోడ్కొని యభీష్టమతిన్ సురరాజమందిరం
బునకు సమానమైన యొక పుణ్యగృహంబునఁ జేర్చి యచ్చటన్

తే.గీ.   యోగ విద్వరుఁడగు భూసురోత్తముండు
భాసురంబగు కనక సింహాసనంబు
నందు శౌరినిఁ జేర్చి పాద్యాదులను స
పర్య గావించె నిగమోక్త పద్ధతిగను ౪౩

తే.గీ.   అంతట సుగంధ పుష్పాక్షతాదులను స
లక్షణంబుగ వేది నలంకరించి
యందు వహ్నిఁ బ్రతిష్ఠించి యాగమోక్త
సరణి హోమంబుఁ జేసె భూసురవరుండు ౪౪

చ   ఉరుతర హారకుండలముఖోజ్జ్వల భూషణ భూషితాంగుఁగాఁ
బరఁగిన దివ్యతామయుని భూసురహా[1] (మమ్ముఁ జేర్చి సన్నిధిన్
పరగుణయుక్తు) దోడ్కొనివచ్చి సుమంత్ర పురస్కృతంబుగా
గరిమ నొసంగె భక్తజన కల్మషహర్తకు రంగభర్తకున్ ౪౫

---

1 మూలము కొంత క్రిమిదష్టమగుటచే (బ్రాకెట్టు భాగము పూరింపఁబడినది

తే.గీ. అంతరంగేశ్వరుండు గోదాబ్జపాణి
పాణిఁ [1]బాణిని విడుకొని ధన్యమతినిఁ
గలయఁగా [2](లాజ) హోమాదికము సమస్త
మును యథావిధిగా సల్పె ఘనత మించి 95

క. పరమాలంబితఁ సతితో
నిరుపమ మతి నగ్నిహోత్రునిఁ బ్రదక్షిణముం
గఱపి ప్రమోదంబొందెను
సరసీజాక్షుండు రంగశౌరి శుభముగాన్ 96

చ. పరమదయాబ్ధి యచ్యుతు వివాహముఁ జూడఁగ వచ్చు నా సరో
వరముని ముఖ్య పద్మభవ వారిజవైరికిరీట శక్ర ని
ర్జరులను విష్ణుచిత్తుఁడు విశాంతరోత్తిని సమ్మతించి యం
దఱఁ బరితృప్తులన్ సలిపె ధాత్రిపయిన్ జను లెంచ నయ్యెడన్ 97

మ. సురకాసార మునిప్రవృత్యనమ [3]సంస్తోత్రాద్యుఁ డైనట్టి శ్రీ
హరి రంగేశ్వరుఁడాత్మ భృత్యరతితో నవ్విష్ణుచిత్తున్ శుభో
త్కరు సద్ధాత్రి వసింప నాజ్ఞయిడి గోదాదేవితో వేడ్కతోఁ
బరమప్రీతినిఁ జేరెఁ బాపపటలీభంగంబౌ శ్రీరంగమున్ 98

వ. అంత 99

సీ. లలితాత్ముఁ డగుచు నీళా పద్మ కన్యకా
గోదాంగనలతోడ గురుమనీషఁ
గైకొని నిత్య సుఖశ్రీలఁ బెంపొంది
కంతు సామ్రాజ్యైక గరిమఁ జెంది

1 మూ. బాణిన  2 మూ. లేదు  3. మూ. సంస్తూయాద్యు

రంగనాథుఁడు ఫణిరాజ శయానుఁడై
కలయఁ గావేరికా నిలయుఁడగుచు
నందు నుండు జనుల కందఱికిని దయా
రసమునే మోక్షం బొసంగుచుండు

తే.గీ. తమ్మహాత్ముఁ డాది మధ్యాంత రహితుఁ
డవ్యయుం డప్రమేయుం డనంతుఁ డజుఁడు
నిత్యముక్తాదినుతపాదనీరజుండు
రమ్య ఫలదాయకుండు నారాయణుండు 100

వ. అంత మహాభాగుండును రంగ[1]భూపతి శ్వశురుండును నగు విష్ణుచిత్తుండు దత్కైంకర్యపరుండును దాస్యైకజీవనుండును నగుచు నం దధివసించెఁ గలికల్మషాపహంబును ముక్తిప్రదంబును నగు శ్రీవిష్ణుచిత్తయోగి యేతచ్చరిత్రం బేవరేనిఁ బఠియింపుచున్ వినుచున్ వ్రాయుచున్ బొత్తు రా నరు లిహకైశ్వర్యంబు లనుభవించి యంతంబున శ్రీశౌరిపదంబుఁ జెందుదు రని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తరఖండంబునందలి యేకోనత్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల బ్రహ్మాధురంధరుండగు నరునకుం జెప్పి వెండియు నిట్లనియె 101

తే.గీ. నరమహాభాగ శ్రీమంత గురుతరాఖ్య
యపరకథ యేను చెప్పెద నాలకింపు
వినెడు వారల కద్భుతంబును దనర్పు
దాని నేకాగ్ర మగునట్టి మానసమున 102

1 మా. భూపతీశ్వరుండును

## హరికార్ముకాంశమునఁ బరకాలుఁడు జన్మించుట

క. పరకాల మహాయోగిం
కోరి దుష్ట సుకర్మములను నొసఁగుట నిత్యం
బరయుఁ గథ నీవు విను శ్రీ
హరి భక్తారాధనమున నయ్యెడు దానిన్ 103

సీ. రమ్యంబులై యనురాగంబులగుఁ దోఁ
చేరంబులందు సద్వృత్త మగుచు
లలితమై తగుఁ గమలాపూర్ణనగరంబు
మణి మందిరంబుల మణి విచిత్ర
తోరణంబుల మణిద్వార వేదుల మణి
కుట్టిమంబుల మణిగోపురముల
మణిసాలముల మణిమంటపంబుల మణి
[1]చంద్రశాలల మణి సౌధములను

తే.గీ. నిర్మలోదక కాసార నికరములను
సరస పుష్పప్రసవవన సంతతులను
ధర్మ విజ్ఞాన పురుష ప్రతానములను
నఖిల లక్ష్మీ విభవము నలర నందు 104

క. సురుచిరమగు హరివర పం
పరమాణిక్యమునఁ గార్తికమున జనించెన్
బరకాల సంజ్ఞుఁడగు ముని
హరికార్ముకాంశగుఁడు కృత్తికార్క్షమునందున్

---

1 మూ. చంద్రశాలముల

క. భగవత్ప్రియుఁ డగు నా మునిఁ
దగఁ జిర మతి వృద్ధిఁ బొంది యప్పుడు పరత
త్త్వగుఁ డయ్యె నా గరీయుఁ
డగు సత్యక ధర్మ వేత్తయగు ఘనయంబున్ 106

సీ. ధర్మజ్ఞుఁడును దయాతత్పరుండును నీతి
శాస్త్ర విశేష విశారదుండు
ననఘుండు సర్వ శస్త్రాస్త్ర విదుండును
సంగర మార్గ విచక్షణుండు
విమల గుణుండును నఖిలలోక ప్రియుఁ
డను కీర్తి పరుఁడును (¹మను విహితుఁడు
నమలిన చిత్తుండు సముచిత) మంత్ర వి
చక్షణ రతుఁడును సత్యవాది

తే.గీ. యగు పరాంతక మౌని యత్యాదరమున
భవ్యుఁడగు చోళధరణీపాలు రాజ్య
భార మెల్లను దనదు ప్రభావమున వ
హింపుచుఁ దనర్చె జనముల కింపుగాఁగ 107

క. నిరతం బా చోళమహీ
వరునకుఁ బ్రియమైన మంత్రివర్యుఁ డగుచు సు
స్థిర మతిని వెలయు చుండును
గరుణాకరుఁ డగు పరాంతక మునీంద్రుఁ డొగిన్ 108

---

1 మూ. లేదు

క. ఆ సమయంబున నాగపు
రీ సాన్నిధ్యమునఁ దవరు శ్రీకర నళినీ
వాసము బంధూల్లాగము
కాసారము శ్వేత సంజ్ఞకము భాసురమై 109

మ. అరవిందంబులఁ గైరవంబుల సముద్యల్లీలమై మ్రోయు ష
ట్చరణా భృంగనికాయ మంబురుహ వాటుంబాడ్కఁ గాపించి యం
బరమున్ చెప్పని నోఁకఁ గా నతఁడు ప్రేమం గౌఁగిటన్ జేర్చెనాఁ
బరగెన్ డిండిర పుష్కరంబుగుచు నవ్యద్మాకరం బున్నతిన్ 110

సీ. కల్హార ధూళికా కల్పిత ధూరుహ
పటలి ప్రభూత విభ్రమ మెసంగ
న్థూ గంధర్వ సమాగత భ్రమరాళి
ఝరరహూసిత మధు సరము నగుచు
సరసీరుహావాస చక్రవాకోన్నతి
రస దేవతా కుచ ప్రతిభ మించ
రాజిత క్రేంకార రాజహంసచ్ఛద
[1]ప్రాదుర్భవార్ణవ పటలి గాఁగఁ

తే.గీ. తనరుఁ జందన కుంద మందార నీప
జంబు జంబీర ఘుసృణ రసాల సాల
పనస వంజుళ ముఖ తరు భాసమాన
దైన శిఖరంబు శ్వేత సరోవరంబు 111

1 మూ. ప్రాదుర్భవాతార్క

### భాగవతాగ్రణికిఁ గుముదవల్లి యను కన్య లభించుట

క. వికసిత కల్హార జాత
ప్రకరంబగు నా సరోవరమునందు సము
త్సుకముగ కుముదాంతరమునఁ
బ్రకటమతిం దొరలుచు నొక్క బాలం గనుచున్. 112

చ. ఘనతర పద్మరాగ రుచి గల్గిన హస్తపదోదరంబులం
దనరి పయోధర స్థితి నొనర్చు తటిల్లత ము త్రియౌచు ని
జ్జనముల కద్భుతం బొదవఁ జారుతర ప్రతిభన్ రసాతలం
బునఁ గల నీరసస్థలిని బొల్చిన తైవడి ముద్దు సుందరిన్ 113

క. వనరుహ పత్ర విశాలా
క్షిని యరుణాధరను భృంగచికురను సుకరన్
గని యొక భాగవతాగ్రణి
యనపత్యుఁ డపత్యకాంక్ష ననుమోదితుఁడై, 114

క. నెవరున నబ్జంబుం గొని
ఘనతరమతి నరుఁడు నిజనికాయంబునకున్
జని భార్య కొసఁగె నప్పు డా
వనితామణి దానిఁ బ్రోచె వాంఛాపరయై 115

చ. దినదిన మా తలోదరి యుదీర్ణతర ప్రతిభా సు[1]గణ్యయై
యనుపమ సుందరత్వమున నొప్పదమై తనరారుచో ముదం
బునఁ గని తల్లిదండ్రులు ప్రపూర్ణ మనస్కత నుండి రత్తఱిన్
నెవయఁగ దాము గాంచు ధన మీ సుదతీమణిగాఁగ నెన్నుచున్ 116

---

1 పు గుణ్య

సీ. తన కైశికమరీతి ననయంబు విఖ్యాతి
యింద్రనీలపు ధాటి నీసడింపఁ
తన కన్నుఁగవతీరు ఘనతర ద్యుతిమీరు
సారసంబుల దారి గేరడింపఁ
తన మేని తిగినంచు ననుపమంబుగ మించు
ఘనగతంబగు మించు ఘనత డింపఁ
తన మోము సిరిసొంపు ననురాగమునఁ బెంపు
గల యిందుకళగుంపు రహిత నింపఁ

తే.గీ. తనరు వనమాన సుందరతా నిదాన
మధురతర గానవిపుల సమ్మద విధాన
మత్తగజయాన భాగ్యాయమాన మాన
వైభవానూన యా దావ వసుధలోన 117

చ. అడుగుల తేఁటిగుంపులకు దాసలు పెట్టును మోముటగ్గు నే
ర్పడఁగఁ జకోరపంక్తి కమరాగ మొనర్చును నైశికద్యుతుల్
కడుఁ బ్రియమున్ ఘటించు జనుగా బిగిగా వగగాఁగ నెమ్మితి
పడఁతుకఁ బోలఁ డీ జగతి పెఁ గల్ గామిని యింత జేసియున్ 118

క. మొగమా శశి కమ్మం దో
యగమా రాజీవతతి సమంచిత కోకీ
యుగమా చన్గవ యసితో
రగమా నూఁగారు నద్దిరా మానినికిన్ 119

క. కరములు కమ్మలు కమలా
కరములు హెక్కిలి విలాసాంబకాక దిశా
కరములు నెమ్మోము కథా
కరములు చూడ్కులు కాంక్షకరములు సవ్వల్. 120

చ. పలుకులు పంచదారలు వికాసిత హాసవిలాస విందులా
దలుకులు వాలుఁజూపులు మదారతి విందిన పద్మరాగ పూ
ములుకులు మేనికాంతుల సమున్నతి జాతి సువర్ణవర్ణముం
గులుకులు గర్గా నీ కలికి గుబ్బలు గుబ్బలు లబ్బురంబుగాన్ 121

సీ. పగడాల నగడాల దిగఁజాఱఁగాఁ దోలు
వాలారు పెదప్రవాళరుచులు
జిలికంపు నునుకెంపుగంబొంపుల హసింపు
నింపుఁ జెంపగు నధరంపు సిరులఁ
దొగరెన్నుఁ దొగదెన్ను నాగి మున్నుగాఁ జన్ను
మిన్న గ్గుబ్బ గొన్న తన్ను గవల
నిగిడెడు నా కారు సొగసూరఁగాఁదోరు
కదుఁ దొల్పారు నూగారు దిగల

తే.గీ. నంటుఁ గల్యాణి రుచిర నీలాహివేణి
పృథు కరోల్లాస సుకర రాంపెయదాకు
మహిత సౌందర్యగుణపేటి మదనకోటి
గరు జామర తరువల్లి కుసుమవల్లి 122

చ సురుచిర ధర్మకాంక్ష నగుచున్ ముని నే నొనరించువర్తి సు
స్థిర యగు నీ ప్రతిజ్ఞ మునిశేఖర దీమదిఁ దప్పనేని ని
ర్భరమతి నర్థనేను గలుపంగలవార వటంచుఁ జేసి యా
తరుణిని విష్ణుశక్తి గల తామరసాస్యను సంగ్రహింపుమా. 128

తే గీ లక్షిత గుణానురూప నయ విచార
విభవరేఖా సమాఖ్యాత శుభసమేత
భాగ్య విఖ్యాత నిస్తుంభావ జాత
నీ తరుణిఁ గొమ్ము మునినేత యింపుదేర 129

## పరకాలుఁడు దానిచేసి కుమారవల్లిని పెండ్లాడుట

క అని పరమ భాగవతమణి
యనుపమ గుణయైన యాతఁ దాదినదొ న
మ్మునిపర్యుండు పరాంతకుఁ
డనియెన్ శపథోక్తిఁ జేసి యా ఘనుతోడన్ 130

తే గీ ఇంపు మీఱంగ నే దాన యిత్తు నీకు
పాలింపుము నా వాక్య మనవరతము
నంబుజదళాక్ష భక్త సహస్రకంబు
నెంచి భుజియింపఁ జేసెద నిద్ధచరిత 131

క నే నాడిన వాక్యం బో
మానేశ్వర సత్యము సమంచితగతి నీ
మానసమునఁ దలఁచి నీ
సూనను నా కొసఁగు మటంచుం గోరనసెంచెన్ 132

క. భగవంతుని గాథాంతిన
పగటుగ విన్నంది మును ప్రపన్నులనగు నా
భగవతమతియగు నీ సుత
పొగ డొంద నొసంగి యధికపుణ్యము గనుమీ 188

క. అని పల్కిన నమ్ముని యా
మనుజపతుఁ డన తనయ నొసఁగఁగఁ బరాంగదుఁ డిం
పునఁ గైకొనియె విధానం
బునఁ బరిణయ నరతి మోదమున నిర్ధరతన్ 84

పరతాలుఁడు నిరంతరము వేయిమంది భాగవతులను భుజింపఁజేయుట

తే.గీ. అంత భార్యా సమేతుఁడై యరిగి బంధు
యుతుఁడునై పరతాలుఁ డీక్షిత పవిత్ర
తంబగు స్వకీయపురిఁ జేరి ధన్యమైన
యాత్మ గృహముఁ బ్రవేశించె ననఘమతిని 186

వ. అప్పుడు భర్తృసేవయఁగు భార్య పరాంతకు నుద్దేశించి వందనాక్షతగ
పత్ర ప్రసర్పందనాద్యర్ఘ్య ధూపదీపంబులం జేసి భక్తివలన సమర్చనంబు
భాగవత సహస్రకంబు సమర్పించి పిదప షడ్రసోపేతంబును సాధు
కృతంబును భాగవత భుక్తశేషంబును నగు చతుర్విధాన్నంబు భుజియింప
వలయు నటఁ బదర్పిత తాంబూలవస్త్ర విశేషంబులంగొని ప్రవర్తింప
వలయు నని పల్కిన పల్కులకించి కౌశస్థానంబున కధిపతియగు భూపతి
యును వైష్ణవులగు రన్నుంగనులును లోకంబునఁ ద్వితీయంబగు పదా
ర్థంబు భుజియింతురు గాక యన్న తత్సంపాదితంబగు పదార్థంబు భగవద్భా

చ తనపురిఁ బట్టుమట్టిన యుదగ్ర బలాఢ్యులఁ గౌరవభూపతిన్
విని పరతాలఁ దాగ్రహ నివేశ మానస మూర్తి యౌచుఁ దెం
పున వెడలెన్ సమగ్రబలముం గొని తాను నృపాలుతో రణం
బున నలపంగ సర్వజనముల్ వెఱఁగందఁ బ్రతాపశాలియై 140

మ అతి నిష్ఠుర పంపరారవ సముద్వల్లంపటైఁ గొల్చు ను
ద్ధత టంకారవ రావముం గలుప యుద్ధామ ప్రతాపోద్ధురుండై
క్షితినాథోత్తమ వాహినీనికర పుంజీభూత ధాత్రీస్థలిన్
ధృతిమైఁ గొల్చె బరాంతకుండు పటుదర్పోదార చేతస్కుండై 141

సీ అగ్నిహోత్రంబు లిట్టట్టుగా నిండు హే
షారవంబులు గల సైంధవములు
సర్వ సర్వంసహా చక్రంబుఁ దలకిందు
పదమట్టనము గల భద్రకరులు
మధ్యందినార్కాభ మండలం బొరయు ధ్వ
జ పతాకల నొప్పు స్యందనములు
ప్రళయరుద్రుని రీతిఁ బటు విక్రమస్ఫూర్తిఁ
గైకొని హుంకించు కాల్బలంబు

తే.గీ బరుపడించి పటాటోపి నొక్కమొగిని
దాఁకుచోఁ బరబలుఁ దుదగ్రమూర్తి
యగుచు వాహినీపతి యత్యద్భుతముగ
దాన సింహనినాదంబుఁ జేసె యప్పుడు 142

క. తురగములఁ గూల్చి నిష్ఠుర
కరికుంభంబులఁ బగుల్చి గాఢతర రథో
త్కరము మెఱల్చి పొరల్చెం
బరరాజులఁ డు నృపతిబాలుం డమరఁ జెలంగెన్ 143

వ. అమ్మహాబలంబు లంబయినంత విదారిత గంధర్వ బృందంబును విగళిం
గిత మదగంధ సింధురంబును విభిన్న స్యందన సందోహంబును వివేర్ణ
మాన పదాతి విధానంబును నగు సముత్తుంగ సంగరాంగణం బాలోకించి
నింగిపెంపునం గుంపుగొని దివిజులు సొంపువాటింప నప్పు డా బోర
మహీపాలుండు హతాశ్వరథతురగపదాతియగుచుం బిమ్మిదీయక పటహ
భేరీ ముఖ కాహళ ధక్కానినాదంబు లుఱ్ఱంబులఁ బర్వఁ జేసి యంత
రాకృతియగుఁ బరాంతకునితోఁ దలంగి యనుపమంబగు యుద్ధంబు
గావింప నప్పు డయ్యిరువు రన్యోన్య పరలాఘవ కరలాఘవంబునం జేసి
వింయ బీభూత నిర్ఘాత పాతంబుల రెగ్గుగావించు నమోఘశస్త్రాస్త్ర సంఘా
తంబులచేఁ బ్రఫుల్ల నితాంత వసంత సమాగత కింశుకాశోక మహీరుహం
బులు దార్చున రక్తసిక్తాంగులగుఁ దోరాడుచుఁ గృతప్రతికృతంబులగు
వక్రభ్రమణ చాపాసి కుంతంబులం గల్గి మహావీరు లగుచు బహుకాలంబు
యుద్ధకుశలు లగుచు యుద్ధంబుఁ జేయుచుండి రనంతరంబ, 144

చ. అవనివిభుండు బాణనివహంబులఁ బిట్టుఁ దొడంగి గండి పై
న్నవుని పురోధరన్ నిలువ శక్తుఁడు గాక పరాఙ్ముఖుండునై
చెవియునఁ బాఱిపోయి తనస్థానముఁ జేరి ధరాధిలోక ము
త్ప్రవహ మనీషఁ జింతఁగొని [2]యాత్రఁ గూర్చి నివార్చు దార్చుచున్

1 మ. చాపాసి కృంతనంబులం 2 మూ. యాప్తు

తే. గీ. అనియె నిట్లు పరాశయం బంది తాను
ఆవమునార యుపాయంబు గాని పరాంత
కుని ఏటకుఁ దోడుకొనిరండు గురుతరోక్తి
నమరు సంప్రయమున వార లట్ల చేయ 146

పరాంతకుఁడగు చోళమహీపతి పరకాలు కడకు ధనమునిమిత్తము
మంత్రుల నంపుట

వ. అంత 147

క. అరియఁ దన పురికి వచ్చిన
గురుతరమతి యగు పరాంతకుని కడకు సమ్య
గ్ధురులగు సచివులఁ బనిచెన్
నరపాలసుతుండు చోళనాయకుఁ డర్థిన్ 148

చ. పనిచినఁ బోయి యా పరమ భాగవతోత్తముఁ గూర్చి వార లి
ట్లనిరి పరాంతకా నరవరాగ్రణి ధర్మముచేత మాకు రాఁ
దవలిన ద్రవ్య మంతయు మదారత నివ్వ మటంచు మమ్ము దెం
పునఁగాని పంచె నీ కడకు భూరితరాద్భుత చిత్తవృత్తియై 149

తే. గీ. అనుడు మంత్రులవల్ల ధరాధినాథ
వార్త మాలించి పరకాల వైష్ణవాఢ్యుఁ
డిదియె ధర్మంబుచేత నేనివ్వఁ దగిన
ధనము నిప్పుడు మటుగాన వినుఁడు మీరు 150

క. అనయంబు వైష్ణవారా
ధనమునఁ దన్నిమిత్తమైన ద్రవ్యంబు [1]వ్యయం
బు నగుట నేని ట్లింపుడు
ధనము నృపున కొసఁగఁగ సుదార స్థితిగాన్ 151

---

1 మూ ప్రయం

## వరదాభినవ హస్తిగిరీశుఁడు స్వప్నమున సాక్షాత్కరించుట

సీ. అని యివ్విధంబున నమ్మునివర్యుండు
 చింతఁ జేయుచు నిద్రఁ జెంది యుండు
తఱిని స్వప్నంబునఁ దామరసాక్షుండు
 హస్తిగిరీశ్వరుం డద్భుతుండు
ప్రత్యక్షమూర్తియై పాణిపల్లవమున
 నతని స్పృశించి మహా[1]యశస్క
రమ్మగు కాంచీపురమ్మున కిమ్ముగ్రతి
 ఏరుఁ దోకొని దివ్య పవిత్రతేజ

తే.గీ. ద్రవ్యమంతయు నీ కిచ్చెదను ప్రియంబు
తోడ నని పల్కి యప్పు డదృశ్యుఁ డాయె
నత్రుఁ డంత జాగ్రతుం డౌట నిర్మలాత్ముఁ
డతఁడు వెల్గాని తోషిత స్వాంతుఁడగుచు 152

తే.గీ. అపుడు బ్రాంతుఁ దద్వసుధాధినాథ
సచివముఖ్యుల తోడుత సత్వరమున
మహిత దీప్తిప్రభాభ్రాజమాన మగుచు
నరుగఁ జెన్నొందు కాంచికాపురముఁ జేరి 153

ఉ. వరదుని భక్తవత్సలుని వారణశైలనివాసు నిందిరే
శ్వరుని దయాసముద్రుని నివారితకల్మషుఁ గాంచి భక్తితో
ధరణిఁ శిరంబు సోఁకఁగను దండము వెట్టి ముదంబుఁ జేసి ని
ర్భరలిర రోమకంచుకిత భవ్యశరీరుఁడునై యుదారతన్ 154

---

1 మూ. యశస్త

తే.గీ. ఒరుల యాచన కన్న హీనమును లేదు
విష్ణు భక్తి విహీనుఁడై విప్రుఁ డ
వైష్ణవుండగు ధరణీపాలుఁ డా
యెంచ కంటెను లేదు పాపంబు ధరణి 164

సీ. అటుగాన శ్రీ వైష్ణవారాధనార్థమై
కృతిఁ జోర వృత్తి నే చేయువాఁడ
విత్తయుంబు కొఱకుఁ గావింపని దొంగకు
దోషంబు లేదు నిర్దోషి యగుట
నీ యుపాయము కన్న నితరమైన యుపాయ
మేమియుఁ గానరా దిందువదన
ద్రవ్య రక్షణ మందుఁ దలఁపంగ నిది యని
పలికి పరాంతకుం డంఘ్రిమతిని

ఆ.వె. ఖడ్గచాపధరులుగా మించు భటుల న
మానుషైన వారి మహిత వృత్తిఁ
జేసి భయము వీడి చేకొని యపుడు న
ధార్యుఁ డగుచు వెడలె ధైర్యమునను 165

పరకాలుఁడు స్త్రీయోపార్జిత విత్తంబున వైష్ణవారాధనంబు సల్పుట

ఆ.వె. ఖడ్గ చర్మధారిగాఁ గ్రాలించు నా
ఘనుఁడు భటులతోడ గహన సీమఁ
గొప్ప యందు నొక్కచో నివాసము చేసి
యుండెఁ జోరవృత్తి నొనరు మదిని 166

వ అనర్ఘళం బగు మార్గం బావరించి కొని యుండి విప్ర దిహ్న ఏహీనులగు పథికులపలని రత్నాదికంబగు ధనంబు గైకొని దారాద్రవ్యంబునంజేసి యనపుటతంబు మహాత్మకంబగు వైష్ణవ సహస్రకంబున కారాధనంబు గావింపుచు సంపూర్ణ హృదయుండై యుండె నంత నొక్క సమయంబున వైష్ణవ ప్రియుండును బలియుండును నగు పరతాలుండు ధనార్థి యగుచుఁ దా రాత్రియం దొక్క నగరంబుఁ జేరి యందుఁగల వైష్ణవ ద్వారో పాంతంబునం దధివసించి యున్న యెడ వా గృహిణి స్వర్ణపాత్రంబు హస్తంబునం గొని గృహంబు వెడలుటం గని ప్రభావిద్యోతమానం బను దర్కారిష్టంబగు భుక్త భాజనంబు సంగ్రహించి నవ్వుచ యుత్కోపి గురుతో నను యని పలికి వెండియుఁ గృహంబుఁ బ్రవేశింప నవ్వార్థంబు నంజేసి యా [1]తస్కరేంద్రుండు భయాకులుం డగుచు నిది వైష్ణవ ద్రవ్యం బని భ్రమ్మబ వా పాత్ర వా ద్వారంబునం దునిచి యంద యధి వసించెను

తే ఆ కాంతారత్నంబు భ
యాకుల చిత్తమున సర్వ మాత్మపన క
స్తోకత నెఱుఁగఁ జెసిన
నాతుగం మునీ తోషితాయత్తుండై 168

తే గీ చిత్త మిగురొత్త నవైష్ణవోత్తముండు
తనదు సతి పల్కునట్టి వృత్తాంత మాల
కించి మానిని నాకు లక్షించి చూడఁ
దెలియఁగా నొట దిని చేఁ దేటపఱతు 169

1 మూ చతుష్కపిండుగిండు ? నాలుగు విధములగు దొంగతనములు చేయువాఁ డనియా?

క. అనయమ్ము వైష్ణవారా
ధనమునకు భక్తిఁ జెసి తత్పర మతిన్
ఘనుఁడు పరకాలమునిపతి
మనసారఁగ నాని పదార్థముం గొనియెఁ జూమి 170

చ. సరసిజగంధి యాతఁడు వసిష్ఠుఁడు వైష్ణవ పారిజాత మా
త్సరమతి దీని నిట్లు సముదారతఁ గైకొని యుండె నేని వి
ద్ధరణితలంబునన్ మనము ధన్యుల మైతి మటన్న యమ్మునీ
శ్వరుఁడు దయానమ్రుఁడు నివారితకల్మషనిష్ఠుఁ డమ్మొదన్ 171

ఆ. ఆ మృదూక్తి విని మహాత్ములు విరలు
వైష్ణవోత్తములు సదార్యమతులు
గాన వీరి సొమ్ము గైకొనరా దని
ద్వార సీమ నర్ఘ పాత్రఁగ నిడియె 172

వ. అయ్యవసరంబున 173

క. వనితామణి మ్రుంగిట నుం
డిన పాత్రంబును విలోకించి తెందంబైన సొం
పును గదుర మతియుఁ దనపతి
కనుపమ మతి విన్నవింప నాథుఁ డంతన్ 174

ఉ. కోక మనస్కుఁడౌచుఁ దన సుందరిఁ గూర్చి వచించె మాళిపీ
యీ కలధౌత పాత్ర మతఁ డిష్టమతిన్ గ్రహియింపఁ జేసి నీ
దా కులాత్మ నేమిపడ కాడితి వప్పులు తీర్పించు మిం
దా విమలాక్షి యిట్టులఁ దన వాసలి యిట్టనె భక్తియుక్తయై 175

క. సుతరుండై యూఁతలి గాను
సకలశ్రీ ప్రత్యక్షంబుగ గొనంగను నవ్యం
బతిలంబి గుణుంచు పరాం
రత మోహింద్రుండు భక్తి తత్పరమతియై 185

ఆ.వె. ఆ ఘనుండు వైష్ణవారాధనముకొల
తయనమున వసించి యఖిల దికల
వరయు చుండె రాతి రసుల దొలంగి యా
తాత వాంఛ వాసి యతుం మతిని 186

తే.గీ. అంతఁ బ్రియభక్తు దైవస్థ యా మునీంద్రు
హృదయపద్ధి దెలిసి జగదీశ్వరుండు
శౌరి సంతుష్టుఁ డగుచు సుదార సరసి
కష్ట కుభదాయి యగుచు భాసింపుచుండె 187

సీ. [1]అమలులౌ సిద్ధయోగ్యాద్యనంతాదులు
వనధి మానసులు శౌరి ముఖ్య
యోగివర్యులు మహాభాగులు సనకాది
మునులును దివ్యుల పురహరాది
దైవతంబులు గొల్వఁ దామరసాక్షుండు
మంగళ ప్రదుఁడు శ్రీరంగభర్త
జగములకును మాతయగు రమాదేవితోఁ
గూడఁ దాక్ష్యారోహకుండు వగుచు

1 మూ. అమలురౌ

తే.గీ. సకలభూరుహ సముదయ ప్రకటమగు మ
హా గహనవనం గల్గ పరాంతకాం
చ్యంబుఁ గూర్చి చనుదెంచు నచ్యుతుండు
భక్తుం గనియె సంతోష భరితుఁడగుచు 188

క. ఇరఁడు పరాంతక[1]తాపస
పతి వెలుపటఁ దిరుగు నాపు ప్రాణం బగుటన్
సకలము మత్రియుంతు సక
హిత మతుఁగు వేంబునొంచి కెడు నవ్వంబున్ 189

క. నిజదినము వైష్ణవాగా
ధన మొనరింపకయుఁ బరమ ధార్మికుఁ డగు స్వాం
గనతోడ భుజింపఁడు దా
ననుపమ మతిఁజేసి యా మహాత్ముఁడు భక్తిన్ 190

క. ఈ విధమున బహారితుఁ
డీ వైష్ణవకోటియం దభిన్నముగా న
ద్భావమున మదర్చకముం
గావించుచు నుండు భక్తి గంపాఁడగుచున్ 191

మ. తన మార్గంబున వారియందు జనసంతానంబువచ్చిన ధనం
బును లేకుండుటఁ జేసి చింతిలి యసంపూర్ణాత్ముఁడై నిష్ఠచే
లను మద్భక్తుల పూ వీరుల కనుజ్ఞాసహాంబు వాటింపు టీ
యనవు ప్రొక్కుఁ దపార్త్యగం బట నిరాహారుండుగా వర్తిలున్ 192

---

1 మూ. తప.

తే.గీ. నిత్యముక్త ఎతి వ్రతుండు నిరతవాస
నాసి నిద్దరమనుఁడు సురక్షి ముక్కి
వంచితుం దప్పరోగల వారయుతుఁడు
గా సముల్లాసి యగుచు నుద్ధార మతివి 202

క. వామాంచిత లక్ష్మీ
భూమీ నీళాదులైన భామలతో ను
ద్దామ స్థితిఁ గైకొని హరి
కామరసాత్ముండు సకల ధర్మాన్నదుఁడై 203

వ. వాలవ్యజన పర్యంత వితాన ధవళాతపత్ర పరిశోభితుండును వేదాంత వేద్యుండును గోటి భాస్కర ప్రభాభాసమానుండును నగు భగవంతుండు దృగ్గోచరుండగుచు యష్టాక్షరాత్మకుండగు నా జగదీశ్వరుఁ గాంచి యప్రియశిష్యాగ్రేసరుండు వివిధ నిగమోక్త సంస్తవంబులఁ గొనియాడి మహనీయ హర్షప్రాదుర్భావుండును నానంద్రాశ్రు పరిష్లుతుండును నగుచు దేవ దేవుండగు శార్ఙ్గి యనుగ్రహంబునం జేసి యాతని ప్రబంధయును గావించి మహానుభావుండగు వాశ్రిధవున కర్పణంబు సేయ నా మురాంతకుండు గృపాపూర్వావలోకనంబు నతనిం గనుంగొని గౌఁగిటం జేర్చి గారవించి పరమంబగు నిబంధనంబు గూర్చినదియె నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాతోత్తర ఖండంబునందలి ద్వాత్రింశాధ్యాయంబు భక్తి పరాయణుండగు నారాయణుండు సకల ప్రజ్ఞా ధురంధరుండగు నరునకుం జెప్పె వెండియు నిట్లనియె 204

## పరకాలుఁడు శ్రీహరి దివ్యక్షేత్ర యాత్ర సల్పుట

క. అంతట శ్రీ మంతుండు ప
రాంతక మాహేశ్వరుం డుదగ్ర వలాద
ధ్వాంత దివాకాంతము న
త్యంత సుఖనిరాంత మనమవాంతము నగుచున్ 205

క. పరఁగెడు శ్రీరంగము న
య్యరవిందాక్షాంతరంగ మాశ్రితజన హృ
త్సరసీరుహ సారంగము
గురుతర మతిఁ జేరి భక్తిఁగొలి యతఁ డంతన్ 206

తే.గీ. అందుఁ దనరారు రంగనాయకునిఁ గాంచి
హర్ష నిర్భర హృదయుఁడై యతనిపాద
పంకరుహ యుగళముఁగూర్చి ప్రణతిఁజేసి
యాస్తికాత్ముండు పరమయోగివరుఁడు 207

తే.గీ. మహిని వర్ధిల్లు నాపాద మస్తకంబు
సంస్పృశింపుచు భక్తి సంసక్త చిత్తుఁ
డగుచు గద్గద నిస్వనుఁ డగుచుఁ బ్రీతి
హృష్ట రోమాంచలుఁ డగుచు నింపు మీఱ 208

క. నిగమ నిగమాంత సూక్తుల
భగవంతుని సన్నుతించి పరమానందా
జగతిం గొన్నాళ్ళుండెన్
జగదీశ్వరు పాదసేవ సలుపుచు భక్తిన్ 209

తే.గీ. అంత శ్రీ వేంకటాధీశు వరయు జూడఁ
గోర్కి గావింపుచును మునికుంజరుండు
పావనదయాబ్ధి యగు రంగపతి యాజ్ఞఁ
బడసి శ్రీశైలమున కేగె భవ్యమతిని 210

ఆ.వె. అంత నతని యాలయముఁ జొచ్చి నరసింహుఁ
బరమ విభునిఁ గూర్చి ప్రణతిఁ జేసి
యచట నరిగి యాత్మ నద్భుత భక్తిఁ ప
ర్వలని వరదుఁ గాంచి సంతసమున 217

క. దివ్యస్తోత్రంబుల నా
భవ్యుం గొని యాడి మ్రొక్కి పరమద్యుతి నం
దావ నగు శ్రీగిరి కా
సవ్యగుణాఢ్యుండు మౌనినాయకుఁ డరిగెన్ 217

క. మేలైన భక్తిఁ గాని శ్రీ
శైలారోహణముఁ జేయ శంకింపుచు న
స్వేశం దన్ముని దర్శన
మూలంబగు భక్త తీర్థమున వసియించెన్ 218

క. అందు దినత్రయ మతి భ
క్తిం దలఁకొని పంచబాణు దివ్యాకృతి సం
క్రందన ముఖవినుత పదర
విందుఁ జతుర్భుజుని విష్ణు వినుతించు తరిన్ 219

సీ. శ్రీశైలనాథుండు శ్రీనివాసుఁడు జగ
న్మయుఁడు పోషిత భక్త మండలుండు
పృథుల వక్షుఁడు దివ్య పీతాంబరధరుండు
దురిత హారకుఁడు చతుర్భుజుండు

సమదర్శకుఁడు శంఖ చక్ర గదా ధరుం
డతి సుందరాంగుఁ డనంతశాయి
హారకేయూర కోటీర మణి స్ఫుర
కుండలాంగద భూషణుండు దివ్య

తే.గీ. గంధలిప్తాంగి కారుణ్య కలితబుద్ధి
శ్రీ సతి భూమి నీళావిశిష్టుఁ డగుచు
తనదు భక్తునిఁ గనుగొను తలఁపుఁజేసి
వచ్చె కౌఁగిట వానిఁ గ్రుచ్చి యెత్తి ౨౨౦

క. జనకుని కరతలఁ గరాంబుజ
మున గాత్రము నిమిరి యతనిఁ బ్రోదిని దో నా
మను నడుగుఁడమ్మం దెలిఁగి
యనుపమ మతిఁ బొగడె నా పరాంతకుఁ డర్థిన్ ౨౨౧

వరదాయుఁడు శ్రీరంగమున గోపుర సప్తప్రాకార
నిర్మాణము గావించుట - శిల్పులకు మోక్షమొసంగుట

వ. ఇట్లు స్తుతియించి యమ్మహాత్ము వసుమతిం బరసి దివ్యంబులగు హరి
క్షేత్రంబు లన్నియుం గలయం దిరిగి యందందుఁ గల మూర్తులం గొని
యాది క్రమ్మఱ శ్రీరంగంబున కేతెంచి యా శ్రీరంగ క్షేత్రము సొం
సప్తకంబు గావించెదనని మనంబున సంకల్పించి శ్రేయోపార్జితంబులగు
వస్తువులం జేసి శిల్పులచేత దివ్యతుంగ వృషహారంబులును సగో
పురంబులును నగు సప్త ప్రాకారంబు లుదారంబులుగాఁ గావింప నా
సమయంబున నంబరమం బగుటం జేసి ద్రవ్య వ్యయన చింతా పరుఁ
డగుచు ఘనంబులచేత నాగపురంబునందుండు స్వర్ణమయముగు దైన

ప్రతిమ గావించి నిజ బంధువులతోఁ గూడఁ దా నందుఁ జని ప్రహృష్టాం
దగుచు బహువిధోపాయంబులం జేసి దానిం గైకొని రంగక్షేత్రంబున
కరుగుదెంచి శిల్పులకతి యొసంగి దృఢంబులును నాయతంబులును నగు
గాంచనంబుల సంపూర్ణంబులుగాఁ గట్టించి పెండియు దారుచే మూప్పది
రెండు మంటపంబులు నిర్మింపంజేసి యప్పురాంతకుండు ధనంబు
యాచింపుచు నా శిల్పులకై ధనం బెటుల నివ్వఁ గలను పరమంబగు
కైవల్యం బొసంగెద నదియే లక్ష్యకోటికర్ష సమంబని చిత్రంబున దివ్య
యుండి దారం నావయం చెక్కించి యగాధంబగు కవేరికా పమల సలి
లంబు నందు మునుంగం జేసి శిల్పులకు శాశ్వతి యగు ముక్తి నొసంగు
మని శ్రీపతి యగు హరిం బ్రార్థించె వివిధంబైన భక్త వత్సలుండగు
భగవంతుండు దత్రేతఁ బ్రార్థితుం డగుచు వారి కందఱికి యోగి దుర్లభం
బగు పదపర్గం బొసంగ నా శిల్పు లందఱు మఱి ప్రణయమానంబులగు
విమానంబులతోఁ గూడ నిక్షేపంబుచున్న దివ్యజనుల తాత్పర్యంబుగాఁ
బరము పదంబుఁ గూర్చు నని యనంతరంబు 222

పరకాలుఁడు జైనులను శ్రీకవియను వైదగురుని జయించుట

సీ. మహి సువర్ణ ప్రతిమా లోలుఁడగు నప్పు
రాంతకుఁ దెలిసి రయంబు లోన
నరిగి [1]జైన మనుష్యులందఱు సర్వంబు
భూపతి కెఱిఁగింప భూరి బలుఁడు
పాండ్య భూపాలుండు వారి వాక్యము విని
తనదు దూతలచేత వడిఁ దోడ
న్నృపతియుఁ బరకాలు నయగారి రావింప
నా మహుం డా మనుజాధిపాఖ్యు

---

1 మూ. బౌద్ధ

ఆ. వె. నరకుఁ దోయుచైన జనుల నందఱఁ గెల్చి
మత్త దంతి నెక్కి మఱియు దాశ్వ
విజయ నిస్వనంబు వెలయింపఁ గాత్రితే
యాంశజాతుఁ డిస్త్రులానుబాదు 223

క. త్రికవి యనెడు శైవ గురుని
నాకరుని బిదబిద్యోశిష్య మెచ్చెడు మత సూ
త్రికముల నోడించి పరాం
తకుఁడు తదర్పిత నిజాంఘ్రి తామరసుండై 224

ఉ. వానినిఁ దాంత్యభూపతిని వారిజలోచనుఁడైన శౌరి యం
దూనిన భక్తిఁ గైకొని సమున్నతిగా వసియింపఁ జేసి య
మ్మౌని కులాగ్రగణ్యుఁడు సమస్త మతంబులయందు నెక్కుడుం
గా నియతోక్తిపై నిలిపెఁ గన్గొన వైష్ణవమౌ మతం బిలన్ 225

క. వంకజనాథుని కృపఁ జ
క్రాంకనులుగఁ జేసి వారి నంఘము మనీషన్
శంకలు దఱిపి పోషించె ని
రంకుశ నిగమాంత సరణి యగు వాక్కులచేన్ 226

పరకాలుఁడు యోగసమాధిలో రంగనాథునియందు లీనమగుట

వ. అంత వెండియు నుత్తమంబగు శ్రీరంగక్షేత్రంబున కేతెంచి భార్యతోఁ గూడ విరక్తుండై శ్రీరంగపతి కథకరంబు ననుమతిం బడసి మహాయోగి యగు పరాంతకుండు యోగసమాధింజేసి యతనియంద లీనుండై పరమ పదంబుఁ జెందె రంగేశదాసుం డగు విప్రవరుల పుణ్యచరితం బెవ్వరు

1 మూ. బౌద్ధ

భక్తిం జేసి వినుచుందురు వారు అధిక సంపదల నొంది పిదప నీశ్వరుండగు
హరి యుత్తమాశ్రయ నిలయంబుఁ జెందుదు రని మహాయోగి మాహాత్మ్యం
బును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి
త్రయస్త్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల
ప్రజ్ఞాధురంధరుండగు నరునకుం జెప్పెను 227

శా ఆదిత్యాంతరవర్తి భక్త నికర స్వాంతాంబుజ క్రీడ వా
హా దామోదర భారతీశ గిరిజాన్యాధీశ దృగ్భంగురా
స్వాద స్వాంఘ్రి పయోజయుగ్మ కరుణాపాథోనిధి శ్రీధరా
గోదామానస పీఠవాస ఘటకా గోపాంగనారామణా 228

క [1]జయనవిమతహారా శ్రీక
వి యశోక్త మత ప్రహార విపులతరవచ
శ్ర్యయ పరకాం మపీన హ్వా
దయ పంకజ భృంగ రంగ దైత్యవిభంగా 229

మాలిని నరస హృదయశీలా సర్వభక్తానుకూలా
నిరుపమ గుణజాలా నిర్జితారాతి పాలా
భరిత భువనజాలా భవ్యగాంగేయ చేలా
విరచిత శుభలీలా వేణుగోపాల బాలా 230

గద్య [2]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ పాండిత్య
ధుర్యావనరతావనీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ నృసమర్థతా కృత
పటహ ధణంధణారవ విపరీత పతనక్రియా ఢిల్లికాధీశ దుందుభిధ్వాన
కోలాహల హనుమద్ధ్వజాంక కనక దండకృత హీరకంకణ సంధీపిత

---

1 మా జయని మతహార 'త్రైన' శబ్దమునకు బదులుగా 'జయని' శబ్దము
ప్రాసస్థానమున గ్రాహ్యము మా 2 ఇతి

ప్రతాపకీర్తి ప్రధాన కౌసలవంశ పయః పారావార రాకా సుధాకర పెరాంబర
నాయక పౌత్ర రమణ భూపాలక పుత్ర లక్ష్మమాంబా గర్భశుక్తి ముక్తా
ఫలం రాఘవ భూనాయకాభిధాన సౌందర్యకలిత సుమసాయక విహారిపాద
నాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవపురాణంబునందు గోదాదేవి విర
హంబును విష్ణుచిత్తుండు శ్రీరంగంబున కేగుదెంచి శ్రీ రంగనాథుం
బ్రార్థించుటయు నమ్మహానుభావుండు సపరివారంబుగా ధన్విపురంబున
కుం జేయు విష్ణుచిత్తుం గద్నియతోం బరిణయంబు గాంచుటయుం బరతా
జనసంబును గుమదవల్లి వివాహంబును చోళమహీకాంత పరాంతక సంగ
రంబును బరకాలుండు స్త్రీయోపార్జిత విత్తంబునంజేసి నిరంతరంబు
వైష్ణవారాధనంబు సల్పుటయు రంగస్థల గోపుర ప్రాకార నిర్మాణంబును
శిల్పిమోక్షోపాదానంబును దిబ్రిరవి మతవిభంగంబును విష్ణుతత్త్వ సిద్ధాంతంబు
వను కథలుంగల సప్తమాశ్వాసము సంపూర్ణము

క. నారాయణముని యాత్రికి
పారాయణమును పఠించె భవ్యమతి నీ
కారూఢి దీనిఁ దెల్పుట
కై రంజిలి నాదుమది కుతూహలింపన్ ౬

## శ్రీ వృషపుర వర్ణనము

క. వినుమ సావధానమున నో
మునివర యవ్వృషపురచరితము నీకు నయం
బున వివరించెద వినఁగో
విన వారల కల్మషము హరింపగ జగతిన్

సీ. సంతతం బభ్రస్రవంతికి దీటుగా
బొదలెడు నిర్మల నదులు గల్గి
పాకశాసన వన ప్రతిభఁ జెంపొందుచు
నమితంబగు నందనములు గల్గి
యమరావతికి సరియై దివ్య సంపదఁ
దనరారు పట్టణతతులు గల్గి
భృగువశిష్ఠాత్రేయ ఋషి సమానస్కంధు
లైన విప్రసంచయములు గల్గి

తే.గీ. యమర ద్రావిడ దేశంబునందు సర్వ
భూరమంతయు మనోహరంబుగఁ దనర్చు
సంతతాభిల భాగ్యకర సరణిఁ బొల్చుఁ
బృథివి విఖ్యాతపదంబు శ్రీ వృషపురంబు. ౭

చ. అనుపమ తత్త్వరత్న ఖచితాలయ గోపురపాళి గల్గి సం
దనతతి మల్లెసిల్లి సముదంచిత నిర్మల నీర సారమై
తనరు సరస్స్రయంబున నుదారమునై ద్విజరాజిపైక్య భ
ద్ర రుచిరసౌఖ్య సంస్థితి విధాయకమౌ పృథుపట్టణంబునన్ ౮

సీ. తనదు నిర్మల మనం బనయంబు గమలాక్షు
దరపద్మమునకు బంధురము గాఁగ
తనదు చూడ్కులు సొంపుగాని వనమాలి కం
ధరమున కలువదండ గాఁగ
తనదు హస్తంబులు దామోదరునకు సం
తుష్టంబులైన పాదుకలు గాఁగ
తనదు కర్ణంబులు వనజనాథ కథామృ
తమునకు విపులకూపములు గాఁగ

తే.గీ. తన యభిప్రాయ మితరమత ప్రకాండ
గాఢ తామిస్రమునకు భాస్కరుఁడు గాఁగ
దగు మహాసూరి వంశ వర్ధనుఁడ ఘనుఁడు
వైష్ణవాగ్రేసరుఁడు కేశవ ద్విజుండు ౯

## శేషుఁడు రామానుజుఁడుగా నవతరించుట

క. ఆ వైష్ణవున కనంతాం
శావిర్భవుఁ డమితతేజుఁ డగు తనయుఁడు సం
భావిత విశిష్టమత ర
క్షా వహుఁడు దనర్చె విపులకౌతూహలియై. 10

వ. చైత్రమాసంబునందలి శుభదినంబునందు మంగళప్రదంబగు నార్ద్రా నక్షత్రంబు నందలి శుభలగ్నంబునందుఁ బ్రాదుర్భవించిన యమ్మహాను భావునకు జనకుండు ముదంబునం జేసి రామానుజుండని నామంబు గావించి 11

సీ. ఘనతరాత్ముం డగు జనకుండు తనయునిఁ
బంచసంస్కార సంపన్నుఁ జేసి
యుపనీతుఁ గావించి యపరిమితముగాఁ
దనరారు వేదశాస్త్రముల జెప్పి
రూఢిగాఁ బ్రహ్మ స్వరూపునిఁ గావింప
ధన్యుఁ డాతఁడు తన తండ్రివలనఁ
బ్రాజ్ఞుఁ డౌటయుఁ బరికించి రమ్యత
యగు కాంతి మతి మహాహర్షమొంద

తే.గీ. యౌవనస్థితిఁ బెంపొందు నాత్మజన్ముఁ
గాంచి జనకుండు బంధు సంతతియుఁ దగుచుఁ
బరిణయముఁ జేసి నిగమోక్త సరణి గాఁగ
నిరతిశయ సుఖమాత్రిఁ బరగు మదిని 12

రామానుజుఁడు కాంచిపురికిఁ జని వరదుని స్తుతించుట

క. అంతట రామానుజముని
కాంతుఁడు ప్రజ్ఞావళి గౌతూహలియై
సంతత ధర్మావృత గృహ
సంతతి గల కాంచిపురికిఁ జని యచ్చోటన్ 13

ఉ. పరగు సమస్తలోకవిభు భాస్కరకోటి సమప్రభున్ బ్రభున్
వరదుని భక్తవత్సలుఁ గృపామృతవారిధి దివ్యకాంచనాం
బరు నసితాభ్రవర్ణుని విభాసితసుందరగాత్రు దైత్యసం
హరు వనమాలికాధరు నుదారచతుర్భుజుఁ దోషితవ్రజున్ 14

సీ. శ్రీవత్స కౌస్తుభాంచిత మహోరస్కుని
సతతంప్రసన్న ముఖారవిందు
సారసాక్షుని దివ్యచందనచర్చితు
కరకరుణాపాంగు సుందరాంగు
శ్రీభూమి నీళాది సేవితపార్శ్వు
శార్ఙ్గ కౌమోదకీ శంఖ చక్ర
నందకధరు ననంతాది దీక్ష ము
క్తవర పూజితుఁ గమలనాథు

తే.గీ. హారకేయూరకంకణ కోటీర కుండ
లాంగదాది విభూషితు నబ్జగర్భ
శర్వ శక్ర సనక ముఖ్యసన్నుతాంఘ్రి
పద్ము పద్మాక్షు లక్ష్మీశుఁ బొగడుఁ గాంచి 15

క. మనమున సంతోషంబునఁ
బ్రణతి సలిపి నిగమసంస్తవ[1] పటిమం ద
ర్శనమానుని నాగడి మదిం
జన భక్తింగొని కరాబ్జయుగము మోడ్చి యటన్ 16

---

1 పఠితుంచు

క. శ్రీమన్నారాయణ హరి
సామజగిరినిలయ నీదు చరణంబుల ఘ
శ్యామగతి శరణు చొచ్చెద
భూమీధర శౌరి నిఖిల భువన శరణ్యా ౧౭

సీ. విశ్వరూపాయ శాశ్వతవిభవాయ
ఇందిరేశాయ యాద్యేశ్వరాయ
శ్రీ విష్ణవే సర్వశేషిణే సర్వ ని
యంత్రే విభూతిద్వయాధిపాయ
నిఖిలోత్తరే ధర్మిణే త్రిలోకేశాయ
పుండరీకాక్షాయ బుధనుతాయ
జన్మసంస్థితి వినాశన కర్మధారిణే
తే నమోనమ యని దివ్యమతిని

ఆ.వె. లాగదు వాఁడ నిన్ను భగవంత గుణవంత
శాంత వార్ధి రాక్షసాంత మౌని
కాంత హృదయ పంకజాంతరవాస య
నంతకాయ వైభవానపాయ ౧౮

తే.గీ. మనుఁడ వగునట్టి నీవు లోకములకెల్ల
రక్షకుఁడ వౌదు సత్ప్రతి రమ్యమూర్తి
జగములకుఁ గారణముండాగాఁ దగిన యరుప
దేవ తత్త్వంబులకు రాజవిద్ధ చరిత. ౧౯

సీ. పంకజాక్ష యజ్ఞ భూషణ రూపధారివి
పరమాత్ముఁడవు పరాత్పరుఁడ వగు
హరి పరబ్రహ్మంబ వజ్ఞానమత పరం
జ్యోతివి శౌరి దామోదర హరి
విశ్వమూర్తి సహస్రమూర్ధ విశ్వాత్మ సు
హస్రాక్షుఁడవయి సహస్రపాదుఁ
డవయి భాసింతు మాధవ సర్వగతుఁడవు
యజ్ఞస్వరూపివి యజ్ఞపతివి

తే.గీ. యజ్ఞభోక్తవు నిత్యుండ వజ్ఞనాథ
లోకలోకివి లోకైకలోచనుఁడవు
అధ్వర హవిస్సు వగుదు వనంతకాయ
శాశ్వతుండవు గురుఁడవు చక్రపాణి 20

తే.గీ. అచ్యుతుండవు సర్వలోకాధిపతివి
యనం శ్రీమదనంత కల్యాణగుణ సు
ధాంబురాశివి కృష్ణుండ వంబుజాక్ష
శాశ్వతుండవు సంతతైశ్వర్య ధనివి 21

వ. దేవా నీ వకారవాచ్యుండవు శ్రీభూనీళాది నాయకుండవు ప్రభుండవు
గావున నీవ విశ్వంబు నావరించి యత్యతిష్ఠద్దశాంగుళం బనెడు శ్రుత్యర్థమూర్తివి
గదా పురుషోత్తమా నీవ యవ్యక్తంబైన యీశ్వరుండవు వ్యాపకంబగు
మంత్రంబు శివయగు తతన సనాతనుండవు వాసుదేవుండ వాదిమధ్యాంత

## రామానుజుఁడు యాదవప్రకాశుని కడ శాస్త్రపఠన మొనర్చుట

క. ఈ మాడ్కి దేవదేవుని
స్వామి నఖిల లోకనాథు వరదు మహాత్మున్
రామానుజ మునివర్యుఁడు
ప్రేమఁ గొలిచి యంత వం దధీశ్వర నుండన్ 24

తే.గీ. అందు నిగమాంత శాస్త్రంబు నధికరింప
యాదవునిఁ జేరి యాంక్ష్మదాఖ్యమౌని
యతని వద్దను దచ్ఛాస్త్ర మమలమతిని
పఠనచేయుచు వచట నావాస మొంది 25

క. నిరతంబు శ్రీకరిధరా
ధరవరు వరదాయి భక్తతతి మందారున్
పరమప్రీతి భజింపుచు
నిరయఁగ లక్ష్మణ మునీంద్రుఁ డలరారు తఱిన్ 26

ఉ. నిరుపమమూర్తి చోళధరణీవరు పుత్రిక బ్రహ్మరాక్షసుం
డురుతర వేగముంగొని సమున్నతి సోఁకియు ధాత్రిఁగల్గ ని
ష్ఠురముం జేత నేనిఁ బరిహారిత మంత్ర విధాన పద్ధతిన్
గరము దొలంగకుండె బరికల్పిత దుష్టమదోగ్ర వృత్తిమై 27

తే.గీ. రమ్యమతిఁజేసి మంత్ర తంత్రముల చేతఁ
దొలఁగగా నెవ్వఁడేని శక్తుండు గాక
పోవుటయు రాజు లక్ష్మణమౌని సహితుఁ
డైన యాదవుఁ బిలిపింప నా ఘనుండు 29

## చోళరాజపుత్రికి సోకిన బ్రహ్మరాక్షసి యాదవప్రకాశుని దూలనాడుట

చ. ధరణి సమస్త విశ్వసంహారయుగఁ దత్పురిఁ జేరవచ్చి ని
ర్భరగతి బ్రహ్మరాక్షసుఁడు పట్టిన యానృపపుత్రిఁగాంచి వి
స్ఫురణుఁడైన భిక్షుకుఁడు యాదవుఁడందు సమస్తమంత్రముల్
నిరుపమమైన బుద్ధిఁగొని నేర్చిన వాఁడగుటన్ మదంబునన్ 29

తే.గీ. ఉగ్రబీజాక్షరంబుల నొప్పు నుగ్ర
మంత్రముల నభిమంత్రించు మౌనివరుని
యాదవుని బ్రహ్మరాక్షసి యరసి లెక్కఁ
గొనక దుర్వారమూర్తిఁగైకొని రయముగ 30

తే.గీ. అందు గలవార లచ్చెరువొంద నేరి
గణన సేయక దుర్మద కలితయగుచు
నతని బన్నంబు లిడఁగిన యట్టి పలుకుఁ
బలికె యాదవ యతిఁ గూర్చి యలఘుమతిని 31

క. గురుతరుఁడగు శ్రీశైలే
శ్వరు యాత్రకు సతత మరుగు జనతతుల రవ
స్ఫురణం బంతట నిండిన
సరసస్థితి దాని వినుచు సంరంభము గాన్ 32

వ. విశాలంబును మనోహరంబునగు సముత్ఫుల్ల కమలకైరవ కల్హార పరిమళాస్వాదనమత్త మధుకర ఝంకార నినాదాటంబగు తటాక సమీపంబు నందలి వల్మీకంబునం దీవు పూర్వంబునం దురుము వగుచు పతితులగు వైష్ణవుల భుక్తశేషాన్నభక్షణంగావలన నీదృశంబై రూపంబు గైకొంటివి భిక్షుకా మత్సన్నిధిని యెదిరించెద వదేమి 33

క. మున నేను మహాయక్షిం
బున మనుకొని యాజకత్వమును జేయఁగ నా
కును మంత్రలోప పాపమునఁ
బెనుపొందెను రాక్షసత్వమును యతివర్యా 84

సీ. ఈ దృఢబంధ మయిన గావు నన్వారింపఁ
గా సమర్థుండవు గావు యతివ
యట్టి చేతన రక్షణార్థమై శేషాంశ
మైన నవకీర్తుఁడై పొలుచువాఁడు
కారుణ్యజలధి యీ ఘనుఁడు రామానుజ
ముని దక్క నితరుఁడే పురుషుఁడైన
నాదగు నిష్ఠ జన్మము బాపఁగాఁ జాలఁ
డిమ్మహామహుఁ డాజ్ఞ యిచ్చెనేని

తే.గీ. ఏ యుండిఁ బాసిపోయెద నేనటంచుఁ
బలికి లక్ష్మణముని పాదపద్మములను
వ్రాలె నప్పుడు చోళభూవరుఁడు యాద
వప్రజాతియతియు నవార్యమతిని 85

## రామానుజుఁడు చోళరాజకన్యను బ్రహ్మరాక్షస విముక్తం గావించుట

వ. సర్వంసహాలక్షితుం డగు లక్ష్మణమునిం బ్రార్థింప నమ్మహానుభావుం డీ
ప్రాకృత శరీరంబు బాసి ముక్తిం జను మని యాజ్ఞ యొసంగిన యెడ నా
బ్రహ్మరాక్షసి యా గాత్రంబు దొలంగి సకలజనులు చూచుచుండఁ బర
మంబగు వైష్ణవ లోకంబుఁ గూర్చి చనియె నంత రామానుజుఁడు నయాద

వుండుగా రాజుచే నాజితుం డగుచుఁ గ్రమ్మఱఁ గాంచీపురంబున కేఁగు దెంచి శ్రుతస్మృత్యర్థవాదియగు నయ్యాదవుం బరిత్యజించి నరోత్తరారంబరం బేసి యనయం బతిశయంబుగా వరదు సేవింపుచు నందధివసించె నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవపురాణోత్తర ఖండంబు నందలి చతుస్త్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల ప్రజ్ఞా ధురంధరుండగు నరునకుం జెప్పె నింకియు నిట్లనియె 36

తే.గీ. అంత సమయంబు నమట మహాత్ముఁడైన
లక్ష్మణార్యుఁడు భాసుర లక్షణుండు
పండితుండు మహాపూర్ణ పాదపంక
జద్వయం బాశ్రయించె సుత్సాహి యగుచు

క. అని నారాయణముని న
ల్కిన పల్కులవిని సత్రికేవం మతియై
ఘనుఁడు నరుఁడు కేలు మొగిచి
వినయంబున నతని కనియె విమంతరోత్రిన్ 38

తే.గీ. ఇల మహాపూర్ణముని యెవ్వఁ డెప్పు డతని
దేశికుం డే ఘనుని యంగఁ దేటపల్లి
గీ సమస్తంబు నాకు నీ వెఱుఁగఁ జేయు
మతి కరుణఁజేసి నారాయణాఖ్య మౌని 39

క. అని నరుఁడు వేఁడుకొనుచో
ననురాగంబునఁ గృపారసాయత్తుండై
వినమతితేజుండు చిరం
తనముని నారాయణుం డుదారత నుడివెన్ 40

## మహాపూర్ణ సదంతము

ఉ. నానారత్న విచిత్ర గోపురమునై నారాయణ గ్రామ ము
ద్యానోపేతమునై కవేరతనయా ప్రాంతస్థమై యొప్పు నం
దాన్వమ స్థితి నీశ్వరాఖ్యుఁడు యోగాభ్యాసిన్ విరంచించు మున్
శ్రీనారాయణ పాద నీరజ యుగాళీ ప్రభావాత్ముఁడై 41

తే.గీ. భూసురాగ్రణి వైష్ణవ పుంగవుండు
ఘనతరుం డీశ్వరాహ్వయ ముని దనర్పు
మహిత మతియు విష్వక్సేన మంత్రియగు గ
జాననుని యంశమునఁ బుట్టి నట్టివాఁడు 42

క. నాథమునినాథుఁడు రమా
నాథ పదాంభోజ యుగ్మ నందిత మధురి
ప్రాథ సమదితుఁడై దిగ్జ
నాశ్రితుఁడై తనరె నన్వయకుండై 43

క. సుమహుం డా నాథమునికి
వితతామోఘుండు గల్గె వృష్ణి గర్భాం
కతుఁ డీశ్వరాభిధానుఁడు
ద్విజవర్యుఁడు ధర్మవేది దీపిత మతియై 44

క. పరతత్త్వ విదుఁడు వైష్ణవ
పరివారారాధనైక పరుఁడు సతత వి
ద్వర నిగమాంత విశారదుఁ
డురుతర కీర్తిప్రదాతుఁడొప్పు ధరిత్రిన్ 45

క. ఆ నందనుతోఁ గూడ స
దానందుఁడు నాథముని మహాత్ముఁడు పెక్కా
నానేక క్షేత్రముఁ
దాన మ్మొంది దినత్రయమంతయు యటన్ 48

క. యమునా నది తటమునం
దమరెడు గోవర్ధనాద్రియందు మదిని యా
ద్యము యోగనిద్ర గైకొని
సుమహిత సౌఖ్యప్రదానముల తలంపుమఁదాన్ 47

సీ. నిరతంబు తద్ధ్యాన నిరతుఁడై యమ్ముని
చిరకాల మందు వసించి యంతఁ
బద్మనాభుని యాత్ర వదని వెండియును వా
రాయణ పురమున కరుగుదెంచి
యఖిలంబు శీనమై యంతరాత ద్రావిడ
ప్రతి నిర్వహింప నాధూథి పొంది
కురుకాంతమున శేఁగి గురుతరంబుగ నందు
విలసిల్లు తింత్రిణీ వృక్ష మూల

ఆ.వె. మాశ్రయించి పెద్దయగు తపమొని నా
యతుఁ బరాంకుశుని నుదారభక్తిఁ
దానుపాసనంబు గావింప శరకోప
మునివరుండు ప్రేమఁ దనరు మదిని 49

క. అతని పురోభాగమునం
దతిశయ మగు దీప్తిఁ దోఁచు నమ్మౌని గని యం
చిత భక్తి భూమి సోఁక మ
హితమతి నాథర్షి మ్రొక్కి యిష్ట మెలర్పన్ 59

ఉ. అమ్మునిరాజువల్లను సమస్తము ద్రావిడ వేదముం గ్రమో
దమ్మున సంగ్రహించి యుదారచరితం బెసఁగఁగ న్యాసయో
గమ్ము నొకప్పుడేనిఁ బలుకన్ శుభదమ్మును ముక్తిదమ్మునై
నమ్మతిఁ గొల్చువాని సరసస్థితిఁ గైకొని యంతవేడుకన్ 60

క. క్షమ నతఁ డుద్వారతా యా
శ్రమవల్లి సమస్తకలుషహతిఁ దొంగను సు
ధ్యమమౌ రహస్యము న్యాసము
విమలమతిం దనరు శిష్యవితతి కొసంగెన్ 61

వ. అంత

క. సరసు జయత్పనాంశజ
స్ఫురితాత్ముఁ బుండరీకమునివర్యు మహున్
గురుకేశాంశజ యోగీ
శ్వరు వినుతు యోగవిదుని ధర్మవిచారున్ 62

వ. అయ్యిరువురం జూచి ప్రసన్నహృదయుం డగుచు నా నాథమునీంద్రుం
డిట్లనియె

సీ. అద్భుత సింహాసనాంక సంజాతుఁడౌ
 పుత్రుఁ డయ్యెడు నీకుఁ బుత్ర వాని
నామాధి యామునాహ్వయము నీ వొనరింపు
 మఱియు మత్ప్రియుఁడుగా నలరుచుండుఁ
బుండరీకాక్ష నీవును నాదు పౌత్రుఁడౌ
 యోగీంద్రునకు న్యాసయోగ మర్థి
ద్రావిడాగమము లుదారత నుపదేశ
 మిమ్ము ప్రేమను గురులెల్ల నీవు

తే.గీ. యోగ విద్య నొసంగు మనూన వృత్తి
ననుచు నివ్విధమున వాని నాజ్ఞ గఱపి
సప్తవర్ష శతంబులు గనిన పిదప
నాథముని పూర్వయోగ సంధానుఁ డగుచు 66

వ. నిజశరీరము దొఱఁగి పరమంబగు విష్ణుపదంబుఁ బ్రాపించె నంత పుండరీకాక్షుండు కురుకాధిప సంభవుండును శ్రీరామమిశ్రాఖ్యుండును నగు శిష్యుంబిలిచి ప్రహర్షితుండగుచు రహస్యమేది యగుటన్ న్యాసంబును ద్రావిడామ్నాయంబులను నుపదేశించి యాశ్వరాఖ్యమునికి శ్రీమంతుండును సింహాసనాంకుండును వేదవిదుండును మహామునియు నగు పుత్రుండు గాఁగలండు శ్రీరామమిశ్రార్య సర్వజ్ఞుండును మహాత్ముండును నగు వతని కొఱకుఁ ద్వరితంబుగా ద్రావిడాగమంబు లుపదేశం బొసంగుము మహాత్ముఁ డగు నయ్యామునమునిం దేవరశిష్యు లయ్యెడ రనుం దరం దక్షు గావింపు నవంతరంబున గురు దాక్షిణ్య సంపూర్ణుండగు మహాపూర్ణుండును దత్త్వవిదుండును మహానుభావుండును హరి ప్రియుండును సుముఖాంశుండును

నగు శ్రీశైలపూర్ణుండును శంకు పద్మాంక సంజాతుండగు కాంచీపూర్ణ సంయమియును విజ్ఞాతుండును పుండరీకాంక సంభవుండును నగు గోష్ఠి పూర్ణుండును ఏ మహాంతుండును మహానీయుండును నగు శ్రీమాల్యధరనామ కుండును నగు వీరలందఱు యామున శిష్యులగుచు సర్వజ్ఞులును మహా మహులును తత్త్వకోవిదులును నగుట వారు హరిక్షేత్రంబులయం దధి వసించుచు మనుజుల పవిత్రుల గావించుచు రమ్యమహాపూర్ణుండు నిరంత రంబు గురుని గూర్చి యను వర్తించుచు నతనిచేత వ్యాఖ్యానింపంబడిన యశేషరహస్యార్థంబు గల వారయ్యె యామునమునీంద్రుండు నతం సమయంబు నిర్ధించి కుమారు రాజ్యస్థాపితుం జేసి విష్ణునందు భక్తిగల వాఁడగుచు భిక్షుకాశ్రమం బాశ్రయించి మహాపూర్ణ సహితుండగుచు రంగ క్షేత్రంబున నావాసంబు గావింప లక్ష్మణమునీంద్రుండు కాంచీపూర్ణ మహాత్మువలన దేవరాజు సందిష్టుండగుచు నున్నవాఁడగు నమ్మహాపూర్ణు నాశ్రయించి సేవ మహాత్ముండగు నతండు యామునార్య నిక్షిప్తం బగు రహస్యం బంతయు శిష్యుండగు రామానుజార్యున కొసంగె నని మహాయోగి మహత్త్వంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి పంచత్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయ ణుండు నిఖిల ప్రజ్ఞాధురంధరుండగు నరునకుం జెప్పె వెండియు నిట్లనియె

### రామానుజుఁడు భిక్షాశ్రమము గొనుట

తే.గీ. అంత లక్ష్మణయోగి పద్మాక్షు వరద
రాజ గురు విష్ణు భగవంతు రమ్యమూర్తి
సన్నిధిని దాన భిక్షుకాశ్రమము గొనియె
నిగమ నిగమాంతరార్థ నిపుణమతిని 67

సీ. అట యోగివరుఁడు రామానుజార్యుఁడు సర్వ
వేదవిదుం డను మోదకుండు
కాంచి యం దధివసియించినచో సుప్ర
తిష్ఠాంశకుఁడు సముదీర్ణ గుణుఁడు
సత్పురుషుండు దాశరథి సఖ్యుఁడు మహా
మహుఁడు నిష్కల్మష మానసుండు
సర్వనేత్రాంత సంజాతుఁడు శ్రీవత్స
మిశ్రాహ్వయుండు గంభీర జలధి

తే.గీ. యనెడు నిర్భర వాస్తి ధరాధినాథ
ధామమున కేగుదెంచె నంతసముదీర
నందుఁగల యయ్యతీశ్వరు నాశ్రయించి
దరవిదేఁ బంచసంస్కృతు లగుచు నెనఁగి ౫౮

క. యతిరాజు పదాంబుజములు
సతతము సేవింపుచును విచక్షణమతులై
చతురామ్నాయ షడంగ
స్థితి భగవన్నిష్ఠ గలిగి తెలిఁగిరి భక్తిన్ ౫౯

రామానుజుఁడు యాదవప్రకాశు ననుగ్రహించుట

క. అంతట నయ్యాదవయతి
నెంతయుఁ గని యతని జనని యిటనియె హరి
స్వాంతంబుఁ జేసి సుత యో
యింతగ నీ వున్న యట్టి విధ మనుచితమౌ. ౬౦

ఆ.వె. పౌరి శిఖోపవీతములు సకలాశ్రమం
బులకుఁ గారణములు పుత్ర వాని
విడచి స్వశాస్త్ర విముఖుండ వౌట నే
ర్పుఁడవు గావు గర్వితుఁడవు గుణిని ౮౧

వ. ఉపవీతియు శిఖియు యోగియుఁ ద్రిదండియు నగుచు నా లక్ష్మణ
మునీంద్రుండు శాస్త్రంబునందుఁ బాటితుం డగుచు వసియించునట్టి పుండు
మని నిజమని పల్కిన యాదవుండు మన్ననే నితని కపరాధంబు
గావించితి దానికిఁ బ్రాయశ్చిత్తంబు ధరణీ ప్రదక్షిణం బనుట సిద్ధంబు
గాన నేను ప్రదక్షిణంబుఁ జేయుట కరిగెద నని చింతించుచు భూ
క్షేత్రమందు నరఁ దెంచి యున్న యెడ వరదరాజస్వామి స్వప్నంబు
నందుఁ బ్రసన్నుం డగుచు నిర్మలోక్తి నతని కిట్లనియె ౮౨

క. యతి రామానుజయోగికి
నతులంపతిఁ బ్రదక్షిణంబు నరించినచో
క్షితి వలఁగొని వచ్చిన ఫలం
మతిశయముగ నీవుఁ జెంద నయ్యెదవు సుమీ ౮౩

వ. అనవుడు మేల్కాంచి సముదంచితభక్తిని వందుఁ బోయి య
మ్మునియతియానపున్ విశిష్టమహాముని లక్ష్మణార్య పా
ద నళినయుగ్మకంబున దూరాంబు ప్రమొక్కి చేతు మోడ్చి న
ద్భినయ వివేక సూక్తి గొని దివ్యగుణాఢ్యుని యతి గూర్చి యిట్లనున్

క. శరణాగతవత్సలుం డని
వర నమ్మి నిత్యుగాఁగ పాలింపుము నీ
కరుణ నని పల్కి చేతులు
శిరమునఁ జేర్చి కాని వినుతిఁ జేసె యతీంద్రుఁడున్. ౮౫

క. కలయ నపారస్తోత్రం
బుల లక్ష్మణు లెలమిఁ గూర్చి పొగడినచో ని
క్కిలి యతని యెడలఁ గరుణా
కలితుఁ డగుచు యతికులాగ్రగణ్యుం డంతన్. ౮౬

తే.గీ. పంచ సంస్కారములచే సుదంచితముగ
యాదవుని సంస్కృతునిఁ జేసి యవలఁ గ్రమము
వల్ల సుబహితుఁ గావించి యుల్ల మలర
ముని త్రిదండినిఁ జేసె సంపూర్ణమతిని 87

రామానుజుఁడు శ్రీరంగము చేరి రంగనాథుని స్తుతించుట

వ. అంత శ్రీరంగనాథుడే నారాయణుం డగుచు మహనీయుండగు నా క్షేత్రంబుఁ జేరి పుణ్యముని నిషేవితయును తటస్థ దివ్యాశ్రమ సమాలంకృతయు నమృతోపమాన నిర్మల జలపూరితయుఁ ద్రిదశ గంధర్వ కిన్నర కింపురుష వరోపశోభితయు బృందారకనందనబృంద నిష్యందయు నిరంతర సురనికర రమమాణ ప్రభావయు దైవర్షి సిద్ధ సాధ్య విద్యాధరాప్సర సేవనయు నిర్మలోత్పల కల్హార సారస నిచయ ప్రవర్ధమానయు వికసిత కుముదసముదయ పరిశోభితయు కుసుమనికర పరాగ పరిరాజితయు విపులస్వచ్ఛ వాలుకా మాలికయు నానాప్రసూన సమూహ సమత్త మధుకర ఝంకారసంకులయు రాజహంసకలహంస చక్ర కారండవ

వ. వనస్పతి ఓషధి చంద్ర నక్షత్ర గ్రహార్క వివిధ భూతంబులయం దంతట నంస్థితుండవగు నిన్ను స్మృతి పరబ్రహ్మంబుగాఁ జెప్పుచుండు శ్రుతిసమ్మతి యనెడు ప్రత్యక్షంబునం జేసి హిరణ్మయ స్వరూప యజ్ఞ స్వరూపుఁడ వగుటఁ బరయగు శ్రుతి నిన్నుఁ బరమాత్మగాఁ బ్రశంసింపు చుండు నీవ యోంకారుండవు నీవ వషట్కారుండవు నీవ యజ్ఞ హవిస్స్వరూపుఁడవు నీవ సర్వజ్ఞుండవు సర్వేశ్వరుండవు సనాతనుండవు పుండరీకాక్ష సర్వశేషివగు నీవు సత్పురుషులకుఁ బతి వగుట సర్వ జగంబుల కీవ జననిజనక సువ్యాద్విభుండవు గాన లోకంబుల కీ వుపాస్యుఁడ వగుదు వరించు నుపాసకులగుట భూతంబులఁ బెంపుచున్న నీవు సర్వభూత నియంతవు భూతభర్తవుంగా వలయు కరన నీ వనంతగుణ సంయుతుండవు ననంతార్క ప్రకాశుండ వగుట మహాత్మ శంఖ చక్ర గదా ధరుండ వగుచు దివ్యరూపంబు గైకొన్న మహానుభావుండవు నిగమంబులు సవిశేషుండ వని నిన్ను నిరుపాధికంబును బరాత్పరంబును నిరవధీశ్వరంబును నగు పరబ్రహ్మంబుగాఁ జెప్పుచున్న విరచనా నీవు నిత్యులకు నిత్యుండవు చేతనులకుఁ జేతనుండ వనేకుల కీవ ముఖ్యుండవగుచుఁ గోర్కె లొసంగు పుణ్యపురుషుండ వగుటం జేసి భవదుపాసకులగు ప్రపన్నులు నిన్నుఁ బ్రశంసింపుచు మొదట నిన్ను లక్ష్యంబుగాఁ జేసి పిదప బాణరూపం బగు నాత్మ నోంకారంబను ధనువునం దెక్కువెట్టి ప్రమత్తరహితాత్ములగుచు లక్ష్యంబు నా బ్రహ్మంబు నీక్షింపుచు దర్శ్యూపరుడవగు నీయం దుంచఁబడిన బాణని లక్ష్యభూతుండ వెందియు నిల్పినయె 79

తే. గీ. శేషపర్యంకశాయి లక్ష్మీనివాస
పద్మనాభ పయోరుహభవ కపర్ది
వినుత చరణారవింద శ్రీ విష్ణుదేవ
నీకు దండ ప్రణామంబు నే నొనర్తు 60

సీ. సంకర్షణాయ కృష్ణాయానిరుద్ధాయ
వాసుదేవాయ వరప్రదాయ
నారాయణాయ సురారిసంహరణాయ
హరయేచ్యుతాయ రమాధిపాయ
దురితదూరాయ ప్రద్యుమ్నాయ రామాయ
శాశ్వతాయ సమస్తజనసుతాయ
గోవర్ధనధరాయ గోవిందరూపాయ
గోపీయదేవాయ మనహరాయ

తే.గీ. దివ్యభూషణభూషాయ దివ్యగంధ
లిప్తదేహాయ సంతతవ్యాప్తయే మ
హా కుసుమ ధారిణే సుందరాంగిణే న
మో నమో యని నిన్ను నేఁ బొగడుదాఁడ 81

మ. నిగమాధీశ్వర నీదు దండము రమానేతా మురారాతి ప
న్నగ లోకేశ్వర శాయి నీ చరణ మౌన్నత్యంబుగాఁ బొందు న
ర్హగ శ్రీరంగ ధరాధినాథ భవదూరా నీదు భోహారు హే
య గుణాతీత ముకుంద నీదు నతి బ్రహ్మస్తోత్ర పాత్రక్రియా 82

తే.గీ. అంచుణాక ప్రసన్నుఁడ వగుము దేవ
దేవ ప్రత్యక్షమగు రమాధీశ శౌరి
మనవిని యనుగ్రహింపు జగన్నివాస
రమ్య కరుణాసముద్ర శ్రీరామభద్ర 83

కం. అని యా ట్లాద్రిశ కల్పక
మునుగాఁ దనరారు రంగభూపతి వినుతిం
గొని యా లక్ష్మ్యశ్వరుచే
గొనియె విభూతి ద్వయైక గుణ వైభవముల్, 84

సీ. యతిశేఖరుండు రామానుజాచార్యుఁడు కతి
పయ మగునట్టి సమయమునందు
రంగనాయక పాదరాజీవ సేవనా
వృత్తియై యధివసియించి పిదపఁ
బుణ్యాత్ముఁడగు మహాపూర్ణుని ప్రేరణం
బునను గోష్ఠిపూర్ణ బుధవరేణ్యు
చెంత రహస్య మత్యంతంబుగాఁ దెలి
యు కొఱకు భయభక్తు లుప్పతిల్లఁ

తే.గీ. గొలుచు కులశేఖ దాశరథులను శిష్యు
లధికమగు భక్తిఁ దనవెంట నంటిరాఁగ
నమ్మహాముని కడ కేఁగి యతులం దిత్తుఁ
దగుచు దండప్రణామంబు లాచరించి 85

తే.గీ. అమ్మహాత్మునివల్లఁ దత్త్వార్థ మెఱిఁగి
దివ్యమతి నందఱికి నుపదేశ మిచ్చి
క్రమ్మఱను నమ్మునీంద్రుని కడకు వచ్చి
వినతుఁడై యతివర్యుఁ డిట్లనియెఁ బ్రీతి 86

క. గురుదాక్షిణ యిటి యీ వర
తర గోప్యార్థము వేడుకం జెప్పితి నర
రతికిఁ బ్రకటముగా నే
గురుమతి వారల దరింపుకొఱకు మహీంద్రా 87

క. కలుషాకరు నపరాధం
బెంచి నదావు శిష్యు నన్ను నీట శిక్షింపం
దలఘుమతి ననుఁదు నమ్మని
శిలయుఁడు తరలౌకిక కృప దియించి యటన్ 88

## రామానుజుఁడు యజ్ఞమూర్తిని జయించుట

వ. సంతుష్టహృదయుండై నీవు సర్వజనరక్షకుండవని పల్కి యతని నాలింగనంబుఁజేసి మాటిమాటికిం బ్రశంసించె నంత రామానుజుం డతనిచే దీక్షఁబడసి శ్రీ మాల్యధరయోగి నాశ్రయించి యతనివలన రహస్యంబులగు ద్రావిడాగమంబుల సంగ్రహించి క్రమ్మఱ శ్రీరంగంబుఁజేరి ధీశాలురగు శిష్యులకు నమలంబగు వేదాంతశాస్త్రంబుఁ జెప్పుచు నందధివసించె పూర్వంబున దాతీర్థవరుండును ప్రతిద్వంద్వ వాదియు నేకదండియునగు యతి కాంచీపురవరంబువలన నేగుదెంచి లక్ష్మణయతీంద్రునితోఁ గూడ నద్వైత ప్రసంగంబు గావింప నమ్మహాను భావుండు నిఖిల నిగమాంత శాస్త్ర నిరుపమ వ్యాసోక్తులంజేసి యజ్ఞ మూర్తిన్ జయించి యతని రహస్యార్థానువేదియుఁ ద్రిదండియు నార్య నము శిష్యుంగా సంరక్షణంబు గావించెనని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబునగు భార్గవ పురాణోత్తరఖండంబు నందలి ద్వాత్రింశా ధ్యాయము భక్తసహాయుండగు నారాయణుండు నిఖిల ప్రవక్తా ధురం ధరుండగు వరునకుం జెప్పి వెండియు నిట్లనియె 89

క. అట యెదుట వచ్చి శారద
పటిమఁ దనుం బాఱసేయ భవ్యయశం బు
త్కటమతి నాపై కొసంగెన్
స్ఫుటముగఁ దాఁ జేయు భాష్యమున్ నిరుపమమున్ ౯౩

క. భారతి యా భాష్యంబుఁ బ్రో
ల్పారఁగ గ్రహియించి శిరమునం దిడుకొని శ్రీ
భూరేశ దాశరథి హృ
చ్ఛ్రీరమణ రవి యత్కృతార్యునిన్ గొనియాడెన్ ౯౪

## రామానుజుఁ దష్టోత్తర శత హరిక్షేత్ర స్థాపనంబు గావించుట

వ. అంత యతిసార్వభౌముండగుచు శ్రీమంతంబగు పురుషోత్తమంబున కేఁగుదెంచి సర్వేశ్వరుండును పరాత్పరుండును నారాయణుండును విభుండును నీలమేఘ నిభశ్యాముండును సహస్ర తరణిమండల ప్రకాశసన్నిభుండును దివ్య భూషణ భూషితుండును గాంచనాంబరధరుండును దివ్యచందనలిప్తాంగుండును వనమాలావిభూషితుండును బలభద్ర సుభద్రా సమన్వితుండును సురబ్రహ్మర్షి సనకాది వినుత పాదారవిందుండును నగు జగన్నాథుం గనుంగొని తత్పాదంబుల కెఱఁగి నిగమ నిగమాంతసూక్తుల నిట్లని స్తుతియించె ౯౫

క. శ్రీ మన్నీలాచలం బా
సామోదిని జాత్రివాస జగదీశ వరం
ధామ శరణ శరణ్యము
లై మఱియు భవత్పదముల యనయము మాకున్ ౯౬

సీ. శ్రీశాయ విభవాయ యోగీశవినుతాయ
నిఖిల భువన సాక్షిణే పరాయ
సర్వభూతాత్మనే సర్వేశ్వరాయ స
ర్వాయ తే శత్రుసంతాపాయ పాప
దుఃఖ సంహారిణే తుభ్యం జగద్దేహి
నే జగన్నాథాయ నిర్మలాయ
సారస నేత్రాయ సర్వాగమాయాద్భు
తాయావికారిణే దైవతాయ

తే.గీ. శౌరయే పురుషోత్తమ పూరణాయ
పరమ సుఖదాయినే యోగిపాలకాయ
[1] తే నమోస్తుటంచును సముత్కీర్తనతతి
విష్ణు మదిలోన భావింతు నిశ్చయముగ 97

క. హరయే పరాత్పరేశా
య రమాపతయే మురాంతకాయ సుమనసే
పరమాయ నమో నమ యని
గురుతరముగ భక్తి నిన్నుఁ గొని యాడుదునా 98

వ. ఆకాశ వాయు తేజస్సలిల పృథివీమయుండగు విశ్వుండు విశ్వధారివగు నీవలన నుత్పత్తి యగుచు వృద్ధిఁబొందుచుండు రుద్రులును నింద్ర ప్రజాపతులును నాదిత్య వసువులును మరుద్బృందంబులును నమ నీ నమ స్తంబులు నీ వలన నుద్భవంబగుచుండు నీచేత సృష్టింపఁబడుచు స్థావర జంగమంబగు నీ జగంబంతయు నీచేత నిరంతరంబు సంరక్షింపఁ బడుచు నీ యందు లీనంబగుచుండు ప్రాణంబును సకలేంద్రియంబులును

---

1 మూ. తే నమోస్తు యటంచు సుకీర్త

నీవలన నుత్పన్నంబు లగుచుండు బ్రహ్మ రుద్రాదులగు నిర్జరులు నీకుఁ బ్రియతములగు దాసులగుదు రఖర్వంబగు సమస్తంబునం దీవ వ్యాప్తుండ వగుట మహాత్మునకు మహత్త్వ మబ్బున నతీతుండవు వగుట జంతు సంతాన స్వాంత నివాంతుండవగు నీవు సనాతనుండవు నిష్కళంకుండవు నిరాభాసుండవు శుద్ధుండవు నొక్కరుండ వగుట నారాయణదేవుండ వగు నీకంటె రెండవ దేవుం డొక్కఁడేనిఁ గల్గనేరఁడు చతుర్వ్యూహ చతురాత్మ స్వరూపుండవగు నీకొఱకు నమస్కరించెద నని మఱియును 99

తే.గీ. పంచకాలాత్మనే శతోదంచితాయ
రుద్రవినుతాయ పంచస్వరూపకాయ
తే నమోనమ యని నిన్ను దీర్ఘ భక్తి
వినుతిఁ జేసెద నెవ్వేళ విభవరీణ 100

సీ. పంచకాలజ్ఞులు భవ్యులు యోగులు
పరమార్థ విదులౌ ప్రసన్ను లెపుడు
నిర్మలాత్మకుణిగా నిన్నుఁ బూజింపుదు
రర్థ పంచక తత్త్వ మరయువారు
నరసులు పంచ సంస్కార సంస్కృతులు ని
త్యంబు నీ రూపంబు నరయుదుంద్రు
పరమ చతుర్వ్యాత్మ పరిపూర్ణములగు నీ
పదములు దెలుతురు భావవిదులు

తే గీ నమ్మహాత్ములు నీ దాసులైన భూమి
సురులు సకల భువనముఁ బ్రోతురు ముదమున
విశ్వరూపమ్ము గం నీకు వినతిఁ జేతు
వెదవేద్య యొగదువాఁడ వేద్య నిన్ను 101

తే గీ వాసుదేవుండ వగు నీకుఁ బ్రణతిఁ జేతు
కృష్ణదేవుండ వగు నీదు కీర్తనంబు
సల్పువాఁడ జగద్ధామ శార్ఙ్గ ధర
సత్త్వ హరి నీకు మ్రొక్కెద జలజనాభ 102

క విష్ణు స్వరూప మాధవ
విష్ణువయిన నీకు నేను వినతి యొనర్తున్
కృష్ణ విఖిలాత్మ దైవ వ
రిష్ణుఁడ వగు నిను నమస్కరింతు ముకుందా 103

తే గీ పంకజాక్ష జగన్నాథ భక్తవరద
లోకధారి మహాత్మక పాకశాస
నాది వందిత మౌనిజనాంతరస్థ
నీకు జోహారు గావింతు నిగమ రూప 104

సీ కైవల్యదాయివే ఘనతర మూర్తియే
యాదవేంద్రాయ దయామయాయ
యమునాతే సచ్చిదానంద రూపాయ
యిందిరా భూమి నీశేశ్వరాయ

నిరుపమాకారాయ నిత్యముక్తాయ తే
గ్న్యాయావిహారాయ హరనుతాయ
విద్యాయ శుద్ధాయ సర్వ స్వరూపాయ
పరమాత్మనే విశ్వపాలనాయ

తే. కారణాయ హేతుహేతవే సకల విబుధ
పోషకాయ విరించన పూజితాయ
తే నమోనమ యని నిన్ను దివ్య మతిని
సన్నుతించెద నెప్పు డుత్సాహమున 106

క. త్రిగుణాతీతుఁ డవగు ని
ఖిగళిత మతి వందనంబు సలిపెద నే
నిగమాంత రూప శాశ్వత
జగదీశ యనంత మహాశ్చర్యధారా. 107

వ. మహాత్మా విదగ్ధకోపాధిస్వరూపుండవు మహాత్ముండవు జగజ్జనకుండవు నీలాద్రి
నాయకుండవు సుభద్రా ప్రాణవల్లభుండవు బలభద్రసమేతుండవు జగన్నాథుం
డవు సర్వప్రపన్న జన రక్షకుండవు వరదాభయ కోటి కందర్ప లావణ్య
నిధివి యనంత కల్యాణ గుణ పరిపూర్ణుండవు బ్రహ్మ స్వరూపుండవు
పరమాత్మ ద్వయాది పాలకుండవు సర్వశేషి వగు నీకు నమస్క-
రించెద పురుషోత్తమ [1](మా)నికేతనా లక్ష్మీశ్వర వరాభయుండవు నీవు నా
కొఱకుఁ బ్రసన్నుండ వగుచు నీవు ప్రపన్నుండ నగు నన్నుఁ బరిపాలింపు
మని లక్ష్మణాత్ముఁడు వినుతించె నని మహాయోగిమాహాత్మ్యంబును శ్రీ

1. మూ లేదు.

మంతంబు నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి సప్తత్రింశాధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు నిఖిల విద్యాధురంధరుం డగు వరునకుం జెప్పి వెండియు నిట్లనియె 107

క. అని యిట్లు భగవ్వాక్యుని
వినుతించి యతీశ్వరుండు విమలుండు కృపా
వనధియగు నతనిచే మఱి
మున సంభావింపఁ బడి రమున్నత మహిత్రా 108

తే. గీ. అంత శ్రీకూర్మమున కేఁగి యందుఁ గల్గు
కూర్మనాథుని భక్తిఁ గొలిచియాతఁడు
వంశనాథునిఁ బ్రణుతించి యాఘనుండు
నవల సింహాసనంబున కరుగుదెంచె 109

ఉ. అచ్చట నుండు సద్బుధ మహా మహ భక్తుల కెల్ల కౌతుకం
బొప్పుగ లేక నిచ్చ గుణపూర్ణు నృసింహు పదారవిందముల్
మెచ్చిన భక్తిచేఁ గొలిచి యింపు దలిర్పగఁ బొంగి కాన్ఁ దు
ద్యచ్ఛరితుండు వైష్ణవకులాగ్రణి యప్పుడు యోగి యంతటన్ 110

క. స్తోత్రాది యందలి కథా
స్మృతుని నరసింహు విశ్వవిభుఁ గొలిచి గుణా
శ్రితుని నారాయణుఁ బ్ర
ఖ్యాతుని శ్రీ పెరుమాళ్ళు పంచి గాగడి యిటన్ 111

వ. ఆ గోచరంబైన తిరుదెంబ యందు గల పాంచాహ్వయంబగు శ్రీ
నృసింహుం గొనియాడి యతిపుంగవుండు వేంకట మహీధరంబైన తిరు
దెంచి మున్ను పరకాలాదులు శేష రూపంబగు నగ్గిరి నారోహణంబుఁ
జేయకుండుట తెలిసి దాని నారోహణంబుఁ జేయకుండి యంత నందుఁగల
నిజ శిష్యులచేత మాటి మాటికిం బ్రార్థింపఁబడగుచు నా ఘనుండు నరుల
కశేషపాపంబుఁ బాపు నట్టి శేషనగేంద్రం బెక్కి యందు దనరు శ్రీశైల
పూర్ణమునిం గూర్చి వినయాన్వితుండగుచు దండంబు వెట్టి కల్మషాప
హంబును ముక్తిదంబును సార్థకంబును నగు స్వామి పుష్కరిణీ తీర్థంబు
నందు స్నానంబుఁ జేసి రమ్యంబగుఁ దత్తటంబు నందుఁ బరమంబగు
జపంబు జపియించి భూవరాహునకుఁ బ్రణమిల్లి పిదప శ్రీనివాస మంది
రంబుఁ గూర్చి చని యందుఁ గల శ్రీపతి యగు హరిం గనుంగొని ॥ 112

సీ. భాస్కర కోటి ప్రభా భాసమానుని
ఘనతర సౌందర్య కలితాంగు
శ్రీవత్స కౌస్తుభ శ్రేష్ఠ విభు వక్షు
చారు శరత్ఫుల్ల సారసాక్షుఁ
హాటకాంబరు శంఖచక్ర గదాసి
శార్ఙ్గధారిఁ బలాది దనువిదారి
జగదధీశ్వరు దివ్య చందన స్రగ్విరా
జిత చతుర్భుజు సమున్నత శుభాంగు

తే.గీ. రత్నకంకణ వర యుగ్మ రమ్య గాత్రు
హారకేయూర కోటీర చారు కుండ
లాంగదా విభూషితు నమల చరితు
హరిఁ బరాత్పరుఁ బరమేశు నమరవినుతు 113

ఆ. పరమాత్ము జగద్రక్షకుఁ
గరుణానిధిఁ గూర్చి మ్రొక్కి ఘనుఁ డతఁడు సమ
ర్థుఁడు దగుచుఁ దనదు కన్గవ
నరసావందాంబుజహరి సముదారంగాన్ 114

వ. కృతాంజలి పుటుండై యవ్విభుం గూర్చి యిట్లని వినుతించె 116

సీ. శ్రీశేషగిరినాథ శ్రీనివాస జగత్ప
తే విమలాత్మక దివ్యతేజ
నలినోదరుండవై నారాయణుండవై
పూర్ణుండవై జగంబులను బ్రోవ
నలరు నోంకారార్థమైన నీకొఱకు నే
దండంబు సలిపెద ధన్యమూర్తి
తారకుండవు లక్ష్మీకాంతుఁడవగు నీకు
జోహారు గావింతు సుందరాంగ

తే.గీ. రక్షకుఁడవగు నినుఁ గూర్చి రమ్యమతిని
సేవఁ జేసెద నో సర్వశేష శౌరి
యీశ యలమేలు మంగాధిపేందిరా ని
శాంత విస్తీర్ణ వక్ష దాస్యత్కటాక్ష 118

వ. అనవ్యార్ఘ్య దానస్వరూప మహాత్ముండ[1]వగు నీకుఁ బ్రభుండవు నరకాం
తకుండవు గురుండవగు నీవు దక్క నన్యగతి లేదు గాన నే నను
శరణ్యుండ నగుచు నీ చరణంబులం గూర్చి మిక్కిలి శరణంబుగా మమత
దొలంగి యహంకార విముక్తుండ నగుచుఁ బ్రవృత్తిఁ గావించెద మహాత్మా

1 మూ వగు

నరసింహాంశ శివ గతి వగుట నీగతిఁ జేసెద [1]దానులయం దయనం
బగుమని వెండియు 117

క. జగములు నిఖిలాంతర్యా
మిగ వర్తిలు వట్టి నిన్ను మేలగు భక్తిన్
బొగడి నమస్కృతిఁ జేసెద
భగవంత సుశాంత భక్తవత్సల శౌరి 118

తే. గీ. నాకుఁ గైంకర్య మొసఁగుము నలిన నాభ
నీ కృపాదృష్టి నాయందు నిగుడఁజేయు
మనఘ వాత్సల్య రాశి వగుట నీకు
మ్రొక్కు గావింతు సంతోషమున మహాత్మ 119

తే. గీ. మంత్రరాజాయ సుగుణాయ మంత్రమూర్త
యే ప్రపన్నార్తి హరణాయ యిందిరేశ్వ
రాయ తే [2]నమో యని నిన్ను రమ్యమతిని
భక్తి భావన గావింతుఁ బరమపురుష 120

తే. గీ. ఎంతయుఁ దిరతిన్న యందుఁ గు నీ సమస్త
జగంబు లొనంగనై వెన వగుచునుండు
దాని యంతర్వహిస్సుం జూనిగాని వ
సించు నీకై నమస్కృతిఁ జేయుచుండ 121

---

1 మూ దానుల 2 మూ నొమి

క. హరి యీ జగము గ్రహించి యు
దరమునఁ జేర్చుకొని పెద్ద దవుపవళము ని
స్ఫురణను గల్పాది స్మృతిం
దు రసికు నర్థేవు నిన్ను సుభగు ననిందున్ 122

సీ. విశ్వతశ్చక్షుషే విశ్వముఖాయ తే
నమో విశ్వతస్పాణికరాయ
విశ్వపాదాయ తే శాశ్వతరూపాయ
తుభ్యన్నమో యని దురితహారి
వగు నిన్నుఁ గొలుతు సహస్ర పాదుఁడవు స
హస్ర నేత్రుఁడవు సహస్రశీర్షుఁ
డవు పురుషుండవు భవనాశివగు నీవు
ఘనతర స్ఫూర్తి లోకములఁ గూర్చి

తే.గీ. యత్యతిష్ఠద్దశాంగుళం బనెడు నిగమ
సూక్తి గైకొని వ్యాపించి సొంపుగ మించి
దివ్యమగు నీదు మూర్తి నుతింతు నాఁడు
పద్మదళనేత్ర బుధనుత పద్మమిత్ర 123

వ. అమృతత్వంబున కీశానుండ వగుట చేనివలన [1]మెగతియుండేవి వ్యాపింపని
వాఁడవు గాకున్కి భూతంబెద్ది భవ్యంబెద్ది తత్సమస్తంబు మాధవా ని
యందుఁ గల్గుటం జేసి విశ్వంబున శివ పతివి జగంబునఁ గల్గు ప్రాణుల
కీశ్వరుండవు ప్రభుండవు నీవ హిరణ్మయుండవు భగవంతుండవు పరమా
త్మవు భువన మిత్రుండవు చరాచరంబున కీశానుండవు శిక్షకుఁడ
వగుట ధ్యానంబునం జేసి పరమయోగి గతి వినతాజ రమేశ్వరుండవగు

---

1 మూ. భగతి

ఏ వకారగర్భితాద్యంతుండవుగా మహామంత్ర మగుచు నరువదియుదుపు
వేదాంతమునందీవ పరుండవు మహేశ్వరుండవు దేవుండవుంగాఁ బ్రతి
ష్ఠింపఁ బడుచు నీవ పరమేశ్వరుండవు విభూతిద్వయనాయకుండవు యజ్ఞ
స్వరూపుండవుగ సర్వహంతుండవగుట నీవలన ఋక్కులును సామములును
యజుస్సులును గోవులును బశుపాదులును సముత్పన్నంబు లయ్యె భవన్ముఖ
బాహూరుపదంబులవలన బ్రాహ్మణ క్షత్ర విట్ఛూద్రులు జన్మించిరి పాదం
బులవలనఁ బృథివియు శిరంబువలన దివియు మనంబువలనఁ జంద్రుండును
జక్షుస్సువలన సూర్యుండును ముఖంబువలన నగ్నిమహేంద్రులును
ప్రాణంబువలన మారుతంబును నాభివలన బ్రహ్మాంతరిక్షములును
శ్రోత్రంబువలన దిశలును బ్రాదుర్భవించె నిఖిలా
సముద్భవంబగు జగంబంతయు నివ్విధంబున సృజియించి నీవ గ్రమ్మఱ
గ్రసియింపుచు మూర్ఛాభిరతి నంది యుండినట్టుండు నాదిత్యవర్ణుం
వగుచుఁ దమంబునకంటెఁ బరంబగు జ్యోతిస్స్వరూపంబు నీవ యగుట
సయద్యుతుండవు నీవ యేకార్ణ విభూతంబగు జలంబునందు మాయా రూపఁ
బగు నశ్వత్థపత్రంబునందు సంభవించి జగన్నిలయుండ వగుచు సనాత
నుండవుగా శయనింపుచు నప్పటి వాక్యముండవు నారాయణుండవు విష్ణు
స్వరూపుండవుగా నగుదువు బ్రహ్మరుద్ర దైవర్షి మానవులును రోదసీ
కుహరాంతరాళంబును సూర్యచంద్రులును నగ్నిలోకంబులును సజాండా
దులును లేకున్క మఱియు నీచేతన సకలలోకంబులు సృజియింపంబడియె.
నీకు బ్రహ్మరుద్రచేత దాసభూతంబగు సమస్త భువనంబు నిర్మింపఁబడి
నా రసైతేని నీలోకంబు లిట్టు ప్రవృత్తంబు లగు నని యిట్లనియె 124

ఆ వె నీవు సేరిపి నిరికి నేరవు వర్ధ సా
క్షిరిపు విగ్రహుండవు దేవ నీవు
సారసాక్షుండవు విచక్షణుండవు పుర
షోత్తముండవు లోక పూజితుండవు. 126

## రామానుజుండు మరల శ్రీరంగమున కరుదెంచి యందే యధి వసించుట

సీ. భువన నివాస మాధవ విశ్వపాలక
 హరి నారాయణ సర్వశేషి
వేంకటేశ్వర భక్త వినుత నిరంతర
 యోగిరాట్చిత్త పయోజ సంస్థ
రమణీ కరలాలనా లమలంబులగు నీదు
 పాద పద్మములకుఁ బ్రణతిఁ జేతు
నా కిదె దక్క వశ్యం బగు వస్తు యు
 పాయంబు లేదు సర్వాంతరంబు

తే.గీ. కలవ నీ పాదములు గాని సరసిజాక్ష
యేమియును దోఁచ దీమెను నీదు కరుణ
నా యెదఁ జేర్చు మరవిందనాభ దనుజ
బృంద మారక వార్ధి నిశాంత కాంత 129

వ. ఇట్లంతె పరంబగు తత్త్వంబు నిదియె పరమంబగు పదంబు నీ
క్షేత్రంబునకంటెఁ బరంబు లే దితనికంటెఁ బరంబగు దైవంబు లేదని
మాటిమాటికి నిగమ సూక్తుల సత్త్వంబు గొనియాడి యంత రామానుజ
మునీంద్రుం డందు మూఁడుదినంబు లుండి శ్రీశైల పూర్ణువలన
శ్రీమద్రామాయణ రహస్యం బెఱింగి యతని యనుజ్ఞ వడసి యుత్తమం
బగు సేతువున కేఁగియందందుఁగల నిఖిల హరిరూపంబులగు విగ్రహంబుల
సేవించి సకల సమయంబుల జయించి హరి మతంబు స్థాపనంబు గావించి
క్రమ్మఱ శ్రీరంగ నికేతనంబున కేఁగుదెంచి యనవరతంబు వ్యాపకుండగు
రంగనాయకు సేవింపుచు నందె యధివసించి సర్వదేశ వాత్సల్యంబువలనఁ

పరిపూర్ణ కృపాంభోధి యగుచు నపార పాషండ దుష్ట తర్కితదీయ
కుబుద్ధులచేతఁ గుయుక్తులం జేసి కల్పింపంబడియుగాఁ బ్రాప్తంబులగు నాసుర
శాస్త్రంబులు సమస్త జగంబునకు నివిడంబు లగుచు హరి వైభవంబు గాన
రాకుండఁ గప్పికొని లోకంబు సంకరంబు గావింప వైష్ణవం బుద్ధరింపు
కొఱకు మహానుభావుండగు లక్ష్మణార్యుం డుత్తమంబగు శ్రీభాష్యంబు
గావించి పాషండ బౌద్ధ చార్వాక మాయావాద్యకర్తాదికంబులగు కుత్సిత
మతంబుల నన్నింటఁ ద్రొక్కిపడి విష్ణుప్రియులమైనను మహనీయంబును
నగు పారాశర్య ముని మతం బొక్కటి ప్రకటంబుగావించి యనంతరంబు

సీ. ధర యందుఁ గూరేశ దాశరథార్యులం
బ్రముఖులగు శిష్యచయము చేత
పూజితుఁ డగుచు సంపూర్ణ మనస్కుండు
రామానుజార్యుండు రమ్య గుణుఁడు
సారస నేత్రుని సద్భాగ్యభూములు నను
దినము వారలఁ గుడువఁ బెంచి
శ్రీశ కల్పభూజమై శ్రీరంగనాథుఁ గైం
కర్యంబు సేయుచు ఘనత మించి

తే.గీ. యచ్చటి ప్రాణసముఁడౌచు నఖిల జనుల
కధిత సుధరూప మగుచున్న యమృత మొసఁగు
బంధు వసియించె నిర్మల శాంతుఁ డగుచు
ననుదినంబును యోగసమాధియందు 181

## రామానుజుఁడు యోగంబు గైకొని పరమపదంబున కరుగుట

వ. ఇట్లు చిరకాలంబు గడపి యతిపుంగవుండు సముత్తుంగయోగంబు
గైకొని సుషుమ్నా నాడి నిష్క్రమించి పరమపదంబుఁ బ్రాపించె నిగ
మాంత శాస్త్రకారుండగు లక్ష్మణ మునీంద్రుని యేతత్కథ యెవ్వండు
విను నతండు భాగవత భక్తి మహోత్తమశ్రీఁ జెంది విధి శివ సనకాది
దుర్లభంబగు నచ్యుత పదంబుఁ జేరు నని మహాయోగి మాహాత్మ్యంబును
శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తరఖండంబు నందలి యష్టత్రింశా
ధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు నిఖిల విద్యాధురంధ
రుండగు వరునకుం జెప్పి వెండియు నిట్లనియె.

## హర్యర్చావతార ప్రభావము—భాగవత పూజా ప్రభావము

మ. అం పన్నిద్దరు సూరు లిజ్జగమునం దానంద సంధాయులై
కలయన్ భాగవత ప్రధానులగుచున్ గౌరూపాలస్వాంతులై
యిం నన్ను త్పరమ ప్రియార్థ్యులుగ నెంతే నిష్ఠ వర్తిల్లుచో
లతి మత్ప్రీతి సమాన మూర్తులు సుమీ లక్షింపఁగాఁ బ్రతతా 188

సీ. పంకజ సంజాత పార్వతీనాయక
శతధృత్ప్రభృతి నిర్జరులకంటె
సంతతాధోక్షజ సంస్మృతి రతులై
తనరారు సనకాది మునులకంటెఁ
ఘనతర యోగంబు గల్గు సర్వజ్ఞమ్మ
తాపస ముఖ్య సంతతులకంటెఁ
పరము విశాల యోగధ్యాన మూర్తులై
స్ఫురణించునట్టి భూసురులకంటె

తే.గీ. ఇమ్మహాభాగవతమును నెవ్వఁ డర్చఁ
చేసి శ్రీ విష్ణుని పదంబుఁ జెంది రట్టి
వారల వచింపుమయ్య మర్త్యవరుఁడ వగుట
నిన్ను వేఁడెద దివ్యుఁడు నిర్మలాత్మ 139

ఉ. శ్రీహరి భక్త భక్తుల విశిష్ట చరిత్రము సర్వకల్మష
వ్యూహ విభేదనంబు సతతోర్జిత భాగ్యచయంబు దుష్టవి
ద్యా హననంబు ముక్తి కొఱకై తగుదాని వినంగ నిష్ఠ నా
కీహ జనించె వేడ్క వచియింపు మహాత్మ యటన్న నిట్లనెన్ 140

## దుశ్శీలుని చరితము

ఆ.వె. వినుము మున్ను విప్రబంధుండు దుశ్శీలుఁ
డనెడు వాఁడు నొక్కఁడుండుఁ గలఁడు
చోర హింసయందు సొంపొందువాఁడు కా
ముకుఁడు క్రూరుఁడగుచుఁ బాడు నెపుడు 141

సీ. బ్రహ్మహత్యయు సురాపానంబు గోవధ
యును స్త్రీం బిపనంబును గొనుటయు
మొదలుగాఁ గల కర్మములయందు దక్షుఁడై
పొలయువాఁ డన్యరంబు దలఁచువాఁడు
దుశ్శీలుఁ డత్యంత దోషయుండగుచుఁ గాం
చి విరూప యౌవనశ్రీఁ దనర్చు
వనరుహాక్షిని నిషాదిని సతిగా నేలి
కరము నిషాద సంఘముల తోడ

తే గీ నటవిఁ దిరుగుచు మార్గమం దరుగువారి
ద్రవ్యముల సంగ్రహించుచు దగ్రవృత్తిఁ
బాని కల్మవముల కెల్ల మూలమగుచు
రహినిఁ ఘోరత్వమున నిట్లు బ్రతుకుచుండె 142

వ అంత 143

చ క్షితి నరఁ డొక్కకాలమున శేషనగేంద్రము నుండి శ్రీ ప్రమ
న్నృతి రచియింపుచుం బథమునం జనుదంచు మహాత్ముఁలన్ సమం
చితులను దివ్యమూర్తులను శ్రీహరి భక్తుం బావరించి యు
ద్ధతిఁ గొని వారి ద్రవ్యము హరించఁ గైకొనియెన్ మదాంధుడై 144

తే గీ అప్పు డ ప్రిష్ణవులు శ్రాంతులగుచు నప్పు
యని సతోషము స్మరియింపుచును మనోహ
రంబులగు వాక్యములఁ దస్కరుపరి కిట్టు
లనిరి విజ్ఞాన కోవిదు లగుటఁ జేసి 145

సీ దు ఖాలయము ఘోరదుర్గంధ ఎనిర్భరంబు
నగు శరీరంబుఁ బ్రోవఁగఁ దలంచి
దుష్టాత్మ నీ వివ్వ దొంగతనంబునఁ
బ్రాణుల నవేకుల బాధపెట్టి
ధనము గైకొన దేల తస్కరి పరకాలు
భరణిని భక్తి భాగవుల పూజ
నల్ప కేలిని సద్గతిఁ బ్రాపింపఁ
గంపు జనార్దనకరుణ గల్గి

తే.గీ. మూర్ఖ యే రీతి లోకసముద్ర పీఠ
దాఁట గలఁగని పల్కెడు తద్వచనము
విని మగుడ వారలకు నిట్టు లనియె దుర్మ
దాంధుఁ డగునట్టి దుశ్శ్రోతుఁ డతిరయమున 146

తే.గీ. ప్రాణమంతంబె నెక్కుడై పరఁగి సుఖ మొ
సంగు నిల్లాలి నెరఁగాని నరసులైన
యాత్మజాల విడి భాగవతార్చనంబు
నెట్లు సేయంగ నగును మునీంద్రులార 147

క. అని పల్కు మూర్ఖవాక్యము
విని భాగవతోత్తములు గభీరోక్తిం బెం
పునఁగొని యప్పుడు మూఢా
త్మునిఁ గాంచుచుఁ గూర్చి యనిరి తోషము లగుచున్ 148

ఆ.వె. దుఃఖ మొసఁగునట్టి తొయ్యలిని సుఖంబు
నిచ్చుదాని గాను నీవు దలఁచె
దెట్లు మోహ మడిగి యాత్మంపు స్త్రీ శరీ
రము భాగిపింతం బరాగ మగుట 149

వ. చర్మమాంసాస్థి మేదోరుధిర విణ్మూత్ర నఖరోమ మజ్జాశుక్లాది పూర్ణంబును హేయంబును దుర్గంధ సంయుతంబును నగు స్త్రీ శరీరంబు సుఖరూపంబని చెప్పరాదు శ్లేష్మసదనంబగు వదనంబును సుద్గీర్ణ దూషికా పాత్రంబులగు నేత్రంబులును నిశ్వాస నిర్గమాంతస్థ సింఘాణావకాసికయగు నాసికయు,

జిహ్వా దంతన్న స్ఖలిత రారాటాలాధరంబగు వదనంబును శిర గ్రంథి విహార స్వేదనిచయ ధురంధరంబులగు ఎమోధరంబులును మూత్ర సంక్లిన్న నితాంతంబగు మదన నిశాంతంబును పూతిం ముంపరంబుం బు వితంబయిను నగు స్థితి కాంతావయవంబులు మహాత్ముంచేత సింకిరతం బగుట లోకంబులందుఁ గాంతలయందుఁ గొబ్బ గండాద పీఠ ఒక్కి బుద్ధిమంతుం డెవ్వండు మోహితుండు గాకుండు వస్తి కూంసాది సంకీర్ణంగు వ్యాఘ్రావాసగుహాంతరతి రతుఁడులేని కందర్పకాష్ఠాం నిరాశుండగుట శ్రేయస్కాపథంగు వారొకప్పుడేని స్త్రీలయందు మొఱ్ఱలగారు బుం మూత్రప్రహరంగు ప్రమదలఁ గన్నుండేని తిరిపరు దార్ఢ్య దాస్యం భావంబులయందు గురుండగు కంధికిఁ బాణావమానంబు గావించుటు భూతిలంబునందుఁ గృతఘ్నులగు పుత్రులయం దొక్క సమయం బుంచె మహాత్ము లనురంజనంబు సేయరు దుశ్శీలాయార్జనలక్షణ నాగ్న్య యంబుంచేత దుఃఖంబు లొసంగు ధనంబుల యందేని మతిమంతులు మోహంబు సెందక యాపత్కరయంబు దృతియింపునని యిట్లు మహా భాగవతులు వర్కానవ్య దా దొరుండు ప్రశాంత చిత్తుండగుచు దాసనస్త వైష్ణవులం గూర్చి ప్రణమిల్లి యిట్లనియె 160

## దుశ్శీలుఁడు మృత్తికతో నాళ్వారాచార్యుల మూర్తుల నిర్మించి పూజించుట

సీ. పరికింపఁగా నేను పాపిష్ఠుఁడను మహా
భాగులు మీరు గృపారసజ్ఞు
లాశ్రిత వత్సలు లకట యీవద యాస
రుంగుట దుఃఖ సంకలిత బుద్ధి

చ. విదిత సధీతవేదుఁ డగు విప్రవరోత్తముఁ డన్న నెన్నఁగా
స్థిర ననధీతవేదుఁ డగు శ్రీహరిభక్తుఁడు చాల ముఖ్యుఁడం
పరఁగును భక్తిహీనుఁడు ద్విపాత్ర్యమెపై తగఁగాన నెన్నిటన్
హరిపదభక్తి యుక్తుఁడగు వాఁడు శ్రేష్ఠతముండు మిక్కిలిన్ 178

ఆ.వె. అవని శూద్రుఁడైన హరిభక్తుఁడగునేని
యరయ భక్తిరహితుఁడైన వేద
విదుని కన్న నెక్కుఁ డదిగాక హరిభక్తి
[illegible] గల్గఁ దధముఁడగు శ్వపాకి కన్న 179

కం. భగవద్భక్తి విహీనుం
డగువాఁడె క్రియ[1] లౌపర్వ్య వవియెల్లను జెం
ఎగ రాక్షస[2]కర్మము లవి
నిగదిత మగు వాఁడు చెందు నిరయం బందున్ 180

తే.గీ. స్థిరముగా విష్ణుబింబ ప్రతిష్ఠకన్న
నిల మహాత్ముకు లగు వైష్ణవుం బ్రతిష్ఠ
నలరఁ గావించు నతఁడు శతాధికము గు
ఫలముఁ బ్రాపించు నని బ్రహ్మవాదు లనిరి 181

సీ. బ్రాహ్మణాదిక చతుర్వర్ణజాతు లగు వారు
హరిలాంఛనాంచితు లగుచు నెపుడు
నఖిల మందుండగు హరియందు సుప్రార్థ్య
సద్భావయుక్తు లగుచున్న సాధులైన

---

1 మూ. లౌపర్చ్య 2 మూ. కర్మంబని

వారు భాగవతులా వారికన్నను మతి
పరవేద విదులైన వారు గారు
స్వైర మృత్యుంజ్ర భాసిత శంఖచక్రాది
చిహ్నితు ఘనతులసీ పయోరు

తే.గీ. హారమాల్యద్వయాంచితులైన పుణ్యుఁ
జూచి నారాయణుని వారిఁ జూచినటులఁ
భావ గావింప వలయును వాని పరమ
భక్తి తోడుత సంతోష భరితుఁ డగుచు 182

## భగవద్భాగవత సేవాఫలము

క. భగవచ్చిహ్నాంచితుఁ
డగు వైష్ణవుఁ బూజసేయఁ డాదృతి నెవ్వం
డాగి వానికిఁ దపక్షయమున
విగతమగు సప్తజన్మ కృతపుణ్య మిలన్ 183

క. హరి లాంఛనుఁ డగు వైష్ణవు
నిరతము పూజింపఁ జేయు నియతుఁడు సాక్షా
ద్ధరికిని పూజన చేసినటు
లరయఁగ నటులౌని యధ్వరాదుల నైనన్ 184

తే.గీ. అంత వైష్ణవ సందోహమును జూచి
యారయఁ బ్రదక్షిణపు నమస్కారములను
నెవ్వఁ డొనరుపఁ డా బుద్ధిహీన జనుని
కొఱకు నారాయణుఁడు వాలఁ గుపితుఁ డగును 185

క. తులసీకానన మొనరిచి
జలసేకాదులఁ బ్రియ మెసఁగఁ బోషింపన్
దలఁకొను నెవ్వఁ డతనిచే
నల హరి పూజితుఁడు నైన యట్లగు విధిచేన్ 186

చ. వారినిఁ బ్రతిష్ఠఁ జేసి నియమాయతిఁ బ్రాఁకం సత్ప్రపంచమున్
స్థిరమతి నెవ్వఁ డర్చనలు సేయు నతండు పితామహాదికా
మరరతిచేత నిత్యము సమర్చితుఁడై చెలువొంచి వెండియున్
బరమపదంబు నంది పరమంబగు మోదముఁ గాంచు నెంతయున్ 187

శా. శ్రీ సీతా భరత శత్రుఘ్నముఖులన్ శేషున్ విహంగేశ్వరున్
సేనేశున్ మఱియున్ ముకుంద పరిషత్సేవితులన్ మహాభక్తి భ
క్తానేకంబుఁ బ్రతిష్ఠఁ జేయు మఱి యుద్యన్నిష్ఠ చెల్వఁడు ని
త్యానందంబునఁ బొందు వాఁడు వారితో సఖ్యంతమున్ గూడుచున్ 188

తే.గీ. అమల కోమల తులసీ దళావళులను
బార్థభక్తి సాలగ్రామ పూజ సేయు
నెవ్వఁ డతనికి లక్ష్మి లక్ష్మీశ్వరుండు
నాదిదంపతు లిడఁ బ్రీతు లగుదు రెలమి 189

క. గురుఁడే సాక్షాద్ధరి యగు
గురుని ప్రియమె హరిప్రియంబు గురుభక్తతచే
హరి ప్రతుష్టుం డగుఁ గావున
గురుపూజ యొనర్పవలయుఁ గోరి నరుఁ డింపన్ 190

ఆ.వె. [illegible] త్రిదండధరుని విజ్ఞానసాధనున్
యతినిఁ గని ప్రణామ మాచరించి
పూజ సేయ వలయు భువి వరుం డందుచే
మహిత విష్ణుభక్తిమంతుఁ డగును 191

వ. సర్వమంగళ మాంగల్యంబును సర్వశ్రేయః ప్రదాయకంబును మహాయోగి మాహాత్మ్యంబును ముక్తిప్రదంబును నాయుష్యంబును శ్రీకరంబును భద్రంబును యశస్యంబును విజయావహంబును ధర్మ్యంబును పవిత్రంబును పాపఘ్నంబును నారోగ్యకరంబును సత్తమంబును నగు నీ పురాణంబు వినిన వినిపించిన సతత పఠనస్నాన ఫలంబును సర్వయజ్ఞ ఫలంబును పొంది హరికిఁ బ్రియతముం డవండు మఱియుం బుత్రకాముండు పుత్రులను ధనార్థియగు నతండు ధనంబును సంపత్కాముండు సంపదయును ముక్తికాముండు ముక్తియుం గాంచు నిహంబున సర్వార్థసిద్ధిం జెంది యనంతరంబు నం బరమపదంబునం బ్రాపించు నదియునుంగాక యేతత్పుస్తకంబు లిఖియించి మహాత్ముండగు వైష్ణవునికొఱకు నొసంగిన కృతార్థుని గృహంబున నిత్యంబును వసించియై సిరి వసించు నిర్ధపుమరుదనాథుండగు విష్ణుదేవునకు నతిప్రియులగు ద్వాదశ మహాయోగి చరిత్రంబు విని నిశ్చయించు వారలను తీరకాలంబున నుండి పోయని ప్రకృతివలన విముక్తులం గావించునని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తమ ఖండంబు నందలి చతుర్వింశాధ్యాయంబునుం గూడ యీ ఖండంబు సమగ్రంబుగా భక్తపరాయణుండగు నారాయణుండు పతిల ప్రజ్ఞా ధురంధరుండగు నరునికిం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పి వారిం గృతకృత్యులం[1]గావించె 192

---

1 మూ. గావించి

చ. జలచర కూర్మ కోల మృగసత్తమ వామన భార్గవాన్వయో
జ్జ్వల రఘువీర సీరధర సౌగత సాదిముఖ స్ఫుటాకృతీ
దళితదవాది దేవమునినాథ నుతి స్ఫురణా కృపాదృతీ
కలిత భక్త రక్షణ విచక్షణ సాధు కటాక్ష సుందరీ 193

క. రాజీవదళ విలోచన
రాజీవభవాండ భాండ రక్షా నిపుణా
రాజీవధ్వజ జనకా
రాజీవగృహా మనోజ్ఞ రాజీవకరా 194

మాలిని. దురితవన కుఠారా ధూర్జటి స్తోత్రసారా
పరమపద వినోదా భక్తలోక ప్రసాదా
శరణ దనుజారా సర్వ దేవాదిదేవా
విరచిత నుతకీర్తి వేణుగోపాల మూర్తీ 195

గద్య. [1]ఇది శ్రీమద్రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణాబ్ధ పాండిత్య
ధుర్యానవరతావనీమండలాఖండ సామ్రాజ్యధౌరేయ స్వభుజార్జితాకృత
పటహధణంధణారావ విపరీత పతన క్రియా ఢిల్లీశాధీశ దుందుభి ధ్వాన
కోలాహల హనూమద్ధ్వజాంక కనక దండీకృత హీర పల్లీకృత నందీ
పత ప్రతాప కీర్తి ప్రభావ కోసల వంశ పయః పారావార రాకాసుధాకర
హీరాంబర నాయక పౌత్ర రమణ భూపాల పుత్ర లక్ష్మమాంబా గర్భ
శుక్తి ముక్తాఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్య శీల సుమసాయక
విహారి హేమనాయక ప్రణీతంబైన భార్గవ పురాణంబునందు యదురాజ

---

1 మ ఇతి

సంచారంబును వరదరాజ స్తవంబును లక్ష్మణుండు యాదవప్రభావం
నమ్మగ్రహించుటయు శతం దశోత్తరాంత హరిక్షేత్రస్థాపనయు
గావించుటయు విశిష్టమత సిద్ధాంతంబును యజ్ఞమూర్తి సహాయ విభంగం
బున నతండు రామానుజాచార్యానుగ్రహంబు గాంచుటయు యతీంద్రుండు
శ్రీరంగంబునం దధివసించుటయు నమ్మహాత్ముండు పరమపదంబున
కరుగుటయు నూర్వ్యావతార ప్రభావంబును భాగవత పూజావిశేషంబును
నన్నది యష్టమాశ్వాసము సర్వము సంపూర్ణము ,

# చతుర్థాశ్వాసము

[182వ, పేజీలో "గ్రంథపాఠము" అనుచోట 8వ, పద్యము నుండి ఈ క్రింది భాగము చేర్చుకొనునది]

తే.గీ. ఆ పురవరంబు బాలించు నధికదయుఁడు సత్కృపాళుఁడు దుష్టశిక్షకుండు రాజ
ప్రవరుఁడును వేదవేత్త ధర్మ స్వరూపి సత్యసంధుండు బహుబలశాలియగుచు

క. ఆ రాజ యుషికి నందనుఁ డారూఢిం గలిగెఁ గొన్ని భాండముఁ దగుచున్
వేరు కులశేఖరుఁ డనం ధారుణి మానుండునను బవర్యసుతారన్

సీ. అతఁడు జనించిన దాదిగా రామాంఘ్రి తామరస ధ్యాన తత్పరుండు
వేద వేత్తయు ధనుర్వేదజ్ఞుఁడును సర్వ శాస్త్రవేదియు నీతిశాలి ధర్మ
వత్సలుండును బలవంతుఁడు శుభగుణ కలితు(డ)ష్టా పూర్త కర్త సకల
రాజమాన్యామతి తేజస్వి మూర్ధాభిషిక్తుండు సదయుండు శీల దాత

తే.గీ. దైవత ద్విజ కోటికిఁ దార్పావహుండు దేకపత్నీ వ్రతపరుండు శ్రీకరుండు
రమ్యమతి శరణాగతరక్షకుండు నగుచు ధర్మంబుచే నతఁ డవని నేలి

తే.గీ. దివ్యములగాఁ దనరు శ్రీదేవదేవు రూపము లతం(డు) డుఁ దగుచు నారూఢి భజన
మొనరించుచు జనకకులాధినాథ పాదపంకజ భృంగమై ప్రబలుచుండి

క. అతుల గుణుండయి సదుపాసిత సకలాద్భుతార సమ భక్తుండై
క్షితి నంబార్ద్రిపు పెరిగత శ్రీరంగేశపూజ సలిపి ముదమునన్

వ. ఇట్లద్భుతావతార విశాలార్చనా పరుండై నిరతంబును దద్భక్తులం బూజించుచుఁ దద్గతచిత్తుండును తత్పరాయణుండునునై శరీరార్థ ప్రాణంబుల వారికి సమర్పించుచు నిజరాజ్యం బంతయుం దదధీనంబు గావించె నమ్మహిపతి యిట్లీధంబు న రాజ్యం బు భాగవతాధీనంబుగావించి యున్నయెడ నొక్కనాఁడు భగవద్భక్తులను మహాత్ములును గరుణాకరులును శమదమక్షమాపరులును విగత రాగులును బలా(ట) మ(ధ్యాపుటి)త శ్వేత చ్ఛిద్రోర్ధ్వపుండ్రధారులును దన్మధ్య సువర్ణరేఖా సమాన హరిద్రా చూర్ణ ...

యుతులును దుంపీ సరసీరుహాక్ష మాలికా బంధురకంధరులును భుజామూల భ్రాజిత నారాయణ శంఖచక్ర చిహ్నులును (ద్వయమం) త్రానుసంధాన చరితార్థులును దదర్థానుభవానంద పులకితాంగులును వశీకృతాంతఃకరణులును జితేంద్రియులును భగవద్దాస్య యోగైకభోగులును నాచార్య నిష్ఠాగరిష్ఠులును నిజపాదకమల ధ్యా(నంబు)న నఖిల ధరణీమండలంబు పావనంబు సేయు నమ్మహానుభావులు స్నేహప్రసన్న హృదయంబున భగవద్దాసానుదాసుండగు నారాజు గృహంబు పూర్వంబు గాఁ బ్రవేశించిన

క. వారల మంత్రి ప్రేరణ వారించుచు క్షేత్రమునను వారిం గని దౌ
వారికులు నల్పి యత్తఱి నామాధిం బల్కి రిట్టు లక్షీణమూర్తి

తే.గీ. ఇప్పు డంతఃపురమున మహీశలేఖ దుపిదతోఁ గూడ సుఖగోష్ఠి నున్న వాఁడు
చనుఁడు వైష్ణవులార భూజాని నరసు వచ్చి నప్పుడు మీ రిందు వత్తు రనుడు

సీ. అది విని భాగవతాగ్రణు లౌఁగాక యని వైష్ణవ గృహాంగణాధివసతి
యొగి కీటముల కేవి మూర్తిదం బగునని యన్యోన్య వాక్యము లాడుకొనుచు
వేదికయందు నివేశించి రటుగాన క్షితి భగవద్దాసక్షీణు రైవ
సత్త్వవంతులును రోషము గల్గ నేర్చునే యంత నా ధారుణీకాంతుఁడు వరి

తే.గీ. వార ముఖమున వైష్ణవజన విరోధనంబు విని సత్వరమున శుభంబు గాంచు
శయనమువలన లేచి వైష్ణవుల కకట యీ విధంబు విరోధంబు లెందు గలవె

క. అనిరుద్ధ భక్తుఁడగు వార నిరుద్ధుల చేసితి నీ యపరాధము నే
నని చింతించి మహీపతి చని వారి సమీపమునకు సాధ్వసమతియై

ఉ. వారి పదారవిందముల వ్రాలి సమున్నతి లేచి పాణిపం
కేరుహముల్ మొగిడ్చి నృపకేసరి పల్కె దయానిధుల్ క్షమా
సారులు మీరు మిమ్ము నిటుగా నిల్పి మంత్రి కృతాపరాధమున్
జేరి క్షమింపరే శరణుఁ జెందితి దాసుఁడ నందు వేడినన్

✿

# అనుబంధము - II

# ఛందస్సూచి

| క్ర సం ఛందస్సు | ఆశ్వాసము | | | | | | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | |
| 1 ఆటవెలది | 9 | 12 | 6 | 2 | 14 | 7 | 11 | 8 | — 69 |
| 2 ఉత్పలమాల | 3 | 4 | 4 | 8 | 8 | 4 | 7 | 4 | — 42 |
| 3 ఉత్సాహవృత్తము | — | 1 | — | 1 | — | — | — | — | — 2 |
| 4 కందము | 47 | 52 | 43 | 67 | 55 | 103 | 89 | 66 | — 521 |
| 5 చంపకమాల | 17 | 6 | 9 | 14 | 8 | 15 | 27 | 10 | — 106 |
| 6 తేటగీతి | 33 | 42 | 36 | 39 | 33 | 65 | 29 | 41 | — 328 |
| 7 తోటకము | — | — | — | — | — | 1 | — | — | — 1 |
| 8 పంచచామరము | — | — | — | — | 1 | — | — | — | — 1 |
| 9 భుజంగప్రయాతము | — | — | — | 1 | — | — | — | — | — 1 |
| 10 మత్తేభము | 14 | 5 | 3 | 10 | 9 | 11 | 10 | 3 | — 65 |
| 11 మాలిని | 1 | — | 1 | — | — | — | 1 | 1 | — 4 |
| 12 శార్దూలము | 1 | 2 | — | 4 | 3 | 1 | 5 | 2 | — 18 |
| 13 సీసము | 21 | 25 | 19 | 33 | 27 | 33 | 39 | 34 | — 234 |
| 14 వచనము | 35 | 29 | 24 | 16 | 11 | 9 | 22 | 26 | — 172 |
| మొత్తము | 181 | 173 | 144 | 195 | 174 | 262 | 230 | 195 | — 1549 |

ప

# అనుబంధము - IV

# ఉపయుక్త గ్రంథసూచిక

తెలుగు


1 అపరాజితా పరిణయము – కిరీటి వేంకటాచార్యులు

2 ఆంధ్రకవి సప్తశతి – బులుసు వేంకటరమణయ్య

3 ఆచార్యరత్నహారము – వంగల సీతారామాచార్యులు

4 ఆచార్యసూక్తి ముక్తావళి – వంయూరి కేశవాచార్యులు

5 ఆముక్తమాల్యద - శ్రీ కృష్ణదేవరాయలు

6 ఆముక్తమాల్యదా సౌందర్యము – డాక్టర్ బి కోటేశ్వరరావు

7 దాశరథి చరిత్ర - నంబెరుమాళ్ల పురుషకారి కేశవయ్య
పరిష్కర్త వల్లపురెడ్డి బుచ్చారెడ్డి

8 పరమయోగి విలాసము – తాళ్లపాక తిరువేంగళనాథుడు

9 మరుగుపడిన మాణిక్యాలు - డాక్టర్ బి. రామరాజు

10 విశిష్టాద్వైత దర్పణము - కుంటిమద్ది శేషశర్మ

11 శఠకోప వాక్సుధ - శ్రీధరమల్లె

12 శ్రీమదాంధ్ర భాగవతము – పోతన

13 శ్రీ మహాభక్తవిజయము–గురుపరంపరా ప్రభావము-మేడేపల్లి వేంకటరమణాచార్యులు

14 శ్రీ రామానుజ నూత్తందాది - సంపాదకులు శ్రీ త్రిదండి రామానుజ జీయర్

15 సమగ్రాంధ్ర సాహిత్యం, 12వ సంపుటం - ఆరుద్ర

16 సూర్య సిద్ధాంత సౌరభము – సప్తమ ఖండము - పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ అనుభవానందస్వాములవారు

17 సిరినోము – బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సంస్కృతము

18 అమరకోశః - అమరసింహుఁడు

19 ఋగ్వేదః

20 ఛాందోగ్యోపనిషత్

21 తైత్తిరీయారణ్యకమ్

22 దివ్యసూరి చరితమ్ - గరుడవాహన పండితుఁడు

23 నారద భక్తి సూత్రాణి

24 ప్రపన్నామృతమ్ - అనంతాచార్యులు

25 భక్తిరసామృతసింధుః - రూపగోస్వామి

26 భార్గవ పురాణమ్

27 మహాభారతమ్

28 రఘువంశః

29 రామాయణమ్ - వాల్మీకి

30 విష్ణుపురాణమ్

31 వేదాంతదేశిక స్తోత్రాణి

32 శాండిల్య భక్తి సూత్రాణి

33 శ్రీభాష్యమ్ - భగవద్రామానుజాలు

34 శ్వేతాశ్వతరోపనిషత్

35 స్తోత్రరత్నమ్

కన్నడం

86 నగరవాడదర్శన – మహాకవి లక్ష్మీశాచన సంపు సురపుర।
సంపాదకులు బుక్కపట్నం కృష్ణమాచార్య

87 సురపుర సంస్థాన ఇతిహాస – కవటరావ్ కృష్ణరావు

88 సురపుర సాంస్కృతిక ఇతిహాస – పండితరత్నం పెరుమాళ్ళ సుందరాచార్యులు

తమిళం

89 గురుపరంపరాప్రభావమ్ - పిన్బళగియ పెరుమాళ్ జీయర్

*English*

1 A Seminar on Saints

2 Complete works of Swami Vivekananda

3 Early History of Vaishnavism in South India -
D N K S Krishna Swami Ayyangar

4 History and the Culture of the Indian People -
Dr D C Sarear

5 History and the Culture of the Indian People – K M Munshi

6 History of Religion, Thought and Life in India
- Prof Monier Williams

7 History of Aurangajeb - Prof Jadunatha Sarear

8 Indian Philosophy - Dr S Radha Krishnan

9 Introduction to Vedanta - Dr P Nagaraja Rao

10 Materials for the study of Early History of the
Vaishnava Sect Prof Hemachandra Roy Choudhuri

11 Narada Bhakti Sutra – Swami Sivananda

12 Outlines of Hindu Philosophy - V T Srinivasa Ayyangar

13 Reign of Realism - Dr R Nagaraja Sarma

14 Ramananda to Ramatirtho - Dr Nicole

15 The Brahma Sutra - Dr S Radha Krishna

16 The Cultural Heritage of India Swami Thyagesa namda

17 The Great Acharya - Prof M Ranga Charya

18 The Great Acharyas Dr K Krishnaswami Ayyangar

19 The History of Sri Vaishnavas - Prof T A Gopinath Rao

20 The Life of Ramanuja Swami Rama Krishnananda

21 Vaishnavite Reformers of India Prof T Raja Gopala Chariar

Journals

1 Aradhana

2 Prabuddha Bharata

3 Vedanta Kesari



# A P Govt O M L & R I
## Publication Series

| | | Rs Ps |
|---|---|---|
| 1 | Seeta Kalyanamu (Telugu)<br>*by Sri Shahajee Maharaja Bonsle* | 3 75 |
| 2 | Sringara Padamulu (Telugu)<br>*by Unkown poets of antiquity* | 4-40 |
| 3 | Indumatee Parinayamu (Telugu)<br>*by Tenali Ramabhadra Kavi* | 4-00 |
| 4 | Sree Geeta Govindam and Sree Geeta Sankaram (Sanskrit in Telugu Script)<br>*by Sri Jayadeva Kavi &*<br>*by Sri Pancharatnakavi Anantacharya* | 3-75 |
| 5 | Radha Vamsee dhar Vilas Natak (Hindi)<br>*by Sri Shahajee Maharaja Bonsle* | 3 75 |
| 6 | Enugula Veeraswamy's Journal (English)<br>(*Kasiyatra Charitra translat d into English*) | 14 00 |
| 7 | Sree Virupaksha Sreerama Copper Plate Inscriptions (1576-1644 A D) | 50 00 |
| 8 | Vaikrita Chandrika (Telugu grammar in Sanskrit)<br>*by Manchella Vasudeva Kavi* | 38 00 |
| 9 | Naradeeya Puranamu (Telugu)<br>*by Alladu Narasimha Kavi* | 65 00 |
| 10 | Kavi Chintamani (Telugu)<br>*by Vellanki Tatambhattu* | 26 00 |
| 11 | An Alphabetical Subjectwise Index of Telugu Manuscripts in A P G O M L & R I | 47 00 |
| 12 | Udayanodayamu (Including Vanamali Vilasamu)<br>*by Narana Surana* | 153 10 |

| | | |
|---|---|---|
| 13 | Artha Kutumbamu<br>*by Sri Vasireddy Durgasadasiveswara Prasad* | 47-00 |
| 14 | An Alphabetical Subjectwise Index of Sanskrit Manuscripts available in A P G O M L & R I , Vol *I* | 26-00 |
| 15 | Tarakabrahmaraajeeyamu<br>*by Chintalapudi Ellanarya* | 34-00 |
| 16 | An Alphabetical Subjectwise Index of Urdu Etc Manuscripts | 39 00 |
| 17 | Alankara Makarandah (Sanskrit) (Telugu Script)<br>*by Rajasekhara Sudhi* | 33 00 |
| 18 | Nahush Natak (Hindi)<br>*by Giridharadas* | 36 00 |

## Latest Publications

| | | |
|---|---|---|
| 19 | Vajragiri Narasimha Satakamu<br>*by Asakanuri Rangadhama Kavi*<br>Ramaraja V[illegible]ses Satakamu<br>*by Kotikilapudi Kodanda Kavi* | 17 00 |
| 20 | Yoga Saktaparinayamu (Telugu Poetry)<br>*by Maddipatla Appana Sastry*<br>and<br>*Kotra Venkata Rama Kavi* | 67-00 |
| 21 | Bhargava Puranamu (Telugu Poetry)<br>*by Bahiri Pama Nayakudu* | 96 00 |
| 22 | Mustalhat i Thaggi (Urdu)<br>*by Akbar Ali Alhabadi* | 93 00 |
| 23 | Telugu Descriptive Catalogue Vol *I* | 58 00 |
| 24 | ,, , Vol *II* | 58 00 |

